శ్రీ వీరరాఘవ గ్రంథావళి

# ఋగ్వేద రహస్యాలు

★

ద్రష్ట: ప్రత్నానంద

దర్శనాచార్య, కళాప్రపూర్ణ

డా. కొండూరు వీరరాఘవాచార్య

★

ప్రకాశకులు :

గ్రంథకర్త, తెనాలి

ప్రథమ ముద్రణ 1991

మూల్యము రు. 30-00



ప్రాప్తిస్థానము
గ్రంథకర్త, గాంధినగర్
తెనాలి - 522 201.

ముద్రణ :

వాణీ ఆర్టు ప్రింటర్సు, తెనాలి.

మచిలీపట్నం ఆంధ్రజాతీయ కళాశాల మాజీ ప్రిన్సిపాల్

## శ్రీ భాగవతుల కుటుంబరావుగారి

# అనుశీలనము

శ్రీ ప్రత్యానందాపర నామధేయులైన రాఘవాచార్యులవారు, ఇంతకు పూర్వము ప్రకటించిన, ఋగ్వేద దిగ్దర్శన గ్రంథములలో లేని కొన్ని రహస్య విషయములను ఈ గ్రంథములో సేకరించి యిచ్చినారు. అందుచే ఈ గ్రంథ నామము సార్థకమే. వానితో నీరచనము గతార్థము కానందున నచటనచట నా గ్రంథములలోని విషయములు కొద్దిగా కనపడుచున్నను, నీ గ్రంథము గూడ వేద రహస్య విశేష జిజ్ఞాసువులకు అవశ్యము ఉపాదేయమే.

పూర్వగ్రంథములందు వలెనే ఇందులోగూడ గాయత్రీ విశ్వకర్మలకు నమస్కారము నిబద్ధమైనది. దీనివలన ఈ గ్రంథ పరమతాత్పర్యము సూచితమైనది. ఈ నమస్క్రియలో నొకరహస్యమున్నది. పంచముఖాది సామ్యమునకు, సృష్టి-స్థిత్యాది కర్తృత్వమునకు వ్యాప్యవ్యాపకభావము సూచితమైనది. గాయత్రీ విశ్వకర్మలకు జాయాపతిత్వము జగత్పితృత్వము అర్థసిద్ధములైనవి. కాళిదాస మహాకవి నమస్కరించిన, వాగర్థరూప పార్వతీ పరమేశ్వరులు ఇచట భిన్ననామములతో మన మనసుకు స్ఫురింతురు. మొత్తమునకిది సరిక్రొత్త భావమైనను ప్రమాణబద్ధమును, విశేష సంభావనీయమును చేసినారు.

గ్రంథాదిలో, మధ్యలో, అవసానములోగూడ విశ్వకర్మ పారమ్యము ప్రతిపాదితమైనది. అందుచే నీ రచనమునకు విశ్వకర్మ పారమ్య స్థాపనమునందే పరమ తాత్పర్యమనవచ్చును. ఆ యా దేవతా స్వరూప వర్ణనములు, ఆ యా సూక్తముల అర్థవివరణములు దానికి అనుషంగికములు. వానికి అవాంతరతాత్పర్యమే యున్నది.

గ్రంథాదినున్న త్ర్యంబక మంత్రార్థవివరణము ఆచార్యులవారి ప్రజ్ఞోపజ్ఞలకు అద్దము పట్టును. నాకు తెలిసినంతలో నిటువంటి వ్యాఖ్యయపూర్వమే. ఈ మంత్రమునకు దరిదాపుగా ముప్పది యర్థములను తెలిపినారు. విచిత్ర రమ్యభావ రత్నకంబళమును అందించినారు. త్ర్యంబక శబ్దములోనున్న "త్రి''అను సంఖ్యావాచకశబ్దము, అంబక శబ్దమునకుగల నేత్రము, బాణము, తండ్రి-అను నర్థములు, నేత్రము దర్శనసాధనమగుటచే, అంబకశబ్దమునకు సాధనము అనికూడ నొక లక్ష్యార్థమును ప్రతిపాదించుట ఆ సాధనముల, త్రిత్వము, అటువంటివాని అనేకత్వము-వీనిని ఆధారముగ చేసికొని, అనేక వ్యాఖ్యలను చేసినారు. ఇతరత్ర గూడ, త్రి, పంచ, సప్త, షోడశ-సంఖ్యల, సంఖ్యేయములను, పృథివి, ఊర్ధ్వ, అధో, మధ్యమ పదములను ఆధారముగ చేసికొని, ఆధ్యాత్మికార్థములను కుండలినీయోగ పరార్థములను ప్రదర్శించినారు. ఉదాహరణమునకు త్రిత్వప్రసక్తి వచ్చినప్పుడు సచ్చిదానందములు, సత్వరజస్తమోగుణములు, స్థూలసూక్ష్మకారణ శరీరములు, ఇడాపింగళాసుషుమ్నలు, సూర్యచంద్రాగ్నులు, ఉదాత్తానుదాత్తస్వరములు, త్రికాలములు, మొదలగువానిని స్వీకరించి వివిధార్థ ప్రదర్శనము చేసినారు. అనవధానులైన పాఠకులు తబ్బిబ్బులకులోను అయినను బుద్ధికిపదును పెట్టినారు. ఏతాదృశార్థ ప్రతిపాదనలో ఆచార్యులవారు ప్రదర్శించిన అశేష శేముషిని కాదనలేము. అందుచే భావుకులు, వేదవాక్యగాంభీర్యమును తెలిసికొనగోరువారు, ఈ భాగమును చదివి తీరవలయును.

ఇప్పుడొక ప్రశ్నయుదయించును. ఈ రీతిని వివిధార్థ ప్రతిపాదన చేయుట, సమంజసమేనా ? ఈ యర్థములు, లక్ష్యములా, వ్యంగ్యములా ? లక్ష్యములగుచో, వివిధ లక్షణలలో ఏ లక్షణావృత్తులకిచట తావున్నది. ఈ వృత్తినాశ్రయించుట వలన ప్రయోజనమున్నదా? ఈ పద్ధతిసంప్రదాయసిద్ధమా? శిష్టపరిగృహీతమా ? కానపుడు ప్రత్నానందులనింత ప్రశంసింపదగునా ? ఊహాపోహకుశలత యొకటియున్న చాలునా ? అందురేమో ! పారిభాషికముగ

ఈ యర్థములను, అన్ని తావులలోను, ఒకసూత్రమునకు బద్ధమైనవని ఒక వేళ చెప్పలేకున్నను, ఈ ద్వ్యర్థ ప్రతిపాదనము సంప్రదాయసిద్ధమే. శిష్ట పరిగృహీతమే. వ్యాకరణ మహాభాష్య ప్రణేత పతాంజలి మహర్షి అగ్ని పరముగా ప్రసిద్ధినొందిన ''చత్వారి శృంగా త్రయో అస్య పాదాః'' అను మన్త్రమునకు చత్వారి, త్రయ, ద్వే, సప్త అను సంఖ్యల నాధారముగ చేసి కొని వ్యాకరణశాస్త్రపరమైన యర్థమును ప్రదర్శించినారు. శ్రీవిద్యారణ్యులే త్ర్యంబక శబ్దమునకు త్రి = మూడు, అంబకము, తండ్రి - అనునర్థమును గ్రహించి,బ్రహ్మవిష్ణురుద్రత్రయమునకుతండ్రిఅని,వశిష్ఠుడుచెప్పినయర్థమును గూడనంగీకరించినారు. అతి ప్రసిద్ధమైన "అస్య వామస్య'' సూక్తములోని మొదటిమన్త్రమునకు మాత్రము ఆధ్యాత్మికార్థమును గూడచెప్పి, మిగిలిన మన్త్రములకునునిట్లే చెప్పవచ్చుననినారు. "ద్వాసుపర్ణా సయజా" అను మంత్రమునకు రెండర్థములను అందఱును అంగీకరించినారు. అస్యవామస్య సూక్తమునకంతకును, ఆత్మానంద భాష్యము, ఆధ్యాత్మిక పరమైన దున్నది. వేదమున కర్థమును చెప్పుటలో యాజ్ఞిక, నైరుక్తిక, ఐతిహాసిక, ఆధ్యాత్మి కాది- సంప్రదాయములున్నవని యాస్క-వచనమువలన తెలియుచున్నది. నాస దీయసూక్తమునకు, శంకర, రామానుజ, మధ్వాచార్యులు, వారి వారి సిద్ధాన్త ములకు సరిపోవునర్థముల నిచ్చినారు. శ్రీ మధ్వాచార్యులవారు, అగ్ని,వాయు, మిత్ర, వరుణాది శబ్దములకు, వ్యాకరణ వ్యుత్పత్తి ననుసరించి విష్ణువేయర్థ మని నిరూపించి మొదటి 40 సూక్తములను విష్ణుపరముగనే సమన్వయించి నారు. ఋగ్వేదమే ఋక్కులను గుఱించి ''ఋచః నిన్యః - రహస్య వాచకాః, అని చెప్పినదని విమర్శకు లంగీకరించుచున్నారు. ఇటీవలనే ఒకరు సామవేదములోని, అగ్ని, సోమ మొదలగు శబ్దములు (activity, energy) క్రియాశీలత, భౌతికశక్తి, మొదలగు నర్థములనే తెలుపుననియు సామవేదము అంతయు సృష్టిప్రక్రియను, శరీరేంద్రియ బుద్ధివ్యాపారములనే వర్ణించుననియు, నిరూపించుచు భాష్యమును వ్రాసినారు. శ్రీ అరవిందులు ఋగ్వేదమునకు ఆధ్యాత్మిక పరార్థమును తెలిపినారు. జయతీర్థులను మాధ్వ

భాష్య వ్యాఖ్యాత, మహాపండితుడు, తార్కికుడు, వేదాన్తి, వేదమునకు మూడు విధములైన అర్థములు ఉండుననినారు. ప్రస్తుతము ఆచార్యులవారు త్ర్యంబక మంత్రమునకు అనేకార్థములను ప్రతిపాదించి, వానిని సాధన పరముగనో; సిద్ధిపరముగనో, యోగపరముగనో, ఉపాసనా పరముగనో వర్ణించి, ఈ యర్థములన్నియు సప్రయోజనములే అనుచున్నారు. అందుచే నీయర్థ ప్రతిపాదనను త్రోసిరాజనుట సాధ్యముగాదు. సాధకులు వాని నుపయోగించు కొనవలెననియే ఇందు సూచితమైనది. ఉదాహరణమునకు అకారోకార-మకార త్రితయాత్మకమగు నోంకారము నర్థముగా గ్రహించి, దానిని ప్రాణాయామములో నెట్లు వినియోగించు కొనవలయునో వివరించి నారు. ఇతరత్ర ఏ యే పదార్థముల నే యేరీతిని భావన చేయవలయునో చూపించినారు. చివరకు భౌతిక పరమైన Matter, energy అను వానిని, మూడు కనులుగల కొబ్బరికాయను గూడ వదలలేదు. ఇన్ని యర్థములను చెప్పి, చివరకు ఈ త్ర్యంబక రుద్రుడు విశ్వకర్మయే, అని ఒక్కసారిగ పాఠకులకు విశ్వకర్మ పరిచయమును చేసినారు. * వాస్తవముగ నీ గ్రంథము లకు విశ్వకర్మ తత్త్వసర్వస్వము లేదా విశ్వకర్మ విశ్వరూపము అని పేరు పెట్టవచ్చును. అయినను ఇతర దేవతల వర్ణనలు, విశేషములుగూడ నున్నందు వలననో, పై నామకరణములవలన గ్రంథములకు పాక్షికత యబ్బుననియో, విశ్వజనీనతకై ఋగ్వేదదిగ్దర్శనము, ఋగ్వేదరహస్యాలు అని నారనుకొందును.

ఈ గ్రంథమును, మిగిలినవానినిగూడ "అథాతో విశ్వకర్మమీమాంసా'' లేక, ''అథాతో విశ్వకర్మతత్త్వజిజ్ఞాసా'' అని మొదలిడవచ్చును అనిపించు చున్నది.

---

* వసురుద్రాదిత్యులు విశ్వకర్మ తనయులనికదా యజుర్వేద మన్నది. ఆది త్యులలో విష్ణువున్నాడు. రుద్రులు సరేసరి. "విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవః" అన్న మంత్రము విశ్వకర్మ బ్రహ్మగా అవతరించినాడన్నది. కాన త్ర్యంబకుడు విశ్వకర్మయనుట సప్రమాణము -గ్రంథకర్త.

ఇంకొక విషయమునుగూడ నిట జ్ఞాపకము చేసికొనవచ్చును. ఈ విశ్వకర్మ పారమ్యవాదము కేవలమీయాచార్యో పజ్ఞముగాదు. ఉదయనాచార్యులవారు కుసుమాంజలి గ్రంథములో, అనేకులు, ఒకే పరమాత్మను అనేకనామములతో పిలుచుచున్నారు, అని వివరించుచు "కారవోఽపి విశ్వకర్మేత్యుపాసతే" అనినారు. కాగా 9,10 శతాబ్దముల వరకు గూడనిది ప్రచారములో నున్నదియే. ఈమధ్యకాలములో మరుగుపడిపోయినదానిని పైకితీసి, దానికి వేద ప్రామాణ్యమును, ఉపపత్తులను ఆచార్యులవారు చూపినారు. వారి నవలలు, శిల్ప దర్శనము మొదలగు గ్రంథములలోగూడ, శిల్పి, శిల్పకళా, విశ్వకర్మల తత్త్వ ప్రాశస్త్య ప్రతిపాదనచేసినారు. సమానులలో నుత్తమ శ్లోకులైనారు. శివాద్వైతము, విష్ణుపారమ్యము, శాక్తాద్వైతము, సత్తాద్వైతములవలె విశ్వకర్మాద్వైత సిద్ధాంతముగూడ నొకటియున్నదని సప్రమాణముగ ఆచార్యులవారు నిరూపించినారు. అస్తు! సూతసంహితా హృదయమునిచట పాఠకులు తలపునకు తెచ్చుకొనినచో చాలును. వైషమ్యములకు తావుండగూడదు. ఇక ప్రస్తుత గ్రంథ విషయానుశీలనకు వత్తము–నాసదీయ, పురుష, విశ్వకర్మ సూక్తములకు, ఈ ఋగ్వేద రహస్య గ్రంథమున అతివిస్తరమైన వ్యాఖ్యలభించును. వానికి. ఈశ, శ్వేతాశ్వతర, ముండకాద్యుపనిషత్తుల భావములతో, సామ్యములు ప్రదర్శితములైనవి. పురుషసూక్తమును విశ్వకర్మాది సూక్తములతో తులనాత్మకముగ పరిశీలించుట జరిగినది. ఫలితము–? ఇచటనే, ఆచార్యులవారి అర్షప్రజ్ఞ సూచితమగును. పురుషసూక్త నాసదీయసూక్త భావములన్నిటికిని, విశ్వకర్మ సూక్తమే ఆధారమందురు. సూర్యచంద్రాగ్నులు, విష్ణువు, రుద్రుడు, స్త్రీదేవతలైన అదితి, సరస్వతి, మొదాలైనవారుగూడ విశ్వరూపాత్మకులేయని ఆయా దేవతాలక్షణ సామ్యముల నాధారముగ చేసికొని చక్కగ నిరూపించినారు. విశ్వకర్మకే, తరువాతికాలములో, త్వష్ట, బ్రహ్మ– అను నామకరణము జరిగినదని తెలిపిరి. భగవద్గీతకుగూడ విశ్వకర్మ సూక్తమే మూలమని నిరూపించిరి. ఈ విధముగ నెటుచూచినను శ్రీమదా

చార్యులవారిని, విశ్వకర్మ, విశ్వకర్మసూక్తములే ప్రధానములై గ్రంథమును కొనసాగజేసినవి. అట్లని అన్య దేవతలను విస్మరించలేదు. సర్వాత్మ భావమునే ప్రదర్శించిరి. నాసదీయ లక్ష్యము, విశ్వకర్మసూక్త లక్ష్యము, వానియోగ సాధన ఏకరూపముగ నున్నదనినారు. ఇంతకును తేలినదేమి? వేదమును - ఋగ్వేదమును అధ్యాత్మికభావ ప్రధానముగగూడ భావనచేయ వలెను. అగ్ని, మిత్రవరుణాదులనుగూడ, నారీతిగ భావనచేసినచో, నది భవ తారకమగును. ఋగ్వేద, నాసదీయ, విశ్వకర్మ, పురుష, మోక్షసూక్తముల లోని యంశములే ఉపనిషత్తులలో విస్తృతములైనవి. విశ్వకర్మయే ఉపని షత్ బ్రహ్మ. బ్రహ్మకు విశ్వరూపుడు, అనునది మఱియొక పేరనుటయే కాదు, విశ్వకర్మనామాంతరమే బ్రహ్మమనుట. విశ్వకర్మాద్వైత ప్రతి పాదననునుసరించి విశ్వకర్మ శబ్దముయొక్క బ్రహ్మశబ్దార్థము పూర్తిగా విరోధించునే-ఒకటి సోపాధికము, ఒకటి నిరూపాధికముగవా: అందురేమో. విశ్వకర్మ శబ్దమునకే బ్రహ్మశబ్దార్థముగూడ చెప్పవచ్చునని యాచార్య నిర్ణయము. సోపాధిక, నిరుపాధికములను ఏకముగా నుపాసించుట ప్రత్నా నంద తాత్పర్యము: "బ్రహ్మసత్యం జగద్బ్రహ్మ" అనునది యాచార్యుల దృష్టి.

ఇప్పటికి త్ర్యంబక పదార్థ ప్రతిపాదనా విశిష్టతను, విశ్వకర్మాది సూక్తార్థ ప్రతిపాదనా విశేషములనుగూడ పరామర్శించినాము. 107, 112, 143, 146, 151, 154, 190, 224 పుటలలోని విషయములు అందఱ కును పఠనీయములే. త్రిసప్త చక్రరహస్యము బాగున్నది. సరస్వతీసూక్త వివరణము మననీయము. వాగర్థ రహస్యము, వాక్కు-వాచస్పతి భాగము లును అవధార్యములే.

అజాతాచల శూన్యవాదములుగూడ నీ గ్రంథములో సూచితములైనవి. బౌద్ధులు నాస్తికులుగారు. శాంకరులు ప్రచ్ఛన్న బౌద్ధులుగారు-అని ఇచట వక్కాణించినారు. గ్రంథాన్తిమభాగములోని విషయములుగూడ ఉపాదే యములే. విస్తరభీతిచే వాని నిట పరిశీలించుట లేదు.

బ్రాహ్మణ్యము, బ్రాహ్మణ వర్ణమును గుఱించి నాలుగైదు తావులలో, ఆచార్యులవారు చర్చించినారు. ''బ్రహ్మ'' మనగా వేదము, వేదజ్ఞానముగలవాడే బ్రాహ్మణుడు అనునొక యర్థమును చెప్పినారు. అది ఉపాదేయమే. ఈ సందర్భమున బృహదారణ్యకోపనిషత్తులోని 2-5-15 మన్త్రమును, వ్యాకరణ మహా భాష్యములోని "తపః శ్రుతం చ యోనిశ్చేత్యేతత్ బ్రాహ్మణకారకమ్। తపశ్శ్రుతాభ్యాం యో హీనో జాతి బ్రాహ్మణ ఉచ్యతే'' అనుశ్లోకమునుగూడ పాఠకులు గమనింపవలయును.

శ్రీమదాచార్యులవారి యీ యపూర్వకృషి, వారి తపఃఫలితమే. (తప, ఆలోచనే) ఇదివారి ఆలోచనామృతమే. అమూల్యవిషయ ప్రదర్శకము, జిజ్ఞాసు బుద్ధివికాసకము, విశ్వకర్మ పారమ్య ప్రదర్శకము, వేద దైవత స్వరూప ప్రతిపాదకము. వేదాధ్యాత్మిక పరతా ప్రమాపకమునను టనిస్సంశయము. దాన సూక్తములు, ''అస్యవామస్య" మొదలైన కొన్ని సూక్తములను ఇతర రచనములలో చూపుదురనుకొందును. జిజ్ఞాసు-సాధక విద్యార్థి, లోకమునకీ గ్రంథములు అవశ్యపఠనీయములు. గ్రంథాలయములలో వీనికి సముచిత స్థానమావశ్యకము. ఇట్టి ప్రామాణిక గ్రంథములు ఆంగ్లాది భాషలలోనికి అనువదింప బడినచో ఎంతో లోకకల్యాణము జరుగును.

శమ్

భాగవతుల కుటుంబరావు
29/8/91

20-17-(1)
నరసింహనగర్
చిలకలపూడి Po
పిన్-521 002

# అమృతత్వసిద్ధి

'సాహిత్యబ్రహ్మ' డా॥ ఎ. వి. యల్. నరసింహారావు
M. A., Ph. D.,
రిటైర్డ్ డైరెక్టరు, ఆం.ప్ర. ప్ర. ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయం.

భారతీయమైన హైందవ సంస్కృతికి వైదికవాఙ్మయం మూలకందం. వైదికవాఙ్మయానికి శిఖరాయమాణం వేదచతుష్టయం. చతుర్వేదములలో ఋగ్వేదానికిగల ప్రశస్తి అసాధారణమైంది.

ఋక్కు జ్ఞాన ప్రధానం; యజుస్సు క్రియాప్రధానం: సామ ఇచ్ఛా ప్రధానం. అథర్వం ఋగ్యజుస్సామ సమాహార రూపమైంది; కనుక వేద త్రయాంతర్గత బ్రహ్మతత్త్వం అథర్వంవల్ల సాధ్యం. సాధన ఋక్కుతోనే మొదలౌతుంది.

మహావాక్య ప్రకరణంలోని 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనే ప్రథమవాక్యం జ్ఞానప్రధానమైన ఋగ్వేదాంతర్గతమైనదే. ఋఙ్మంత్రములనుండి వెలువడే జ్ఞానప్రకాశం సామాన్యుల జీవితాలలోకూడా వెల్లివిరియించటానికి ప్రాక్ప్రతీచీ భాష్యకారులు పలువురు తమ జీవితాలనే వెచ్చించారు. ప్రాగ్భాష్యకారులలో సాయణ విద్యారణ్యులు, ప్రతీచీభాష్యకారులలో వేదానువక్తలైన మాక్స్‌ముల్లర్, బ్లూమ్స్‌ఫీల్డ్ మొదలైనవారు గణనీయులు. భారతీయులలో దయానంద సరస్వతి, తిలక్ మొదలైన మహాశయులు వేదతత్త్వాన్ని జనబాహుళ్యం సుగమంగా తెలుసుకొనేటట్లు చక్కని వ్యాఖ్యలు వెలయించారు.

ఎందరెంత సుగమసుందరంగా వ్యాఖ్యానించినా అగాధమైన వేద తత్త్వం ఇంకా ఇంకా తెలుసుకోవలసిందిగానే ఉంటోంది. అందులోని

రహస్యాలు అన్వేషించదగినవిగానే మిగిలిపోతున్నాయి. లోకులు విధిగా తెలుసుకోవలసిన ఋగ్వేదరహస్యాలు కొన్నింటిని 'ప్రత్నానంద' నామకులైన కళాప్రపూర్ణ డా॥ కొండూరి వీరరాఘవాచార్యులుగారు ప్రకృత గ్రంథ రూపంలో వెలువరించారు.

ఆచార్యులవారు తమ గ్రంథరచనా జీవితానికి షష్ట్యబ్దపూర్తి జరుపుకొని చాలా రోజులైంది. కావ్యాలు, జీవితచరిత్రలు, నవలలు, విమర్శలు, పరిష్కరణలు, పీఠికలు, రేడియోనాటికలు, శతకములు, దర్శనములు మొదలుగా ఈయన కొనసాగించని సాహిత్యప్రక్రియలేదంటే ఆశ్చర్యపడనక్కర్లేదు. వీరిరచనలన్నీ ఒకఎత్తు, దర్శనసాహిత్యం ఒకఎత్తు. ఆత్మదర్శనం, శిల్పదర్శనం, సాహిత్యదర్శనం, యోగదర్శనం మొదలైనవి తత్త్వ నిరూపణాత్మక దర్శన గ్రంథాలు. రూపశిల్పం, వాఙ్మయశిల్పం, భావ శిల్పం, మనఃశిల్పం మొదలుగాగల బహువిధ శిల్పలక్షణాలను దర్శించ గలిగినశక్తి విశ్వరూప సందర్శనం చేసిన ఆత్మద్రష్టకు మాత్రమే సాధ్యం. అట్టి సాధనలో పచేళిమమైన ఫలాలు పండించుకొన్న ఆచార్యులవారు ఆ ఫలాలను లోకులకు ఉదారంగా పంచిపెట్టే ప్రయత్నమే వారి బహుగ్రంథరచనా వ్యవసాయం. దాదాపు ఎనభైయేళ్ళు నిండబోతూ పండినవయస్సులో ఉన్న ఈ పండితుని 'సమదర్శి' లక్షణం "ఋగ్వేదరహస్యా"లలోని ప్రత్యక్షరం ప్రత్యక్షం చేస్తుంది.

లోగడ ఋగ్వేద దిగ్దర్శనం పేరుతో వెలువడ్డ మూడు సంపుటాల కంటే భిన్నమైన నూతన రహస్య నివేదికగ్రంథం ఈ 'ఋగ్వేదరహస్యాలు'.

"సృష్టిలో మొట్టమొదట పుట్టిందిఏది ? అనాది సిద్ధంగా ఉన్నదేది ?- అంటే - జగత్కారణమైన వస్తువేది ? తమస్సా ? అవ్యక్తమా ? మూల ప్రకృతియా ? మాయయా ? అవిద్యయా ? అజ్ఞానమా ? ఈ వివిధపదాలచే చెప్పబడిన జగదుపాదానకారణమైన సద్వస్తువా ? అసద్వస్తువా ? సదసదతీతమై జగత్కారణమైన వస్తువా ? ఏది ? మొట్టమొదట పుట్టింది ఏది ?

ప్రశ్నకు ఋక్కు చెప్పిన వివరణకు ఆచార్యులవారు సంకేతితార్థాలుకూడా స్పష్టంచేశారు.

"విష్ణోః కర్మాణి పశ్యత। యతో వ్రతాని పస్పశే ఇంద్రస్య యుజ్యః సఖా".
[ఋ 1-22-19]

"పరమాత్మ స్వరూపుడైన విష్ణువుయొక్క సమర్థవంతములూ, మహైశ్వర్య ప్రదములూ అయిన సజ్జనపాలనాది కృత్యములను చూడండి. తాను చేసే కర్మలచే నియమములు సృజించిన కమలనాభుడు ఇంద్రులకు యోగ్యుడైన స్నేహితుడే సుమా!" అని భావం.

ఇంద్ర విష్ణువుల జీవేశ్వర తత్త్వాన్ని ఈ ఋఙ్మంత్ర వ్యాఖ్యలో వివరించారు ఆచార్యులవారు.

ఈ ఋక్కు సామవేద వాంకారశాఖగా పఠించబడటమూ కద్దు. జీవేశ్వరుడైన విష్ణువునకు ఇంద్రుడు జీవసదృశుడు కనుకనే శుక్లయజుర్వేదంలో ఇంద్రుడు విశ్వకర్మేంద్రుడుగా పేర్కొనబడ్డాడు. విష్ణువు విశ్వకర్మతుడు.

"విశ్వకర్మన్ హవిషా వర్ధనేన త్రాతార మింద్రమకృణో రవధ్యమ్
తస్మై విశః సమనమంత పూర్వీరయ ముగ్రో విహవ్యో యథాసత్
ఉపయామ గృహీతోఽసీంద్రాయత్వా విశ్వకర్మణ ఏషతే యోనిరింద్రా
యత్వా విశ్వకర్మణే."

[శు. యజు. అధ్యా 8_మం. 46]

పై మంత్రానికి విశ్వకర్మేంద్రుడే దేవత. జీవేశ్వరుడైన విశ్వకర్మ విష్ణువుగా చెప్పబడగా జీవుడైన ఇంద్రుడు విశ్వకర్మాంశగల విశ్వకర్మేంద్రుడు కావటంలో ఆశ్చర్యం లేదు.

విశ్వకర్తగా, విశ్వభర్తగా, బ్రహ్మణస్పతిగా, వాచస్పతిగా చెప్ప

బడిన విశ్వకర్మను వైదికవాఙ్మయం వేనోళ్ళతో ప్రస్తుతిస్తూ, వేయికన్ను లతోచూస్తూ, వేయిపాదాలతో పురోగమిస్తూ పురుషసూక్తం ప్రసాదిస్తుంది.

వాచస్పతియైన విశ్వకర్మ గాయత్రితో కలిసే ఉంటాడు. ఇట్లా చెప్పటానికి కారణం? "వాగ్వై గాయత్రీ"; "వాగ్వై సరస్వతీ"; "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే...." అనే శ్రుతిసూక్తులే. గాయత్రీ విశ్వకర్మలు వాగార్థాల సమిష్టిరూపమే; త్రీపుం సమాహారరూపమే. ఆ సమాహారరూప రహస్యాలు ఋగ్వేదంనుండి వెలికిదీసిన మహామనీషి ప్రజ్ఞానంద శ్రీ రాఘవాచార్యులుగారు.

ఇట్టి మనీషులకు అమృతత్వసిద్ధి అవలీల. ఋగ్వేద 'త్ర్యంబక' మంత్రరహస్యాలు వారికి తెలియనివి లేవు. వసిష్ఠమహర్షి చూపు ఎంత సుదూరం పోగలదో, వారిచూపుఅంత సుదూరం పోగలదు. త్రిమూర్తులకు కారణభూతుడై త్ర్యంబకుడుగా చెప్పబడిన విశ్వకర్త సమగ్ర విశ్వరూపం వారికి సులభగోచరం.

"త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్."

[ఋ. 7-59-12]

గ్రంథంలోని తొలి 48 పుటలు ఇందలి అమృతార్థాన్ని ప్రవ్వితలకెత్తుతున్నాయి. ఈ అమృతార్థసిద్ధి ఒక్క ప్రజ్ఞానందులకేకాదు; పఠితృలోకానికి కూడ. ఒక్కమాటలో చెప్పాలంటే "ఋగ్వేద రహస్యాలు" అభినవ సాయణం.

హైదరాబాద్ — వానిలి వేంకట లక్ష్మీ నరసింహారావు
31-8-1991

# వేదహృదయము

శ్రీ భాగవతులవారు ఈ ఋగ్వేద దిగ్దర్శనములకు "విశ్వకర్మ తత్త్వ సర్వస్వము" లేదా "విశ్వకర్మ విశ్వరూపము" అనిపేరుపెట్టి "అథాతో విశ్వకర్మ మీమాంసా" లేదా "అథాతో విశ్వకర్మతత్త్వ జిజ్ఞాసా" అని ప్రారంభించ వచ్చుననుచున్నారు. అదివారిభావము, ఇందొక్క విశ్వకర్మ తత్త్వము మాత్రమే ప్రదర్శింప బడలేదు. విష్ణు, బ్రహ్మ, రుద్ర, పురుష, హిరణ్యగర్భ త్వష్టృ ప్రభృతుల విశేషములెన్నో ఉగ్గడింప బడినవి. ఇవి అన్నియు "ఏకం సత్" అను దానియొక్క నామరూపాంతరములే అని నిరూపింపబడినవి. ఇంద్ర, మిత్ర, వరుణ, యమ, అగ్ని ప్రభృతి సర్వదేవతల తత్త్వము మూలమున ఒక్కటేయని నిరూపింపబడినది. ఇట్టివెన్నియో విశేషములుండి ఋగ్వేద రహస్యములను బయలుపఱచుటయే ప్రధానకార్య మయినందున శ్రీ కుటుంబరావుగారన్న పనిజరుగలేదు. "యో దేవానాం నామధా ఏక ఏవ" ఒకే దేవదేవుడు సర్వదేవతల నామరూపములను ధరించు చున్నాడని ప్రతిపాదించుటయే వేదహృదయము కదా. ప్రత్నానందులది సంకుచితము, పాక్షికము, స్వార్థము అయిన దృష్టికాదు. అది సర్వాత్మ భావమునకు, "సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మైవేదం విశ్వం" అను సూత్రములకు కట్టువడినట్టిది. అందుకే ఆయన "బ్రహ్మ సత్యం జగ న్మిథ్య" అనడు. "బ్రహ్మ సత్యం, జగద్బ్రహ్మ" అనునది ఆయన లక్ష్యము. దీనినే గీత-"యో మాం పశ్యతి సర్వత్ర, సర్వంచమయి పశ్యతి" అన్నింటిలోను నన్ను చూడవలెను. అన్నిటిని నాలోనే చూడవలెను-అన్నది. అఖండ పరబ్రహ్మమును, జగమును అభేదముగా భావించి ఉపాసించి తరించుటయే ప్రత్నానంద తత్త్వము.

ఋగ్వేద రహస్యగ్రంథకర్త విశ్వకర్మ ఋషిగోత్రుడైనందున తన గ్రంథముల యందంతటను విశ్వకర్మ మహిమలనే, ఆ దేవుని గొప్పదనమునే

ఉద్ఘాటించి నాడనుభావము కొందఱు పాఠకులకు కలుగవచ్చును. అట్టి అపోహానుదూరము చేయుటకు నాలుగుమాటలు వ్రాయవలసి యున్నది.

తనది, తనవాడు అను నభిమానము మానవసహజముగానుండి ఎవో పనులను చేయించు ఘట్టములు జీవితంలో ఉండకపోవు. కాని ఒక గ్రంథ కర్తగా అందును వేదమువంటి సనాతన గ్రంథములోని విశేషములను వివరించునప్పుడు అట్టి అభిమానమునకు గ్రంథకర్త లోనగుచో అతడు అపహాస్యమునకూ, నిందలకూ, అనృతదోషములకూ గురికాక తప్పదు. అట్టిదానిని శిష్టుడైన ఏ గ్రంథకర్తయు కోరుకొనడు.

వేదమనెడి మహాసముద్రమువంటి గ్రంథములో ఎన్నెన్నో రత్నములు దాగియున్నవో, వాటిని ఎందఱెందఱు ఎంతెంతవఱకు పైకితీసి చూపినారో ఈనాటికి కడముట్టినదని యెవ్వరును చెప్పజాలరు. అనేకులైన మహనీయులు వేదసముద్రమునుమథించి అమృతకలశములను పైకెత్తక పోలేదు. అంతమాత్రమున ఆ వేదార్థామృతము పూర్తిగా మన కందినదనిఅనలేము. పూర్వులుసల్పిన కృషిని ఆధారముగా చేసికొని ఇంకను దానిని మథించి అమృత భాండములను ఎత్తి లోకమునకందించు అవకాశము లేకపోలేదని ఏమాత్రము విజ్ఞతయున్నను తెలియకపోదు. అట్టి ప్రయత్నమే ఈనాడు ప్రత్నానందులు చేయుచున్నది.

విశ్వకర్మ అనగానే ఏదో ఒక వర్గమునకో, సంఘమునకో, చేరిన వ్యక్తిమాత్రుడనీ, శిల్పాచార్యుడనీ, సామాన్యముగా తలంచుచుందురు. వ్యావహారికముగా, అది సత్యమైన కావచ్చును. కాని వేదముమాత్ర మిట్లు భావించలేదు. వేదదృష్టిలో విశ్వ మనగా ఎన్నెన్నోగ్యాలక్సీలతో గూడిన బ్రహ్మాండము. ఆ బ్రహ్మాండములోని కొంతభాగమే మనము భావించెడి పృథివి, అన్తరిక్షము, దివము–అనునవి. ఇట్టి పృథివ్యన్తరిక్ష దివములను ఎన్నింటినో తన సంకల్పమాత్రముచే చిత్రవిచిత్రములుగా సృష్టించి అందరి జీవులనుపెంచి సమయించు దివ్యశక్తియే విశ్వకర్మ. ఆ శక్తి ఈ విశ్వ

సంబంధము లయిన కర్మలు జరుగుటకు కారణమయినందున దానిని విశ్వకర్మ నామముచే వేదము పేర్కొన్నది. అచింత్యాద్భుత మహాశక్తి అయిన విశ్వకర్మ చేయనివనీ చేయలేనివనీ ఏదీలేదు. అందఱుచేయు పనులూ ఆ విశ్వకర్మలో అంతర్భవింపక తప్పదు. అందుకనియే ఆ విశ్వకర్మను సర్వదేవతామయుడన్నవి వేదములు. అనగా సర్వ శక్తిమయమైనదే ఆ వస్తువన్నమాట.

ఇట్టి విశ్వకర్మను గూర్చి ఋగ్యజుర్వేదములు రెండేసి సూక్తములతో ప్రవచించినవి. సృష్టి విధానమును వర్ణించెడి సూక్తములకు విశ్వోత్పత్తి సూక్తములని పేరు. ఈ సూక్త ద్వయములో విశ్వకర్మ భగవానుని మహిమ ఎంతగా నున్నదో వాక్కులకు అందునది కాదు. దానిని కొంత కొంతవఱకే వేదభాష్యకర్తలు భావించి చెప్పినారు. అట్టి వారిలో యాస్క సాయణాదులు అగ్రేసరులు. ఆ విశ్వకర్మ తత్త్వము శ్వేతాశ్వతరాదులైన ఉపనిషత్తులలోను ప్రపంచితమైనది. దానిని ప్రత్నాసంప ఋషి తన తపో నిశితమైన బుద్ధికి అందినంతవరకు ఈ గ్రంధములతో వివరింప బూనినాడు. ఆ విశ్వకర్మయే వివిధ బ్రహ్మాండములను సృష్టించి, ఆ శరీరములందు జీవరూపుడై ప్రవేశించినాడనియు, జీవుని సృష్టి రహస్యము నాకళించుకొని తమ్ము విశ్వకర్మాభిన్నులనుగా అద్వైత స్వరూపులుగా అనుభూతి పొందిననేకాని యీ జగచ్చక్రమునబడి తిరుగుశ్రమ తప్పదనియు సూక్తములు చెప్పుచున్నవి. ఈ పరమార్థమే తరువాతివైన ఉపనిషత్తులలోను, భగవద్గీతా బ్రహ్మసూత్రాదులలోను శాఖోపశాఖలుగా విస్తరింపబడినది. అట్టి జగత్కారణ పరమార్థమును వ్యాఖ్యాన రమ్యముగా వివరించుట ప్రత్నాసందుల వేదదర్శన నిర్మాణమునకు ప్రధాన లక్ష్యము. ఇది అంతయు సృష్టికథా, వర్ణనము. ఆ సృష్టిలోని బుద్ధిమంతులకు తరణోపాయమును చూపు విధానమునే కాని ఏదో తనయొక్క గోత్ర ఋషిమీది అభిమానముతో వ్రాసికొన్న స్వీయ చరిత్ర యెట్లు కాగలదు!

విష్ణు, రుద్ర, పురుష, హిరణ్యగర్భ త్వష్టృ ప్రభృతులను గూర్చి గూడ విశ్వోత్పత్తి సూక్తములయందు పరామర్శలు, తత్త్వోద్ఘాటనలు లేకపోలేదు. గ్రంథకర్త వాటినెంత మాత్రమును ఉపేక్షింపలేదు. వాటినిగూడ దర్శించి, చర్చించి సారమును పిండి చూపినారు. అందుకే ప్రథమ గ్రంథమునకు ఏకంసత్ అనీ, రెండవదానికి సర్వం ఖల్విదం బ్రహ్మ అనీ మూడవ దానికి బ్రహ్మైవేదం విశ్వం అనీ పేరులుపెట్టి తత్త్వోద్ఘాటన చేయుటయైనది. కనుక ఋగ్వేద రహస్య గ్రంథమున ప్రతి పుటలోను విశ్వకర్మ శబ్దమగపడినంతమాత్రమున అది గ్రంథకర్తయొక్క వెఱ్ఱి విశ్వకర్మాభిమానమని తలంపరాదు. అదియంతయు వేదోపనిషదాది మంత్రములు చెప్పిన విశ్వకర్మ తత్త్వమేకాని భిన్నముకాదు. ప్రమాణములేని విషయమేదియును గ్రంథకర్త చెప్పడని గ్రంథపఠనముచే నిర్మత్సరులగు పాఠకులే గ్రహింపగలరు.

ఇంకొక విశేషము. విశ్వకర్మ తాను వసురుద్రాదిత్యులను, బ్రహ్మ విష్ణు, ప్రభృతులను కనుటయే కాదు. తానుకూడ వారి కడుపునపుట్టి ఘనకార్యములొనర్చినట్లు మంత్రాదుల సాక్ష్యముల నీ గ్రంథములలోనేచూపినాడు. అతడు భువనమహర్షికి పుత్రుడై భౌవన విశ్వకర్మ అనుపేరుతో విశ్వకర్మ సూక్తములకు ద్రష్టయైనాడు. మొట్టమొదటి సార్వభౌముడై భూమి నేలినవాడు. అట్లే తాను అష్ట వసువులను కన్నతండ్రి అయినను, అష్టమ వసువైన ప్రభాసునకు బృహస్పతి చెలియలైన యోగసత్తాదేవికి పుత్రుడై ప్రకాశించినాడు. ఇట్టి విశ్వకర్మావతారములనెన్నిటినో మనము వేదాదులయందు కాంచగలము. ఇట్టివి కొన్ని యజుర్వేదదర్శనమున చూపబడినవి.

విశ్వోత్పత్తి సూక్తములలో నాసదీయ, విశ్వకర్మ, పురుష, మోక్ష సూక్తములు మొదటగా పేర్కొనదగినవి. వాటిని తోచినంతవరకు తపోదృష్టికి అగపడినంతవరకు సరహస్యముగా వివరించుట అయినది. ఇక త్ర్యంబక మంత్ర రహస్యములను గూర్చి చెప్పనే అక్కరలేదు. మృత్యు విమోచన మంత్రమను పేరుతో వానికి గల వివిధార్థములను చూపినారు.

ప్రత్నానంద. అవి సాధకులకు సర్వోపయోగకారులు. ఆపదలనుండి, ఆప మృత్యువునుండి బయట బడుటకు త్ర్యంబకమంత్ర జపము చేయదగినది.

మంత్ర దేవతాశక్తుల ఉపాసనము కార్యసిద్ధికరమని వేదవాదుల విశ్వాసము. మయూరుడను మహాకవి "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను సూక్తి నిబట్టి సూర్యునిగూర్చి ఒక శతకమును వ్రాసి కుష్ఠురోగము నుండి బయటపడినాడని మనము వినుచుందుము. గ్రంథకర్తకు త్ర్యంబక మంత్రమునకుగల రహస్యములను వివరించినందువల్లనో యేమో ఈ వత్సరమొక మృత్యుగండము తప్పినది.

మేనెల 22వ తేదీన గ్రంథకర్తకు గుండెజబ్బు వచ్చినది. డా॥ దక్షిణామూర్తిగారి ఆస్పత్రిలో చేరినారు. ఆయనకుగాని, వారిపుత్రీపుత్రులకు గాని బ్రతుకగలడని ఆశలేదు. కాని పదిరోజులకెల్ల ఆరోగ్యము చక్కబడి ఇంటికి చేరినారు. ఇందుకు కారణము త్ర్యంబకమంత్ర రహస్యావిష్కరణమే అని ఆయన విశ్వాసము. మఱికొన్ని జీవిత ఘట్టములందుగూడ ఈ మంత్రము నుపయోగించి లోకులకు మేలు చేయగలిగినాడు. అట్లే విశ్వకర్మ పురుషసూక్త పఠన జప మననములు నమక, చమక సూక్తములతోడి అభిషేకాదులు మేలు కూర్చుననుట మూఢవిశ్వాసముగా తలంపరాదు. కావున వేదము మానవలోకమునకు ఒసంగని ప్రయోజనము లేదనుట శుద్ధ సత్యమే కాని పొల్లుమాటకాదు.

విశ్వకర్మనుండి జన్మించినవారు వసురుద్రాదిత్యులేకాదు. పంచర్షులు, సప్తర్షులు, సమస్త ప్రపంచమును ఆ శక్తినుండియే కలిగినదని విశ్వకర్మ సూక్తములే చెప్పుచున్నవి. అందలి ఒక మంత్రము "త ఆయజన్త ద్రవిణం సమస్మా ఋషయః పూర్వే జరితారో న భూనా" అను వాక్యము నందలి పూర్వశబ్దముచేత "సానగ, సనాత, సాహభూన, ప్రత్న, సుపర్ణ లనెడి పంచ ఋషులను చెప్పి "యత్ర సప్తర్షీన్పర ఏక మాహుః" అనెడి మాటచేత సప్తర్షులను చెప్పినది. పిమ్మట అథర్వవేదములోని "వాచస్పత

ఋతనః పంచయే నో వైశ్వకర్మణాః పరియే సంబభూవుః'' అనుమాటచేత ఆ పూర్వఋషులు అయిదుగురని స్పష్టము చేసినది. అంతేకాదు, సప్తర్షులు విశ్వకర్మనుండియే పుట్టినారని ''విశ్వకర్మాణం తే సప్త ఋషివన్త మృచ్ఛన్తు'' అనెడి మంత్రముచే వ్యాఖ్యానించినది. ఈ అంశమునే భగవద్గీత "మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవస్తథా, మద్భావా మానసాజాతాః" అను శ్లోకముచే వివరించినది. కాగా వేద వర్ణిత విశ్వకర్మయు, గీత చెప్పిన భగవంతుడును ఒక్కరేయని స్పష్టమగుటలేదా? ఇట్టి పరమ రహస్యముల నన్నిటిని భేదదృష్టికి లోనుగాక, సమరస దృష్టితో సమన్వయించుకొని సాధకులు తత్త్వసిద్ధిని పొందవలయును. రుద్ర, విష్ణు, శివాది శబ్దముల విషయమున గూడ గ్రంథకర్తకు చిన్నచూపులేదని "తద్విష్ణో పరమం పదం, సదా పశ్యన్తి సూరయః'' ''విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" యదా తమ స్తన్న దివా న రాత్రిః న స న్నచా సచ్ఛివ ఏవ కేవలః" ''సర్వవ్యాపీ స భగవాన్ తస్మాత్సర్వగత శ్శివః" ''విశ్వాధిపో రుద్రో మహర్షిః" అని గ్రంథకర్త ఉదాహరించిన మంత్రములే సాక్ష్య మిచ్చుచున్నవి. గ్రంథకర్త సచ్చిదానందములకుకాక, నామరూపములు కెప్పుడును ప్రాధాన్యమీయలేదు. ఈ రహస్యములు ఏకంసత్ (ప్రథమ భాగము) లో నిరూపితములు.

పండితులు తెలిసి తెలిసీ చేయుచున్న ఇంకొక పొరపాటేమనగా, అది ఇది:- పగత్కారణతత్త్వమనుడు, భగవంతుడనుడు, భావాతీతం అనీ, అప్రమేయమనీ, అనుచునే యుందురు. కాని మఖల దానిని మానవ కల్పిత ప్రమాణములకు, భాషా వ్యవహారాది నియమములకు లోబఱచుటకే ప్రయత్నించుచుందురు. భావాతీతమయినది నీ భావములకు లోబడిన, దాని మహిమ తగ్గినట్లు కాదా? ప్రమాణముల కందనిదానిని నీవు కల్పించుకొన్న ప్రమాణములకు లోనుచేసినచో అది నీ కల్పనలకు లోబడినట్లే కదా. అది తపోయోగ సాధనా గమ్యము మాత్రమే. వాఙ్మనస్సుల కందునదికాదు.

దానిని వాఙ్మనోఽతీతముగా దర్శించుటయే భావ్యము. ఈ రహస్యమునే శ్రీ శంకరులు "మిథః కేశాకేశిప్రథననిధనా స్తర్క ఘటనాః, బహు శ్రద్ధా, భక్తి ప్రణతి విషయాశ్చాపివిధయః" అని గంభీరముగా సూచించినారు.

ఇంతకూ తేలిన సారాంశమేమన, గ్రంథకర్తను విశ్వకర్మాభిమాని యని భావించువారు, ఋగ్యజుర్వేదాదులయందలి విశ్వకర్మ సూక్తములను బాగుగా చదువుడనియు, వాటికి సాయణులు వ్రాసిన భాష్య పంక్తులను లెస్సగా పరిశీలించి మననము చేయుడనియునే ఆ పనిచేసిన పిమ్మట "'విశ్వకర్మమయం జగత్" అని ప్రతివారికి తోచితీరును. మనము విశ్వకర్మ తత్త్వమును చదువకయు, మననము చేయకయు నష్టపడినామని కూడ తోచితీరును. వేద మంత్రములు ఉదయించునాటికి జగత్కారణమునకు 'బ్రహ్మము అనుపేరు కలుగలేదు. అది బ్రాహ్మణారణ్యకోపనిషదాదుల యందు తలయెత్తినమాట. అందుచేత వేదము- విశ్వకర్మ,పురుష, హిరణ్య గర్భ, ప్రజాపతి, విష్ణు, రుద్రాదిపదములచేతనే మూలతత్త్వమును పేర్కొ న్నది. అందుకనియే వాటికి వేద వాఙ్మయమున ప్రచార ప్రసిద్ధులు ఎక్కువగా కలిగినవి.

విశ్వకర్మ శబ్దాభిమానమును గ్రంథకర్తకు అంటగట్టవలదనియు, ఆ అభిమానముకాని, సత్యోద్ఘాటన దృష్టికాని వేదమునకే, ఆయా సూక్తములకు భాష్యములు వ్రాసిన భాష్యకారులకే కలదనియు, వారిననుసరించి గ్రంథము వ్రాయుటయే ప్రత్నానంద చేసిన పని అనియు మఱువరాదు.

వేదము మొట్టమొదటి పరమ ప్రమాణము. దానికి పిమ్మటివే తర్క, మీమాంసా, పురాణ, ధర్మశాస్త్రాదులు. వేదవిరుద్ధమయినది ఏ గ్రంథము చెప్పినను ప్రమాణముకాదు. వేదమొక విషయమును రెండు విధములుగా చెప్పిన, అవిరెండును ప్రమాణములే. అట్టితటి వ్యాఖ్యాతలు తమతపశ్శక్తితో సమన్వయమును సాధింపవలసియుండును.

# కృతజ్ఞతలు

యజుర్వేద దర్శనము ముద్రణానంతరము, అథర్వవేదదర్శన ముద్రణకై T. T. D. వారి ధనసహాయత అర్థింపబడినది. దాని ఫలితమురాక ముందే "ఋగ్వేద రహస్యాలు" తయారగుట, పిమ్మట గ్రంథకర్తకు గుండె పోటువచ్చి తేరుకొనుట అయినది. ఈ గండము గడుచుటకు త్ర్యంబక మంత్రరహస్య వివరణము, విశ్వకర్మ తత్త్వప్రతిపాదనము చేయుటయే కారణములని నమ్మిన గ్రంథకర్త దానిని ముద్రింప చేయతలంచినాడు. పదివేలరూపాయలైనకాని 5 వందల ప్రతులయినను ముద్రణకావు.అయినను మొండి ధైర్యముతో కార్యమునారంభించినాడు. ఇద్దరు ముగ్గురు సత్పురుషులకు సంగతిని వ్రాయగా, వారు వేయినూట పదునార్లు ఇచ్చుటకు ఎంతో సంతోషముతో అంగీకరించినారు. వీరందఱూ ఉన్నత విద్యాశాలులూ, సమున్నతోద్యోగము చేసినవారుఅగుట ఒక విశేషము. వీరిలో ఒకరు బ్రహ్మశ్రీ దర్శి హేమసుందరరావుగారు విశాఖపట్నం వాస్తవ్యులు. రెండవ వారు గొప్ప వ్యవసాయ ఇంజనీరు బ్రహ్మశ్రీ వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రి గారు హైదరాబాదు. మూడవవారు రిటైర్డు కో-ఆపరేటివ్ రిజిష్ట్రార్ బ్రహ్మశ్రీ కొండూరు వెంకటేశ్వరరావుగారు విజయవాడ. ఇంకొకరు సుప్రసిద్ధ పారిశ్రామికవేత్తలు బ్రహ్మశ్రీ పసునూరి బ్రహ్మానందాచార్యులు గారు హైదరాబాదు. మఱియొకరు బ్రహ్మశ్రీ కొండూరు వెంకటపరబ్రహ్మాచార్యులుగారు (పామఱ్ఱులోని స్త్రీల పాలిటెక్నిక్ ప్రిన్సిపాల్). విజయవాడ వాస్తవ్యులు హిందీ సాహిత్యరత్న,పరమహంస యోగానంద యోగమార్గానుసారులు డా॥ పొతకమూరి వీరబ్రహ్మాచార్యులుగారు. వీరు తమ సతీమణి కీ. శే. శ్రీమతి గిరిజాకుమారిగారి స్మృతిచిహ్నముగా రు. 558 రూపాయలు సమర్పించినారు. ఈ వదాన్యులందఱికీ వేదజననీ జనకుల అనుగ్రహము కలుగునని గ్రంథకర్త ఆశంస.

కొందఱు సర్వజ్ఞులమనుకొను పండితులుందురు. వారొక సరికొత్త రచనను తామై చేయలేరు. ఇతరులుచేసినచో మెచ్చకపోగా దోషారోపణ

చేయుచుంచురు. అట్లుకాక సర్వదా నా కృషిని ప్రోత్సహించుచున్న వేద రహస్యవిదులు, నిర్మత్సరులు అయిన డా॥ ధూళిపాళ అర్క సోమయాజులు గారి వంటి పండితులు అరుదగుచున్న ఈ కాలములో ఈ గ్రంథమును శ్రద్ధగా చదివి అనుశీలన మొనర్చిన సహృదయులు శ్రీ భాగవతులవారికీ అమృతత్వసిద్ధిని సమకూర్చిన సాహిత్యబ్రహ్మకూ కృతజ్ఞతలు.

ప్రత్నానంద గ్రంథములను సుందరాక్షరములతో సాపుడ్రాయు బ్రహ్మశ్రీ కోసూరి వెంకటసుబ్బారావుగారి సంగతి పాఠకులకు తెలిసినదే. శ్రీవారు ఈ ఋగ్వేదరహస్యాలను గూడ శ్రమకోర్చి సాపుడ్రాసినారు. గ్రంథ కర్తకు సరియైన ఆరోగ్యము లేనందుననూ, శుక్లములు ముదిరి చూపు తగ్గి నందునను ప్రూపులు చూచుటకు వీలుకాలేదు. ఇటిస్థితిలోవారి అల్లుడైన, చి॥ ఆలూరి బాలకృష్ణమూర్తి ప్రూపులుదిద్దు బాధ్యతను పూనినారు. వాణీ ఆర్టు ప్రింటర్స్ అధిపతి చి॥ టి. శివశంకరరావు, వారి సిబ్బంది గ్రంథకర్తతో ఎంతగానో సహకరించి గ్రంథమునకి స్వరూపము నిచ్చినారు. వీరి అందరికీ పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక.

ఇంతకూ "భేద వర్జిత మప్రమేయ మసంగ మద్భుత మక్షయమ్" అని స్తుతింపబడిన మూలతత్త్వము "నామరూప విలాసలాలస శీలమానః దుర్లభమయినట్టిదేకాని, నామరూప దురభిమాన భేదబుద్ధులకు చిక్కనదీ దక్కనదీ కాదు. అట్టివారు "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అన్నట్లు మృత్యురూప సంసారము పాలుకాక తప్పదు.

ఆకాంక్ష—

తెనాలి
15-9-91

ఇట్లు
ప్రత్నానంద

# విషయసూచిక

1. ప్రార్థనాదికము .... 1
2. త్ర్యంబక మంత్ర రహస్యము .... 2
3. ముక్కంటికాయ .... 40
4. విష్ణు మంత్రములు .... 49
5. ఇంద్ర విష్ణువులు జీవేశ్వర స్వరూపులు .... 58
6. మిత్రావరుణులు .... 64
7. వాక్కు-వాచస్పతి .... 64
8 వాగర్థ రహస్యము .... 70
9. జడచైతన్యక్రీడ .... 76
10. ఈశముండకవాణి .... 87
11. జ్ఞేయ వస్తువు .... 96
12. నాసదీయ సూక్తము .... 104
13. బ్రహ్మ విష్ణు రుద్రులు .... 110
14. నాసదీయ సూక్తము .... 121
15. విశ్వకర్మ సూక్తముల భావము .... 125
16. పురుష సూక్త భావము .... 131
17. పురుష విశ్వకర్మ సూక్తముల తులనాత్మక పరిశీలనము .... 136

18. అజాతవాదము .... 173
19. శూన్యవాదము .... 180
20. అచల పరిపూర్ణతత్త్వము .... 187
21. నాసదీయ మంత్ర ప్రాప్యసిద్ధి .... 192
22. విశ్వకర్మ సూక్త లక్ష్యయోగము .... 201
23. పృథివి, అంతరిక్షము, దివము .... 216
24. త్రి, సప్త-చక్ర రహస్యము .... 221
25. సూర్యచంద్రాగ్నులు .... 220
26. కుండలినీ యోగము .... 235
27. నీటిలో జగద్బీజము .... 246
28. విష్ణుమంత్ర మధువు మధువిద్యాసారమే .... 257
29. శచి - ఇంద్రుడు .... 263
30. అనుప్రవేశ రహస్యము .... 268
31. కోదదర్శ ప్రథమం జాయమానమ్ .... 270
32. వృత్రవధ రహస్యము .... 274
33. అదితి .... 281
34. విజ్ఞానకోశయాత్ర .... 284
35. మంగళాశాసనము .... 289

# ప్రథమ భాగ ప్రశంసా

Tirupati
1-11-84.

**Dr. D. Arka Somayaji,** *M.A.,PhD.*
*Project officer for Creative work & Research,*
Tirumala Tirupati Devasthanams
Retd. Principal, D. N. R. College, Bhimavaram
Presidential Awardee as Sanskrit Scholar.

ఇదం మే మహతే ప్రమోదాయ, యత్ శ్రీమంతః వీర రాఘవాచార్యాః సంప్రతి ప్రత్యానంద నామానః ఋగ్వేదే కృత భూరిపరిశ్రమాః ఋగ్వేద దిగ్దర్శన నామగ్రంథం అరరచన్. స చ గ్రంథః మయా ఆద్యంతం వ్యలోకి. ఏతే మహోదయాః ఆధ్యాత్మిక తత్త్వవిషయే అహర్దివ మపి కృతశ్రమా ఇతి గ్రంథావలోకనేన మయా అబుద్ధ. సంప్రత్యపి బహవః సంస్కృత పండితా భారతే జాగ్రతి. కింతు తత్త్వానుభూతి విషయే శ్రద్ధధానా విరళా ఏవేతి నిశ్చ ప్రచమ్. ఏతే మహాభాగాః అన్యా నపి శిష్యాన్ స్వ సదృశాన్ కుర్వన్త్వితి ఆశాసే.

శ్లో॥ ప్రత్యానంద మహోదయేన రచితం తత్త్వప్రచారేప్సునా
మా మత్యంత మతూతుషత్ శ్రుతివచ స్తత్త్వార్థ దిగ్దర్శనం,
బ్రహ్మజ్ఞాన బుభుత్సుభి ర్మునివరై ర్దృష్టా వచో యాః పరాః
వ్యాఖ్యాన్ తాః విబుధా నయం బుధవరో కుర్యాత్ శ్రుతివ్యాపృతాన్.

— ఇతి ధూళిపాళోపాభిదః అర్క—సోమయాజి

# లభించే ఇతర గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఋగ్వేద దిగ్దర్శనం (2వ భాగం) | రు. 25-00 |
| 2. | ఋగ్వేద దిగ్దర్శనం (3వ భాగం) | 25-00 |
| 3. | యజుర్వేద దర్శనం (1వ భాగం) | 30-00 |
| 4. | ఆత్మ దర్శనం | 14-00 |
| 5. | శిల్ప దర్శనం | 15-00 |
| 6. | యోగ దర్శనం | 15-00 |
| 7. | తత్త్వసాధన | 15-00 |
| 8. | మిత్రసాహస్రి | 12-00 |
| 9. | విశ్వకర్మ పురాణం (తాత్పర్య సహితం) | 12-00 |
| 10. | ఆంధ్ర నాగర ఖండం | 12-00 |
| 11. | మాఘ మాహాత్మ్యం (నిరంజన కవిశేఖర ప్రణీతం) | 12-00 |
| 12. | అనర్ఘ రాఘవం (శ్రీ ఆదిశేష శాస్త్రిగారిది) | 12-00 |
| 13. | తత్త్వ సూక్తులు (1వ భాగం) | 10-00 |
| 14. | తత్త్వసూక్తులు (2వ భాగం) | 10-00 |
| 15. | మోహనాంగి (నవల) | 10-00 |
| 16. | అమరావతి (పద్యకావ్యం) | 5-00 |
| 17. | శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతం | 4-00 |
| 18. | ఋగ్వేద దిగ్దర్శనం (1వ భాగం పునర్ముద్రణలో) | |

---

గ్రంథకర్త పేర :

గాంధీనగర్ - తెనాలి (H. O.) 522 201

తమ జననీ జనకులైన స్వర్గీయ వేంకట సుబ్బమ్మ, బ్రహ్మయ్యగార్ల
జ్ఞాపకార్థము ఈ గ్రంథ ముద్రణకు వేయినూట పదహారు
రూపాయలు విరాళ మొసంగిన వదాన్యులు



బ్రహ్మశ్రీ కొండూరు వెంకటేశ్వరరావుగారు, బి. ఏ.
డిప్యూటి రిజిష్ట్రారు (రిటైర్డు)
ధర్మపత్ని మధుసూధనమ్మగారు
విజయవాడ.

శ్రీ కొండూరు వెంకటేశ్వరరావుగారికి బి. ఏ. చెప్పించి,

వివాహము చేసిన పెదతండ్రిగారు



సచ్ఛీలురు, నిస్స్వార్థ దానశాలి

స్వర్గీయ కొండూరు విశ్వనాథముగారు

సతీమణి అన్నపూర్ణమ్మగారు

వల్లభాపురం (తెనాలి తాలూకా)

ఈ గ్రంథ ముద్రణకు రు. 1116/- లు ఇచ్చి

తోడ్పడిన వదాన్యులు



ప్రముఖ వ్యవసాయ ఇంజనీరు

బ్రహ్మశ్రీ వడ్లపూడి చంద్రశేఖరశాస్త్రిగారు

వారి ధర్మపత్ని శ్రీమతి వరలక్ష్మిగారు

హైదరాబాదు

ఈ గ్రంథ ముద్రణకు వేయినూట పదునార్లు

విరాళమిచ్చిన వదాన్యులు



## బ్రహ్మశ్రీ కొండూరు వెంకట పరబ్రహ్మాచార్యులుగా

ప్రిన్సిపాల్ :

(శ్రీమతి తమ్మా కోటమ్మరెడ్డి స్త్రీల పాలిటెక్నిక్, పాముఱ్ఱు.)

## వారి ధర్మపత్ని శ్రీమతి పుణ్యావతిగారు

ఈ గ్రంథ ముద్రణకు వేయినూట పదునార్లు

విరాళమిచ్చిన వదాన్యులు

ప్రముఖ పారిశ్రామిక వేత్తలు





బ్రహ్మశ్రీ పసునూరి బ్రహ్మానందాచార్యులుగారు.

వారి ధర్మపత్ని శ్రీమతి గోవిందమ్మగారు

హైదరాబాదు

# ఋగ్వేద రహస్యాలు

## (తద్వేద గుహోపనిష త్సుగూఢమ్)

## ప్రార్థనాదికము

శ్లో. "పంచాననాది సామ్యేన, పంచ సృష్ట్యాది కర్మభిః,
వేదస్య పితరౌ వన్దే ఆద్యా వన్వర్థ దంపతీ."   1

తా॥ అయిదు మోములు, పది చేతులు మొదలగు పోలికల చేతను, సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము- అనెడి అయిదు కర్మలచేతను సార్థకత్వమును పొందిన ఆదిమ దంపతులగు వేదజననీ జనకులకు వందనము.

శ్లో. "నమస్తే వేదమాత్రే తే, జగదాకృతయే సదా,
నమస్తే వేదపిత్రే తే, జగదాత్మ స్వరూపిణే."   2

తా॥ పంచభూతమయములగు జగత్తుల ఆకారమే అయిన వేదమాతవగు (గాయత్రికి) నీకు నమస్కారము. జగద్రూపమే కాక, దాని కాధారమైన పరమాత్మ స్వరూపము కూడ అయిన వేద జనకుడవగు (విశ్వకర్మకు) నీకు నమస్కారము. (గాయత్రీ విశ్వకర్మల తత్త్వమును తెలియగోరువారు ఈ గ్రంథకర్త వ్రాసిన "గాయత్రీ విశ్వకర్మలు" అను గ్రంథమును చదువవచ్చును.)

శ్లో. "వేదసూక్తాని సర్వాణి, యః క్రమేణ విభక్తవాన్,
చతుర్వేద స్వరూపేణ, వేదవ్యాసం స్మరామి తమ్." 3

తా॥ ఏ మహానుభావుడు సమస్తమైన వేదసూక్తరాశిని ఋగ్యజుస్సామాథర్వములనెడి నాలుగు వేదములుగా విభజించినాడో, అట్టి వేదవ్యాసుని స్మరింతును.

శ్లో. "ఆత్మనః పితరౌ వన్దే పార్వతీశ్వర రూపిణౌ
ఋగ్వేదీయ రహస్యాఖ్య గ్రంథ నిర్విఘ్న పూర్తయే."

తా॥ ఈ ఋగ్వేద రహస్యాలు అనెడి గ్రంథము నిర్విఘ్నముగా పూర్తియగుటకై పార్వతీశ్వర స్వరూపులైన మా తలిదండ్రులు పార్వతమ్మ కోటీశ్వరాచార్యులకు వందనము చేయుచున్నాను.

శ్లో. "ఋఙ్మంత్రాణాం రహస్యాణి, స్వానుభూతిమయే హృది,
భావయిత్వా విరచ్యంతే, ఏతద్గ్రంథ స్వరూపతః." 5

తా॥ ఋగ్వేదమంత్ర రహస్యములు స్వానుభవముద్వారా మదిలో భావించి ఈ గ్రంథరూపముగా కూర్చబడుచున్నవి.



## త్ర్యంబక మంత్ర రహస్యము

"తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అన్నది తైత్తిరీయానందవల్లి. బ్రహ్మ మనగా వేదమని ఒక అర్థము, జగత్కా-

రణ పరబ్రహ్మమని ఇంకొక అర్థము. ఈ రెండింటిలో దేనిని గూర్చి తెలిసికొనవలెనన్నను దానికి తపస్సు ముఖ్య సాధనమే. వేదమంత్రములకుగల నిగూఢార్థములను, అనేకార్థములను గూర్చి మనము ఆలోచించునపుడు సత్వ గుణముతో గూడిన తపస్సు ఒక దివ్య సాధనము. తపస్సుచేత సునిశితమైన బుద్ధితో ఆలోచించి చూచినచో వేదసూక్తముల యందును, ప్రత్యేక ప్రత్యేక మంత్రములయందునుగల ఎన్నెన్నో విశేషార్థములు, భౌతికాధ్యాత్మిక జగత్తులకు సంబంధించినవి మనకు స్పష్టము కాగలవు. ఋగ్వేద రహస్యములు అను నీ గ్రంథమున ముందుగా అట్టివాటిలో త్ర్యంబకమంత్రమును పరిశీలించి అందలి రహస్యములను విచారించి తెలిసికొందము.

"త్ర్యంబకం యజామహే" అను మంత్రము ఋగ్వేద సప్తమమండలమునందలి 59వ సూక్తమున చిట్టచివరిది. అది రుద్రుడు దేవతగాగల మంత్రమనియు, మృత్యు విమోచనమును కలిగించుననియు భాష్యకర్త వ్రాసినాడు. బ్రహ్మ, విష్ణు, రుద్రాది శబ్దములను పురాణముల ప్రకారము సృష్టిస్థితిలయాదులు చేసెడి దేవతల నామములని సాధారణముగా అర్థము చెప్పుచుందురు. అట్లుకాక, సృష్టి స్థిత్యాది సర్వ కర్మలను చేసెడు పరమాత్మవాచకములే అవి అని చెప్పికొనుట గూడ (సమరస దృష్టిలో) కొన్నికొన్ని ఘట్టములందు సమంజసముగానే ఉండును. అప్పుడు అనేక విశేషార్థములు

మనకు లభింపగలవు. అట్టి దృష్టితోనే ఈ గ్రంథమున పరిశీలన జరుగుచున్నది. త్ర్యంబక మంత్రమనగా ఇది.

"త్ర్యంబకం యజామహే, సుగంధిం పుష్టివర్ధనం,
ఉర్వారుకమివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ
మామృతాత్." ఋ 7_59-12

"త్రయాణాం=బ్రహ్మ విష్ణు రుద్రాణాం, అంబకం= పితరం, యజామహ ఇతి శిష్యసమాహితో వసిష్ఠో బ్రవీతి" అని సాయణ భాష్యము. దీనినిబట్టి బ్రహ్మ విష్ణు రుద్రులనెడి త్రిమూర్తులకుగూడ ఈ మంత్రమున స్తుతింపబడిన దేవుడు తండ్రియని వసిష్ఠాభిప్రాయమని తెలుచున్నది. వసు రుద్రాదిత్యులు, విశ్వకర్మ తనయులని యజుర్వేద మంత్రము చెప్పుచున్నందున, ఇందలి త్ర్యంబకుడు విశ్వకర్మ అనిగాని, సాక్షాన్నిర్గుణ పరమాత్మ అనికాని ఎన్నవలసి యున్నది. కాగా త్రిమూర్తులకు తండ్రియు, కీర్తివలె అంతటా వ్యాపించు వాడును, భక్తులకు సమస్త పుష్టులను చేకూర్చువాడును అగు త్ర్యంబకుని (సర్వేశ్వరుని) ఆరాధింతము- ధ్యానింతము అని మంత్ర పూర్వార్ధముయొక్క భావము ఆ త్ర్యంబకుని ఏల ఆరాధింపవలయునో తరువాతి రెండు పాదములు వివరించుచున్నవి. ఆయనను ఆరాధించినచో తొడిమనుండి దోసకాయ ఊడిపడునట్లు మృత్యువునుండికాని, సంసారమునుండికాని విడివడవచ్చును. అంతియే కాని, అమృతమునుండి మాత్రము విడివడమని భావము. అనగా త్ర్యంబకారాధన

చేత (పరమాత్మజ్ఞానముచేత) మృత్యువుతొలగి, అమృతత్వ మబ్బునని తెలియుచున్నది. ఇక్కడ యజింపు మనగా ఆతనిని, ఆతని సృష్టిని సంపూర్ణముగా నెఱింగి ఆరాధింపు మనియేగాని, ఏదో విగ్రహమునకు గంధపుష్పాక్షత లర్పించి బాహ్యముగా పూజించిన చాలునని అభిప్రాయము కాదు. ఆతని జ్ఞానము సంపూర్ణముగా కలిగిననే కాని అమృతత్వమురాదు. అందుకే పురుష సూక్తము "త మేవ విదిత్వాతి మృత్యు మేతి, నాన్యః పంథా విద్య తేఽయనాయ" ఆ జగత్కారణ పరబ్రహ్మమును ఎఱింగిననేకాని మృత్యువునుదాటి అమృతుడు కాడు-అనుచున్నది. అంతేకాదు. గమ్యమును చేరుట కింతకంటెను వేఱుమార్గములేదని కూడ మంత్రతాత్పర్యము. ఇందలి చివరి రెండుపాదములే పురుష సూక్త మంత్రవాక్యరూపమును పొందినవని పాఠకులెఱుంగవలయును. వసిష్ఠు డీ మంత్రమునందలి అంబక శబ్దమునకు తండ్రియని అర్థము చెప్పుట, త్రిమూర్తులనగా బ్రహ్మ, విష్ణు, రుద్రులనియు వారి తండ్రి పరమాత్మ లేక విశ్వకర్మ అని భావించుట పాఠకులు గమనింపవలసి యున్నది.

"సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్" శరీరము నందెల్లను జ్ఞానేంద్రియములను తనలో నిముడ్చుకొన్న శిరస్సు ప్రధానమైనది. కావుననే పురుష సూక్తము "సహస్ర శీర్షా పురుషః" అని ప్రారంభమై శరీరమున శిరః ప్రాధాన్యమును చాటినది. ఇక విశ్వకర్మ సూక్తమేమొ "విశ్వత శ్చక్షు రుత

విశ్వతోముఖః" అని శిరోనేత్రముల ప్రాధాన్యమును చెప్పినది. ఇంద్రియములందెల్ల రూపములనుచూచు కన్ను శ్రేష్ఠముకాన ఈ త్ర్యంబక మంత్రము "అంబకం" అని కంటినే తీసికొని దాని ప్రాధాన్యమును వక్కాణించినది. విశ్వకర్మ సూక్తము "చక్షుషః పితా" అని చక్షురాదీంద్రియములకు విశ్వకర్మ జనకుడని వచించినది. ఈ రహస్యముల నెఱింగిన వసిష్ఠ మహర్షి అంబక శబ్దమునకు సాక్షాత్తు తండ్రి అనియే అర్థము చెప్పి గమ్యార్థమును స్పష్టపఱచినాడు.

త్ర్యంబకుడనగా మూడు కన్నులు కలవాడని-ముక్కంటి అని అర్థము. ఈ మూడు కన్నులు కలవారు విశ్వకర్మ, శివుడు, గాయత్రి, శక్తి, జగదంబ శ్రీదేవి-మొదలగువారు మనకు మంత్రతంత్ర పురాణాది వాఙ్మయమున దర్శనమిత్తురు. ఈ మూడు కన్నుల రహస్యమునే మనమీ శీర్షికయందు విచారించవలసియున్నది. ఇక త్ర్యంబక శబ్దార్థములను గూర్చి పరిశీలింతము.

"త్రీణి అంబకాని యస్య సః త్ర్యంబకః" అని విగ్రహము. అంబకమనగా కన్ను, బాణము అని రెండర్థములున్నవి. కన్ను చూచుటకును, బాణము గెలుపుగొనుటకును సాధనములని మనకు తెలియును. మూడు కన్నులు కలవాడు త్ర్యంబకుడు (ముక్కంటి) అగుచున్నాడు. ఈ మూడు కన్నులనే సూర్యచంద్రాగ్నులని మనవారు

భావించినారు. విరాట్పురుషునకు (పరమాత్మకు) సూర్య చంద్రాగ్నులే కదా కన్నులు "చక్షుషీ చంద్ర సూర్యౌ" అని మనము ముండకోపనిషత్తునందు చదువుదుము. కాగా అగ్నిని గూర్చి నేత్రమనక మూర్థా (అగ్నిర్మూర్థా) అన్నది ముండకము. మూర్థమనగా శిరస్సు. అగ్నిశబ్దము చేత జ్యోతిర్మయలోకములైన స్వర్గాదులని తెలియవలయును. అవి పరమేశ్వరునికి శిరస్సువంటివే. వాటికి పైన జగద్రూపమేదియు లేదు. కావున అగ్నిని శిరస్సు అన్నది వేదము. కన్నులు ముక్కునకు ఆవల, ఈవల ఉండునని మన మెఱుంగుదుము. శిరస్సునందుండెడు కన్నెమో ముక్కునకు పైగా భ్రూమధ్యస్థానమున నుండును. భ్రూమధ్యమునకు ఫాలభాగమనికూడ పేరుకాన, దీనిని ఫాలలోచనమని కూడ అన్నారు. అది కలవాడే ఫాలలోచనుడు. దేవునియొక్క ఈ మూడు కన్నులచేతనే లోకవ్యవహారము సాగుచున్నది. సూర్యచంద్రులు, పగటిని, రాత్రిని కల్పింపగా, అగ్నిహోత్రము వంట మొదలగు పనులకు ఉపయోగించుచున్నది. అగ్నిలేనిచో కేవల సూర్యునివలన పాకాదులు సిద్ధముకావు. కావున అగ్ని సూర్యుల ప్రత్యేక శక్తులు లోకమున కవసరములు. సూర్యపక్వములగు పదార్థములు కొన్ని ఉన్నవన్న విషయము వేఱు. అంతేకాక అగ్నిహోత్రుడు జీవుల గర్భములందుకూడ నెలకొని జఠరాగ్ని రూపమున వారు తిన్న అన్నాది పదార్థములను జీర్ణింప

జేయుచున్నాడు. అంతేకాక పరమేశ్వరుని అష్టశరీరములలో సూర్యచంద్రాగ్నులుకూడ ఉన్నారు. కావున విశ్వేశ్వరుని త్ర్యంబకుడనుట సార్థకమే- ఇంకొక రహస్యార్థమును చూతము.

సూర్యచంద్ర శబ్దములచేత ఇడా, పింగళా నాడులు, సూచితములగుచున్నవి. వాటి కధిపతులుకూడ వారేకావున సూర్యనాడి, చంద్రనాడి అని వాటిని అనుచుందుము. ఇడ యనగా కుడి ముక్కురంధ్రము- పింగళ యనగా ఎడమ ముక్కు రంధ్రము. ఈ రెంటికిని నడుమ సుషుమ్న అను పేరుతో ఇంకొక నాళముకూడ కలదు. దాని కధిపతి అగ్నిదేవుడు. ఆ సుషుమ్నా నాళము ఆధారకమలమునుండి సహస్రారకమలము వఱకు వ్యాపించి యుండును. ఆ ఆధారముననే కుండలినీశక్తి నిద్రావస్థలో నున్నది. ఆధారమునుండి స్వాధిష్ఠ, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రములద్వారా సుషుమ్నానాడి సహస్రారము వఱకు వ్యాపించియుండును. నిద్రించుచున్న కుండలినీశక్తిని మేలు కొలిపి స్వాధిష్ఠానాదులమీదుగా సహస్రారమున ప్రవేశపెట్టి పరమాత్మైక్యమును చెంది ముక్తులగుటయే యోగులు చేసెడిపని. అట్టిపనికి ఇడా, పింగళా, సుషుమ్నా నాళములతో చేయవలసిన యోగప్రక్రియ ఎంతయో యున్నది. కనుక ఇడా, పింగళా, సుషుమ్నలు త్రినేత్రములచేత సూచితములై

త్ర్యంబకపదమునకు లక్ష్యార్థములగుచున్నవనుట పరమ రహస్యము.

సూర్యచంద్రాగ్ని నేత్రములచేత భగవంతుడు త్ర్యంబకుడైనట్లు సాధకుడు గూడ ఇడా, పింగళా సుషుమ్నల యందు చేసెడి ప్రాణ, కుండలినీశక్తుల సాధన ద్వారా సిద్ధి పొంది త్ర్యంబకుడు కావలయునని, మంత్ర తాత్పర్యము, సూచనయు. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మవేత్త బ్రహ్మమే అయినట్లు త్ర్యంబక తత్త్వ సాధకుడును త్ర్యంబకుడు కాగలడు. అప్పుడాతనికి కలుగు ప్రయోజన మేమందురా! తొడిమనుండి దోసపండూడిపడినట్లు మృత్యువు నుండి దూరుడై అమృతుడగుటయే. అంబకము- (కన్ను) రూపములను చూచుటకు సాధనము కనుక దానిచే ఏ సాధనమైనను లాక్షణికముగ చెప్పికొనవచ్చును. కాన ఇడా, పింగళా, సుషుమ్నలు అంబకముల (సాధనముల) వంటివే. పరమాత్మ దర్శనమునకు ఆ నాడీత్రయము కన్నులవంటివే అని, ఆ మూటిని అంబకములని చెప్పికొన్నచో మనకు పరమార్థలాభము కలుగును.

మూడు కన్నులలోను ఒకటి అగ్నినేత్రముకదా! అది సుషుమ్నకు సూచకమనుకొన్నాము. సాధకుడు ప్రాణశక్తిని, ఇడా, పింగళలనుండి మార్చి సుషుమ్నా నాళమున సంచరింప చేయ నేర్చినచో ఆతనికి వెలుపలి ప్రాణసంచారముతో

పనిలేదు. అప్పుడాతని అగ్ని నేత్రము విప్పారినదగును. అనగా అతనికి కామదహనశక్తి- కోరికలను గెలుచు సామర్థ్యము కలిగి భగవంతుడే కాగలడు. పరమేశ్వరుడిట్టి యోగశక్తికి అధిపతి అన్నమాట

ఇడా, పింగళా సుషుమ్నలకు వరుసగా సూర్య, చంద్ర, అగ్నులు అధిపతులనియు, సంకేతములనియు మన మెఱుంగుదుము. సూర్యచంద్రనాడులద్వారా చేసెడి ప్రాణాయామ ప్రక్రియచేత ప్రాణవాయువు సుషుమ్నా నాళమున ప్రవేశింపగలదు. కుండలినీశక్తి గూడ ఆ సుషుమ్నయందే సంచరించును. ఆ మార్గమున జీవ ప్రాణములను ఊర్ధ్వమునకు- అనగా సహస్రారమునకు చేర్చుట ముక్తిహేతువు. ఈ అంశమునే ఉపనిషత్తు "తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి" అని ప్రబోధించినది. అనగా సుషుమ్నా మార్గమున పైకి- సహస్రారమునకు పోయినచో జీవుడు అమృతుడగుచున్నాడని భావము. కావున త్ర్యంబకశబ్దమునకు ఇడా, పింగళా సుషుమ్నలని చెప్పికొన్నందున మనకు కలిగెడి అర్థలాభము అమూల్యమైనది. ఇంకొక రహస్యము.

ఇడా పింగళలకు లేని పరమ ప్రాధాన్యము సుషుమ్నకు ఏల ఇవ్వబడినదని మనము ఆలోచింపవచ్చును. ఇడా పింగళలు స్థూలములైనవి. వెలుపలికి గోచరించునవి. హృదయమునందున్న నూటయొక్క నాడులు సూక్ష్మములైనవి. వాటిలో సుషుమ్నానాళము సూక్షాతి సూక్ష్మము.

రుద్రునికి సుమ్నము- (సుఖస్వరూపము) అని ఒకపేరు వేద మంత్రములోనే యున్నది. కనుక అది భగవత్స్వరూపము కూడను. ఆ సుషుమ్నశబ్దమునకు సు అనెడి ఉపసర్గను చేర్చినచో సుషుమ్న అగుచున్నది. అది పరమోత్కృష్టమైన ఆనంద స్వరూపమైనది. అట్టి పరమాద్వైతానందము నిచ్చునది అని కూడ దాని నిగూఢార్థము.

ఎప్పుడును స్థూలవస్తువును చూచుట, గ్రహించుట తేలికయేకాని సూక్ష్మమును గ్రహించుటకు సూక్ష్మమైన బుద్ధికే సాధ్యము. స్థూలములైన ఇడా పింగళల విహారమున కన్నను సూక్ష్మమైన సుషుమ్నను తెలిసికొని అందు విహరించుట మందబుద్ధులకు సాధ్యమైన పనికాదు. అంతేకాదు. భగవంతుడు కూడ "అణోరణీయాన్" సూక్ష్మమునకంటెను సూక్ష్మమైనవాడు. అట్టి సూక్ష్మ వస్తువులో ప్రవేశించుట సూక్ష్మమైన బుద్ధికే సాధ్యమగుచున్నది. కావుననే ఉపనిషత్తు తయా=సుషుమ్నా మార్గముద్వారా, ఊర్ధ్వం=పైకి, అనగా సహస్రారమునకు ఆయన్=పోవుచూ, అమృతత్వం =మోక్షమును, పతిపొందుచున్నాడు అన్నది.

ఇక్కడ పైకిపోవుటలోకూడ ఒక రహస్యము కలదు. దిగువనున్నవి తమో (చీకటి) మయములైన అధమ లోకములు. పైనున్నవి సత్వగుణమయములైన స్వర్గాది సత్య లోకములు. అవి తేజోమయములు, ఆనందరూపములు. ఇందుకు దిగువ దృష్టాంతమును చూడవచ్చును. కంటి

"అగ్నేనయ సుపథారాయే
అస్మాన్విశ్వాని దేవవయునాని విద్వాన్,
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ"—ఋ.1-189-1.

తా॥ ఓ అగ్నిదేవా ! మమ్ము మంచి మార్గమున మోక్షధనముకల నిధికడకు కొనిపోవుచూ మా పాపమును దహింపుము. అగ్ని సంచరించు సుపథము సుషుమ్నానాళమే కాన,ఆ మార్గమున మాసాధన విధానమును కొనసాగింపుమని భావము. మా పాపమును దహింపుమనగా, మా ఆగామి సంచిత ప్రారబ్ధరూపమయిన జన్మహేతుకర్మను నశింప జేయుమని భావము. ఈ విధముగా వేదరహస్యములు మానవుల నుద్ధరింప, నిగూఢములై వేదపురుష హృదయ మున దాగియున్నవి.

ఇంకొక రహస్యము :- ప్రతివారికిని స్థూల, సూక్ష్మ, కారణములని మూడు శరీరము లుండును. ఆ మూడు శరీర ములను తాల్చియే ప్రతిజీవుడును కర్మరంగమున తిరుగు చున్నాడు. కనుకనే దేవమానవాది సర్వప్రాణులును, మూడు శరీరములనెడి సాధనములు, కలవారే, వాటిచేత వ్యవహరించువారే. అట్టి శరీరములకు తండ్రియైనవాడు జీవాత్మకాని, పరమాత్మకానికావచ్చును. కనుక త్ర్యంబకు డనగా జీవాత్మయు, పరమాత్మకూడ అయి మనకు అద్వై తము సిద్ధించుచున్నది. నిర్గుణ పరమాత్మ ఈశ్వర (అవ్యా

కృత) హిరణ్య గర్భ, విరాట్ఛరీరములను తాల్చుటకూడ త్ర్యంబక లక్షణమే, త్ర్యంబక స్వరూపమే. కావున త్ర్యంబకార్చన అనగా జీవాత్మ విజ్ఞానము, పరమాత్మ విజ్ఞానము కూడ అయి అది ముక్తి హేతువగుచున్నది.

ఇంకొక రహస్యము :- నిజమునకు భగవంతుడు కాలాతీతుడు. అందుకే ఆయనను కాలకాలుడు. కాలమును మ్రింగివేయువాడు అని అన్నారు. అతడు కాలాతీతుడైనను, జగద్రూపుడైనప్పుడు కాలస్వరూపుడుకూడను. ఈ అంశమును గీత "కాలోఽస్మి లోక క్షయకృత్ ప్రవృద్ధః" (11-32) అన్నది. అథర్వవేదమునందలి కాలసూక్తము, ఋగ్వేదీయ మోక్షసూక్తములోని కొంతభాగము కాల స్వరూపమును గూర్చి వివరించి అది భగవత్స్వరూపమే అని చెప్పుచున్నవి. ఈ కాలము- భూతము, వర్తమానము, భవిష్యత్తు అని మూడు విధములుగా నుండునని మన మెఱింగియే ఉన్నాము. కావున భగవంతుడు త్ర్యంబకుడనగా భూత, భవిష్యత్, వర్తమాన కాలస్వరూపుడనియు గ్రహింప వలసియున్నది. ఇట్టి కాలమును సద్వినియోగ పఱచుకొనుటయే సాధకుల దివ్యసాధనము. అనగా భూతకాల జ్ఞానమును నెమరువేసికొనుచు, వర్తమాన కాలమును సుసంపన్న మొనర్చుకొనుట, భవిష్యత్తులో జీవిత సార్థక్యమును సాధించుకొని అమృతుడగుట త్ర్యంబకారాధనమని పాఠకులు గ్రహింపవలసియున్నది. ఇట్టి అనేక రహస్యములు

త్ర్యంబక శబ్దములో దాగి మానవులకు కర్తవ్య బోధ చేయు చున్నవి.

త్రిశబ్దముచేత చెప్పఁబడగిన వాటి నన్నిటిని త్ర్యంబక శబ్దమునకు అనువర్తింపచేసికొని మనమీ మంత్రమునకు పరమార్థలాభమును పడయవలసి ఉన్నది. సర్వజీవులకు మనస్సు, వాక్కు, కాయము అనెడి త్రికరణములు జీవిత సాఫల్యమును పొందుటకు సాధనములు. ఆ సాధనములే అంబకములు. ఈ మూడు సాధనములు కలవాడు జీవాత్మయే కదా. ఆతడు తన మనోవాక్కాయములను యోగజ్ఞానాది సాధనములచేత పరిశుద్ధములను శక్తిమంతములను చేసికొని విరాట్టు, హిరణ్యగర్భ, ఈశ్వర స్వరూపములలోనున్న అఖండ పరమాత్మను పొందుట, ఆతనిలో లీనమగుట జీవిత పరమార్థము కాదా! ఈ అర్థమున జీవుడునూ త్ర్యంబకుడే. పరమాత్మయు త్ర్యంబకుడే.

త్రిశబ్దముచేత పృథ్వి, అంతరిక్షము, స్వర్గమనెడి త్రిలోకములను, లేదా స్వర్గ మర్త్య పాతాళములను గ్రహింపవచ్చును. ఇట్టి త్రిలోకములకు అధిపతీ, వాటిని సృష్టించినవాడు పరమేశ్వరుడే కదా! కావున త్ర్యంబక మంత్రము నిన్ను త్రిలోకారాధనచేసి త్రైలోక్యాధిపతిని చేరుమని అనుశాసించుచున్నది-బోధించుచున్నది.

సర్వజీవులకును ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము అని మూడు దుఃఖములు కలవు. వాటి నే

తాపత్రయమందురు. ఈ త్రివిధములైన దుఃఖములయొక్క రాహిత్యమునే సర్వజీవులు కోరుకొనుచుందురు. అదే వారు సాధింపవలసిన పరమ పురుషార్థము. ఈ అంశమును కపిలుని సాంఖ్య సూత్రము" అథ త్రివిధ దుఃఖ ఆత్యంతిక నివృత్తి రత్యంత పురుషార్థః" ఈ మూడు తాపములు చల్లారుటయే మానవులకు పరమపురుషార్థమని వక్కాణించినది. ఈ మూటిని కలిగినవాడు, త్ర్యంబకుడు- జీవుడు కాగా, వాటిని పోగొట్టువాడు దేవుడు-పరమాత్మ అగుచున్నాడు. కావున త్ర్యంబకారాధనము అందుకు సాధనము.

రుద్రునికి వైద్యులకుగూడ వైద్యుడని ఒక పేరున్నది. ఈ విషయమునే ఋగ్వేదము, "భిషక్తమమ్ త్వాభిషజాం శృణోమి" (ఋ. 2-33-4) అన్నది. డాక్టర్ల రోగములను గూడ కుదిర్చెడి గొప్ప డాక్టరు రుద్రుడన్నమాట. మానవు లందఱు జరా, రోగ, మృత్యువులచేత పీడింపబడుచున్నారు.

మిక్కిలిగా ఉపకరించును. బుద్ధిమంతులైన వారు ఆహార, విహార, వ్యవహారములలో తగినరీతిగ ప్రవర్తించియు, ప్రాణాయామ ప్రక్రియను అవలంబించియు ధ్యానసమాధులను నేర్చియు వారి దైహిక, మానసిక, ఆత్మిక ఆరోగ్యములను కాపాడుకొనుచుందురు. వారినే ధీరులని వేదము పొగడినది. కాగా ఇట్టి వాత, పిత్త, శ్లేష్మములు శారీరకముగా కల జీవుడు త్ర్యంబకుడు. వాటిని హతమొనర్చి, జీవులను రక్షించువాడు భగవంతుడగు త్ర్యంబకుడు. కనుక "త్ర్యంబకం యజామహే" భగవంతుని పూజించుట అనగా ఇన్ని విధముల చేసి వాటి ఫలములను మానవులు పొందవలసియున్నారు. అప్పుడే వారికి శారీరక, మానసిక, రోగములు తొలగి పరమానంద స్వరూప మోక్షము సిద్ధించును.

త్రిశబ్దముచేత తమస్సు, రజస్సు, సత్వము అనెడు మూడు గుణములనుకూడ గ్రహింపవలసి యున్నది. ఈ మూడు గుణములతో కూడిన పంచభూతముల చేతనే ప్రపంచ సృష్టి జరుగుచున్నది. రజస్సుచేత సృష్టి, తమోగుణముచేత లయము, సత్వగుణముచేత స్థితి కలుగుచుండును. మానవ జీవితమున కూడ జాగ్రదవస్థ సత్వగుణముచేత నిర్వహింపబడుచుండగా, నిద్రావస్థ తమోగుణముచే కొనసాగుచున్నది. ఇక ఈ రెంటికి నడిమిదైన స్వప్నము రజోగుణముయొక్క ఫలము. సర్వప్రాణులును,

ఆగామి, సంచితము, ప్రారబ్ధము అని మూడు విధములుగా నుండును. ఈ కర్మల ఫలము ననుభవించుటకే జీవులకు చావుపుట్టుకలు ప్రాప్తించుచున్నవి. కర్మలయొక్క మంచి, చెడులనుబట్టియే ఉత్తమ,మధ్యమ అధమజన్మలేర్పడుచున్నవి. ఇట్టికర్మలను చేయుటకు జీవుడు కర్తకాగా, వాటిని జీవులచే అనుభవింపచేయుటకు ఈశ్వరుడు ప్రభువగుచున్నాడు. ఏ జీవికాని, పాపమును చేయుటకు ముందుకు వచ్చునేకాని దాని ఫలము ననుభవింపబోవుతఱికి వెనుకంజనే వేయును గదా. వాటి ననుభవింపచేయు ప్రభువే భగవంతుడు జీవులకీ కర్మరహస్యము తెలిసిననేకాని, వారీశ్వరారాధన చేసి తరించుటకు పూనుకొనరు.

త్ర్యంబక శబ్దములోని త్రిశబ్దమునకు ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము అనెడి వేదస్వరములు మూడు అర్థము. అంబక శబ్దమునకు సాధనమని అర్థము ను గ్రహించియే యున్నాము. కావున ఉదాత్తానుదాత్తస్వరితములు ఉచ్చారణ సాధనములుగాగల వేదము అని ఇంకొక భావము. ఉదాత్తానుదాత్త స్వరితరహితముగా వేదమును చదువరాదని మనకు నియమమున్నదికదా. కనుక త్ర్యంబక మనగా ఉదాత్తానుదాత్త స్వరితములతో గూడిన వేదమని అర్థము. అట్టి వేదమును చదివి తదర్థము నెఱింగి అనుష్ఠించువారు మృత్యురూప సంసారమునుండి ముక్తులై అమృతత్వమును పొందగలరని ఉత్కృష్టమైన మహాభావము సిద్ధించు

చున్నది. వేదము, వేదార్థము దాని ఆచరణము ఐహికాముష్మిక పారమార్థిక ఫలములను అందించునని ఎల్లరెఱింగిన విషయమేకదా. కాన ఈ త్ర్యంబక మంత్రము వేదోపాసనాపరముకూడ. త్ర్యంబకుడైన పరమేశ్వరుడు ఆ వేదములోనే విశ్వరూపుడై మనకు గోచరించుచున్నాడు కదా!

జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అనువాటిని కూడ త్ర్యంబకములని చెప్పికొనవచ్చును. అట్టి మూడవస్థలను దాటించి సమాధికి, గొంపోయి తురీయాతీత స్థితిలో పరబ్రహ్మ సాయుజ్యమును చేకూర్చు ప్రభుడును, చేరెడి జీవుడు కూడ త్ర్యంబకుడే అని తెలియవలసి యున్నది. ఈ విధముగా ఆలోచించిన కొలదియు, ఈ మంత్రమునకు అనేకార్థములు తోచి వేదవాణి, కామధేనువనెడి వాక్యము సార్థకము కాగలదు.

"స విశ్వరూప స్త్రిగుణ స్త్రివర్త్మా
ప్రాణాధిపః సంచరతి స్వకర్మభిః" 5-7.

ఆ భగవంతుడు విశ్వరూపుడును, మూడు గుణములు కలవాడును, మూడు మార్గములతో గొప్పవాడును, ప్రాణాది ఇంద్రియములకు అధిపతియు అయి, తన సృష్ట్యాది కర్మల చేత ప్రకాశించుచున్నాడు. ఇందలి విశ్వరూపశబ్దము చేతనే మనము త్ర్యంబక శబ్దమునకు బహురూపములైన అర్థములను చెప్పికొని యున్నాము. "త్రివర్త్మా" అనగా మూడు మార్గములు కలవాడు. అనగా ఋగ్యజుస్సామ స్వరూపమైన త్రయీమార్గమున సంచరించువాడనియు, సృష్టి, స్థితి, లయాధీశ్వరుడనియు, అనాహతాజ్ఞా సహస్రారములచేతనూ ఇడా,పింగళా,సుషుమ్నా నాళములచేత పొందదగినవాడనియు, అనేకార్థములు చెప్పికొనవచ్చును. జీవాత్మపక్షముగ దేవ, మానవ, తిర్యగాది విశ్వరూపములు ధరించువాడనియు, త్రిగుణ బద్ధుడనియు, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అనెడు మూడు మార్గములు (అవస్థలు) గల త్రివర్త్ముడనియు సమన్వయించుకొనవలయును. అట్టి జీవుడు సూక్ష్మశరీరముచే ప్రాణములు కలవాడై తన కర్మలచేత సంసారమున తిరుగుచున్నాడని భావము. ఈ శ్లోకమునకు, మూలమైనది త్ర్యంబక శబ్దమే అని మనము తేలికగానే గ్రహింపగలము. ఋగ్యజుస్సామములకు త్రయి అనిపేరు. అవి మూడు అంబకములుగా అనగా లోక మోక్షసాధనములుగా గలవాడు

కూడ త్ర్యంబకుడే. వేదజనకుడు(వాచస్పతి)భగవంతుడే కాన, త్ర్యంబక శబ్దము వేదజనకుడైన పరమేశ్వరునికి చెల్లు చున్నది. అట్టి వేదార్థమును అనుష్ఠించువానికి అమృతత్వము కరతలామలకమని ఒక భావము.

వీటన్నిటినీ మించిన పరమోత్కృష్టమైన భావము పూర్ణపురుషులు (సిద్ధపురుషులు) అనుష్ఠించునట్టిది ఇంకొకటి కలదు. అదేమన! త్రి అనగా బ్రహ్మరూపమైన సత్తు (శాశ్వతత్వము) చిత్తు (జ్ఞానము) ఆనందములనెడి త్రికము కదా! ఆ మూటిని కలవాడే త్ర్యంబకుడు. పరమాత్మకు సచ్చిదానందములే స్వరూపములు. అందుకే ఆనంద వల్ల్యాదులు "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" "విజ్ఞాన మానందం బ్రహ్మ" ఇత్యాదిగా గానము చేసినవి. కనుక త్ర్యంబకుడనగా సచ్చిదానంద స్వరూప పరమాత్మ, విశ్వ హేతువు, విశ్వకర్మ అని సిద్ధమగుచున్నది. అనగా త్ర్యంబక పదవాచ్య జగత్కారణశక్తిని శాశ్వతమైన దానినిగాను, జ్ఞానస్వరూపముగాను, ఆనందముగాను చూడవలెననియు, అనుభూతినందవలెననియు భావము. ఇంకొక విశేషమేమన, సదసదతీత, చిజ్జడాతీత, దుఃఖానందాతీతముగా దర్శించుట, సిద్ధిపొందుట. ఇట్టి సామాన్య, విశేష పరమార్థములనేకాక, సర్వార్థాతీత సర్వపరిపూర్ణమునుగూడ త్ర్యంబక పదమునకు భావింపవచ్చును. ఇవి అన్నియును సాధకుల, సిద్ధుల, అనుభవపరుల, పండితుల బుద్ధి సూక్ష్మతమీద ఆధారపడి

యున్నవి. ఇట్టి విశ్వరూపార్థములన్నియు వేద జనకుని హృదయమునుండి పుట్టినవే ఆయన స్వరూపములే.

త్ర్యంబకతత్త్వ మిట్టిదిగనుకనే దానిని శ్వేతాశ్వతరోపనిషత్తు శివ, సవితృ విశ్వకర్మ శబ్దములచే గూడ పేర్కొని ఆశబ్దార్థముల పరమైక్యమును చాటుచున్నది.

"యదా తమ _స్త న్న దివా న రాత్రి
ర్న స న్న చాస చ్ఛివ ఏవ కేవలః,
తదక్షరం త త్సవితు ర్వ రేణ్యాం
ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ." 4-8.

రేలు, పవళ్ళుకాని, చీకటి వెలుగులుకాని, సదసత్తులు కాని- ఏద్వంద్వములు(జంటలు) లేనప్పుడు పారమార్థికముగ ఒక్క శివతత్త్వమే వెలుగుచున్నది.అదే అక్షరము-నశింపనిది. సవితృశబ్దముచే పేర్కొనదగినది గూడ. ఇది నాసదీయ సూక్తము చెప్పిన సదసదతీత తత్త్వమే కదా. దానినుండియే ప్రాచీనమైన ప్రజ్ఞ అనగా మాయ ప్రసరించినది. ఈ ప్రజ్ఞను నాసదీయ సూక్తము తమస్సని చెప్పగా, విశ్వకర్మ సూక్తము "నీ హారము" (మంచు) అన్నది. దీనిని బట్టి మూలతత్త్వము శివము - అనగా ఋతము అన్న మాట. ఆ ఋతమునుండి సత్యము పుట్టి అదియే పరబ్రహ్మముగా పేర్కొనబడినది. ఈ నిజమును వేదము "ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం" అని పేర్కొన్నది. అనగా ఋతము ఆదిమ తత్త్వము. దానినుండి సత్యము తోచినది. మఱల దాని

నుండి సుందరమైన ప్రకృతి- సృష్టి బయలుదేరినది. దానినే మనవారు "సత్యం, శివం, సుందరం" అన్నారు. వేదమే మొ 'ఋతం సత్యం పరం బ్రహ్మ" అన్నది. కాగా శివ మన్నను, ఋతమన్నను మొట్టమొదటి జగత్కారణతత్త్వమే దీనిని ఈ మంత్రము శివశబ్దముచే పేర్కొనగా, విశ్వకర్మసూక్తము, విశ్వకర్మ పదముచే పేర్కొన్నది. మూలస్తంభము స్వయం భూవిశ్వకర్మ' అన్నది. ఇంకొక శ్వేతాశ్వతరమంత్రము, మనుజుడు ఈ శివతత్త్వమును తెలిసికొని, శాంతి పొందు చున్నాడనుచున్నది.

"సూక్ష్మాతి సూక్ష్మం కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టార మనేక రూపం,
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి". -4.14

సూక్ష్మమునకంటెను సూక్ష్మమును, తానేకరూపు డయ్యును, నానారూప సృష్టిని వెలార్చినవాడును, విశ్వ మంతటను వ్యాపించినవాడును అగు శివుని తత్త్వము నెఱింగిన నరుడు త్రివిధ దుఃఖముల శాంతిని పొందు చున్నాడు.

మంత్రములో పరమాత్మ తత్త్వము సూక్ష్మాతి సూక్ష్మమని చెప్పబడినది. అది ఎట్లు సూక్ష్మమో విచా రింతము. మన మెఱింగిన భూతములలో భూమి ఘన పదార్థము, స్థూలమును. దానికన్న జలము, దానికన్న అగ్ని,

దాని కన్న గాలి, దాని కన్న ఆకాశము సూక్ష్మాతి సూక్ష్మములని మనమెఱుంగుదుము. ఆ ఆకాశమున కన్నను అహంకారతత్త్వము, దానికన్నను, మహత్తత్త్వము (బుద్ధి) దానికన్న దానికి హేతువయిన అవ్యక్తమును మిక్కిలి సూక్ష్మములు. అట్టి అవ్యక్తమునకంటెకూడ అవ్యక్తమై సూక్ష్మాతి సూక్ష్మమయినది పరమాత్మ తత్త్వము. దానిని సదసదతీతమని శ్రుతి పేర్కొనుచున్నది. ఇక మహత్తనగా భూమ్యాకాశాదుల కంటెను గొప్పదన్నమాట. ఎన్ని విశ్వములయినను పరమాత్మయొక్క పాదమాత్రమే కదా (పాదోఽస్య విశ్వా భూతాని) కావున దానిని మించిన తత్త్వమును మహత్తులకన్న మహత్తనినారు. దీనినే శ్రుతి "అణో రణీయాన్, మహతో మహీయాన్" అని పేర్కొన్నది. అది మహత్తయినను; అణువైనను ఆ రెండును అందుండి వెలువడిన భిన్నస్వరూపములే కాని, ఆ తత్త్వమునకు మాత్రము ఎట్టి భేదములును లేవు. అది భేదరహితము. మనము వివరించుకొనిన త్ర్యంబకతత్త్వము అట్టిదన్నమాట. ఇక విశ్వకర్మ పదమును శ్వేతాశ్వతరము ఎట్లు వాడినదో చూతము-

"స విశ్వకృ ద్విశ్వవి దాత్మయోనిః
జ్ఞః కాలకాలో మునీ సర్వవి ద్యః,
ప్రధాన క్షేత్రజ్ఞపతి ర్గుణేశః
సంసార మోక్షస్థితి బంధహేతుః" 6-16

ఆ జగత్కారణతత్త్వము విశ్వనిర్మాణాదులు చేసి నందున దానిని విశ్వకృత్తు అన్నారు. అనగా విశ్వములను సృజించిన విశ్వకర్మ అని భావము, అంతేకాదు. అది విశ్వమును, తద్రహస్యములను ఎఱుంగునట్టి విశ్వవిత్తుకూడ. విశ్వమునందలి సర్వప్రాణుల కర్మజ్ఞానము ఆభగవంతునికే కలదనుట రహస్యము. ఇంకను అది ఆత్మయోని. అనగా దాని కదియే కారణముకాని, ఇంకొక కారణము లేదన్న మాట. అది కాలమునుగూడ హరించునట్టి కాలకాలము. గుణరహితమయ్యును, త్రిగుణములను కల్పించి సృష్టిని నడపుచున్న గుణికూడ అదియే. అది సర్వవిత్తు. అనగా సర్వమును ఎఱింగినదన్నమాట. దానికి విశ్వతత్త్వమేకాక, విశ్వాతీత రహస్యమును తెలియునని భావము. అది ప్రధాన రూపమును, క్షేత్రజ్ఞులైన జీవులకు, అధిపతియు, సంసార బంధమునకుగాని, దాని మోక్షమునకుగాని హేతువై ఒప్పు నట్టిదియును. ఇట్టి త్ర్యంబక స్వరూప విశ్వకర్మతత్త్వము సర్వోపాధులలోను కలదనియు, దాని నెఱింగిననేకాని అమృతత్వము రాదనియు ఇంకొక మంత్రము పలుకు చున్నది.

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మనీషా మనసాభిక్లృప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవంతి." 4-17.

దీనికి శ్రీ నిరంజనశాస్త్రిగారి తెలుగు-

ఆ. వె. ఇతడు విశ్వకర్మ, ఈ దేవుడు మహాత్ము
డెపుడు నిలుచు జనుల హృదయమందు;
ఎవ్వరీ మనీష నెదలోన భావింతు
రమృతు లగుదు రెల్ల రట్టివారు.

ఇట్టి విశ్వకర్మతత్త్వము నెఱిగినవారు సంసారబంధము నుండి ముక్తులై అమృతత్వమును పొందుదురు. ఇట్టి తత్త్వము హృదయ ప్రదేశమునందే కలదని, దాని నెఱుంగుట కంటె ఇంకొక కర్తవ్యము లేదనియు అదియే భోక్త, భోగ్యము, ప్రేరకుడనెడి త్రిపుటి రూపముగా నున్నదనియు, ఆ మూడును బ్రహ్మరూపమే అనియు ఇంకొక మంత్రము పలుకుచున్నది.

"ఏతద్ జ్ఞేయం నిత్య మేవాత్మ సంస్థం
నాతః పరం వేదితవ్యం హి కించిత్,
భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా
సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్." 1-12

ఇంతవఱకు పేర్కొనిన- శివ, విశ్వకర్మ పదములచే చెప్పబడిన తత్త్వము ఒక్కటే అని ఇంకొక ప్రమాణము చాటుచున్నది.

"యో దేవానాం ప్రభవ శ్చోద్భవశ్చ
విశ్వాధిపో రుద్రో మహర్షిః,

హిరణ్యగర్భం జనయామాస పూర్వం
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు." 3.4

సర్వ దేవతలకు జనన కారణమైనవాడును, విశ్వమునకు ప్రభుడును, మహర్షియు అగు రుద్రుడు మొదట హిరణ్యగర్భుని (బ్రహ్మను) సృష్టించెను. అట్టి రుద్రుడు మాకు మంగళకరమైన బుద్ధిని ఒసంగుగాక. ఈ మంత్రమున రుద్రనామక జగత్కారణము బ్రహ్మను తననుండియే సృష్టించినట్లు చెప్పబడినది. ఈ బ్రహ్మను విశ్వకర్మ సృష్టించినట్లు విశ్వకర్మ సూక్తము దిగువ మంత్రమున చెప్పినది. "విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవః" అని "విశ్వకర్మణస్సమవర్తతాధి, తస్య త్వష్టా విదధ ద్రూపమేతి" అన్నది పురుష సూక్తము. ఆ విశ్వకర్మ, బ్రహ్మ(త్వష్ట) దేవుడైనాడు, లేక బ్రహ్మను సృష్టించినాడు. ఇట్లనుటచేత సృష్టించిన మూల తత్త్వమొక్కటే అనియు అది ఒకచోట రుద్రశబ్దముచేతను, ఇంకొకచోట విశ్వకర్మ శబ్దముచేతను పేర్కొనబడినది. అవి రెండునూ ఒకటే. నామభేదమేకాని, వస్తుభేదము లేదు. ఈ రహస్యము నెఱింగి మనము వేదవేదాంతముల నర్థము చేసికొనవలసియున్నది. "యో దేవానాం నామధా ఏక ఏవ" అనెడి విశ్వకర్మ సూక్తమంత్ర వాక్యము కూడ నామరూప భేదమునుబట్టి వస్తువును భిన్నమని భావింపవలదని యే హెచ్చరించుచున్నదికదా!

ఇట్టి మూలతత్త్వము వేదములయందు పరమమహిమయైన

రహస్యముగా ఉన్నదని శ్వేతాశ్వతరములోని ఇంకొక మంత్రము పేర్కొనుచున్నది.

"త ద్వేద గుహ్యో ప నిష త్సుగూఢం
తద్బ్రహ్మా వేదయతే బ్రహ్మయోనిం,
యేపూర్వం దేవా ఋషయ శ్చ తద్విదు
స్తే తన్మయా అమృతా వై బభూవుః" 5.6

ఇంతవఱకు చెప్పికొన్న జగత్కారణ శివ విశ్వకర్మ పరమేశ్వర తత్త్వము వేదగుహ్యము. వేదములయందున్న రహస్యము. ఉపనిషత్=ఉపనిషత్తుల యందది సు+గూఢం= సుగమము చేయబడినను, రహస్యముగా నున్నట్టిదే! రహస్య మనగా దాచబడినదనియు భావము. అది సుగూఢము కనుక దానిని వివరింపగలవారు వివరించిననే కాని, తెలిసి కొనజాలము. అనగా దానిని సాక్షాత్కరింపచేసికొన్న వారు మాత్రమే దానిని వివరింపగలరు. వేదముల పుట్టుకకు కారణమయిన ఆతత్త్వమును పరమేష్ఠి మన కెఱింగించు చున్నాడు. పరమేష్ఠి బ్రహ్మవిద్యోపదేశికులలో రెండవ వాడని మనముబృహదారణ్యకోపనిషత్తునందు చదువగలము. పూర్వులైన దేవతలు, ఋషులు దానినెఱింగి తన్మయులును అమృతులును అయినారు. ఇక్కడ పూర్వ ఋషులనగా సానగ, సనాతన, వసిష్ఠ, వామదేవాదులనియు, పూర్వ దేవతలనగా మనుమయాదులు, విష్ణు బ్రహ్మదులు అనియు తెలియవలయును. ఈ సంగతిని విశ్వకర్మ సూక్తము ఆ

దేవతలు ఋషులు "జరితారో న భూనా" ఎప్పుడు కూడ జీర్ణులుకారని చెప్పినది.

ఈ గ్రంథమునకు "ఋగ్వేద రహస్యాలు" అని పేరు పెట్టుట పై మంత్రమునందలి "వేదగుహ్యాం" అను మాటను బట్టియే. వేదగుహ్యామనగా వేదరహస్యమని అర్థము. అంతేకాదు, ఆ వేదరహస్యము ఉపనిషత్తులలో కూడ నిగూఢమయి ఉన్నదని "ఉపనిషత్సుగూఢమ్" అన్న మాటయే చెప్పినది. అందుకే గ్రంథకర్త ఆ వేదమంత్రములకుతోడుగా ఉపనిషన్మంత్రములనుగూడ ఉదాహరించి తత్త్వార్థమును సులభముగా తెలిసికొనునట్లు చేయుచున్నాడు. ఇంతకు పూర్వపు గ్రంథముల "ఏకం సత్" "సర్వంఖల్విదం బ్రహ్మ", "బ్రహ్మైవేదం విశ్వం" అనెడి నామములుకూడ తనయూహతో కల్పించినవిగాక, వేదోపనిషత్తులు చెప్పినవే అని పాఠకులెఱుంగక పోలేదు. అట్లే వేద గుహ్యాం అనుమాట నాధారము చేసికొనియే వేద రహస్యాలను వెలువరించుచున్నారు.

విష్ణు, రుద్ర, త్ర్యంబక, హిరణ్యగర్భ, ప్రజాపత్యాది శబ్దములకు పురాణాదులు వచించు కథోపాఖ్యాన రూపార్థములను చెప్పుకొనుటకంటెను, జగత్కారణ మూలవస్తువు, పరమాత్మ, పరబ్రహ్మము అను నర్థములకు చెప్పికొన్నచో సాధకులకు ముక్తిమార్గము సులభము కాగలదు. ఇట్టి త్ర్యంబక మంత్రమును రోగనివారణార్థమును, మృత్యు

భయము తొలగుటకును భక్తులు జపించుచుందురు. రుద్రుడు వైద్యశిరోమణియు, భవరోగవైద్యుడును అయి నందున నమక చమకములతో శివాలయములందు అభిషే కాదికార్యములను చేయుచుందురు. "నమశ్శివాయ" అను పంచాక్షరీమంత్రము నమకము నుండి గ్రహింపబడి భక్తులకు జపింపదగినదైనదనుసంశయమును ఇక్కడమఱువరాదు.

ఇంకొక సూక్ష్మరహస్యము పరిశీలింపవలసియున్నది. ప్రణవమనగా ఓంకారము. దానికి "అ"కార "ఉ"కార "మ"కారములనెడి మూడుఅంగములుకలవు. ఆ అక్షరము లనెడి అంబకములు (కన్నులు) కలవాడు త్ర్యయంబకుడన్న మాట. అనగా భగవంతుడు ఓంకారస్వరూపుడని భావము. అట్టి ఓంకారమును జపించుట, దానిభావమును మననము చేయుట త్ర్యంబకారాధనమే కాగలదు. ఇందుకు శాస్త్రము గూడ "జపేచ్చ ప్రణవం నిత్యం బ్రహ్మ విష్ణు శివాత్మ కమ్" బ్రహ్మ విష్ణు శివ స్వరూపమయిన ప్రణవమును నిత్య మును జపింపుమని చెప్పినది. అ కార, ఉకార, మకారములు మూడు బ్రహ్మ, విష్ణు, రుద్రులకే గుర్తులుకావు. సృష్టి, స్థితి, లయములకు, జాగ్రత్స్వప్నసుషుప్తులకు, రజస్సత్వతమో గుణములకు, రేచక పూరక, కుంభములకు, ఇట్టి ఎన్నో త్రికములకు అవి సంకేతములును, సూచకములును అని గ్రహింపవలయును. కాగా ఓంకార జపమననములు అక్షర స్వరూప ఈశ్వర జపమననములే అగుచున్నవి. యోగ

శాస్త్రమునుబట్టిచూచిన, ప్రణవము పరమేశ్వరునికి నామధేయమే. పతంజలియోగసూత్రములలో "క్లేశ కర్మ విపాకాశయైః రపరామృష్టః పురుషవిశేషః ఈశ్వరః". అవిద్యాది క్లేశములచేతను, అస్మిత, రాగద్వేషాభినివేశములచేతను, అంటుపడని పరమపురుషుడు ఈశ్వరుడని చెప్పబడినది. అట్టి ఈశ్వరుడేకదా జగత్కారణుడు. అట్టివానికి పేరు ప్రణవమని "తస్య వాచకః ప్రణవః" అని ఇంకొక సూత్రము పలికినది. కనుక ఎల్లనామధేయములకంటెను ఈశ్వరునికి దగ్గఱగా నుండునది ప్రణవమేయని స్పష్టమగుచున్నది. దానిని జపించుచు, దానిఅర్థమును భావింపుమని "తజ్జప స్తదర్థ భావనా" అని ఇంకొకసూత్ర మన్నది. కావున ఈశ్వరుడు క్లేశకర్మాతీతుడుకాగా, ఆయనకు ప్రణవము నామధేయమై సర్వసాధకులకు జపింపదగినది. మననము చేయదగినది అగుచున్నది గదా! ఇట్టి ప్రణవమునకు, శైవ, వైష్ణవ, శాక్తాదిభేదములేవియు లేవు. ఏ దేవునకైనను అది నామమై యొప్పును. కనుకనే ప్రతిమంత్రమునకును మనము ఆదియందు ప్రణవమును జోడించుచుందుము. ఈ విధముగా, త్ర్యంబకుడు అనగా ప్రణవమనియు, ప్రణవారాధన త్ర్యంబక పూజనమే అనియు తెలియుచున్నది. కనుక ప్రణవధ్యానమన్నను, త్ర్యంబకధ్యాన మన్నను ఒక్కటియే అనునది రహస్యము. అందుకే "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వ ముముక్షుభిః" ఎల్లముముక్షువులును ఓంఅనెడి పరబ్రహ్మమును ధ్యానింపవలయునని శాస్త్రమనుచున్నది.

త్ర్యంబకములనగా నాదము, బిందువు, కళ అనునవి అనికూడ భావించుట తత్త్వార్థమునకు త్రోవయే. బిందు వనగా బుద్ధితత్త్వము. అందు ప్రతిబింబించిన కళయే పర మాత్మ ఆతడు బుద్ధితోకలసి జీవభావమును పొందుచున్నాడు. దానితత్త్వమంతయు నాదస్వరూప ఓంకారములో ఇమిడి యున్నది. కాన నాదబిందుకళామయ పరబ్రహ్మమే త్ర్యం బకుడనగా. త్ర్యంబకారాధన నాదబిందుకళారాధనయే. కావున త్ర్యంబకశబ్దముచే చెప్పదగినతత్త్వము కానిదేదియు లేదు. అన్నియు అతని స్వరూపములే. "సవిశ్వరూపః"–, ఆతడు విశ్వరూపుడు.

ఈ సందర్భమున ఇంకొక రహస్యమునుగూడ పరి కింతము–

"అదృష్ట విగ్రహో దేవో, భావగ్రాహ్యో మనోమయః,
తస్యోంకారః స్మృతో నామ, తేనాహూతః ప్రసీదతి."

తా॥ కన్నుల కగపడని రూపముకలవాడును, మనోమ యుడును, అగుభగవంతుని, కేవలము భావమాత్రము చేతనే గ్రహింపవలసియున్నది. అట్టివానికి ఓంకారమే నామ ధేయము. ఆ ఓంకారజపముచే ఆయనను పిలిచినచో అతడు మనలను అనుగ్రహించకలడని శ్లోకభావము. ఇక్కడ ఈ రహస్యమును సహితము ఆధ్యాత్మిక సాధకులు భావింప వలయును.

"సోఽహం" అనుమంత్రము అత్యుత్తమసాధకులు జపించి మననముచేయునట్టిది. ఆ "సోఽహం"లోని సకార, హకారములను తొలగించినచో ఇక మిగులునది "ఓం" అనెడి శబ్దముమాత్రమే. ఈ ఓంకారమునే పరబ్రహ్మ వాచకమని చెప్పికొన్నాముగదా. కనుక ఓం అనగా "అహంబ్రహ్మాస్మి" నేను బ్రహ్మము నైతిని అనికూడ తెలుచున్నది. దీనినే శ్రీ వీరబ్రహ్మేంద్రగురుడు "నేనే బ్రహ్మమురా పామరులారా, నేనే బ్రహ్మమురా" అని ఒకతత్త్వములో గానము చేసియున్నాడు.

ఇక ప్రణవావయవములైన - అకార, ఉకార, మకారములనుగూర్చి ఎట్లుభావింపవలయునో, వాటి నెట్లు రేచక పూరక, కుంభకములయందు అనుసంధింపలయునో పరిశీలింతము. మనము మన శ్వాసమును, లోనికిపీల్చుచు మఱల వెలికి విడుచుచు ఉందుము. శ్వాసను లోనికి పీల్చుటకు పూరకమనియు, దానిని లోన నిలుపుటకు కుంభకమనియు, దానిని మఱల వెలుపలికి విడుచుటకు రేచకమనియుపేర్లు. ప్రణవాంగములయిన అకార, ఉకార, మకారములను వరుసగా పూరక, కుంభక, రేచకములయందు అనుసంధించుచుండవలెను. అనగా పూరించునప్పుడు అకారమును, కుంభించునపుడు ఉకారమును, రేచించునపుడు మకారమును మననము చేయవలెనన్నమాట. ఇట్లు చేసినందువలన మన శ్వాసప్రశ్వాసలు వ్యర్థములుకాక పరబ్రహ్మస్వరూపములే

అయి మనకు సంసార మోక్షము నొసంగి మనలను అమృతు లను చేయును. ఈ అంశమును ఇంకొకరీతిగా హంసమంత్ర ముతో సహితము సరిపుచ్చవచ్చును

"సోహం" అనెడిమాటకు అర్థము, ఆ బ్రహ్మమే నేను అని. ఆ "సోఽహం" శబ్దమును తలక్రిందులు చేసినచో "హంసః" అగుచున్నది. హంస అనగా జీవుడని భావము. ఆ పరమాత్మ ప్రకృతియొక్క ఉపాధియందు తలక్రిందులై తోచుటయే హంస అగుట. ఆయననుండి పుట్టిన ప్రకృతి యొక్క వికారమయిన అంతఃకరణోపాధియందు తానే మఱల తోచుట తలక్రిందులుకాక మఱేమిటి? అనగా పైనున్నవాడు తననుండిపుట్టి దిగువనున్నప్రకృతిలో ప్రతిబింబించుటయే తలక్రిందులగుట. ఈ రహస్యమునే సిద్దప్ప "తండ్రి గర్భమునుండి, తల్లిగర్భమునకు తానెట్లు వచ్చెరా బ్రహ్మం" అనెనుఅనగా, పరమాత్మ ప్రకృతిలో ప్రవేశించి జీవస్వరూపుడగుట అని రహస్యము. కనుక హంస శబ్దమునకు జీవుడనిఅర్థమువచ్చినది. పరమాత్మ జీవరూపహంస అయిననే కాని, అతడు జగత్తును అనుభవించుటకు వీలుకాదు. అందుకే ఆత్మనుహంస అన్నారు మనమనుకొన్న హంసమంత్రమును ఈ రీతిగా జపింపవలయునని సద్గురువుల ఉపదేశము. దానిని "సీతారామాంజనేయసంవాదము" ఇట్లు గ్రంథస్థము చేసినది.

తే॥ పూరకమున హకారంబు పొందుపఱచి
కుంభకంబున బిందువు గూర్చి యంత

రేచకమున సకారంబు చూచి, వానిఁ
జెలియు తెలివియె నేనని తెలియవలయు".

హకారమునకు పరమాత్మయే సంకేతము. (చిహ్నము) దానిని లోపలికి పూరించి బిందువుతో కుంభించవలయును. అనగా సాధకుడు దీనిచేత పరమాత్మస్వరూపుడగుచున్నాడని భావము. ఆవల సకారముచేత రేచింపవలయును. సకారము ప్రకృతికి చిహ్నము. కావున సంసారహేతువయిన ప్రకృతిని వదలుచున్నాడని భావము. ఇదియే హంసమంత్ర పరమార్థము. ప్రణవవిషయమునను - పూరక, కుంభక, రేచకములను వరుసగా అకార, ఉకార, మకారములతో చేసిన, శ్వాసప్రశ్వాసలవేళకూడ పరమాత్మధ్యానము చేసి, పరమాత్మ అయినట్లెలెక్క.

## సోఽయమాత్మా చతుష్పాత్

జగత్కారణ పురుషుడు నాలుగు పాదములు కలవాడనియు, వాటిలో ఒకపాదమే జగత్తనియు, తక్కిన మూడు పాదములు అమృతమయమైన, దివి అనియు మనము పురుష సూక్తములో చదువుదుము. పురుషుడు నాలుగు పాదములైనట్లే ఆ పురుష స్వరూపమే అయిన ఆత్మయు, ఆ పురుషునికి నామధేయమయిన ప్రణవమును నాలుగు పాదములు కలవే అగుచున్నవి. జీవాత్మకు జాగ్రదవస్థయందు విశ్వుడనియు, స్వప్నావస్థయందు తైజసుడనియు,

సుషుప్తిలో ప్రాజ్ఞుడనియు, సమాధిలో కేవలాత్మ అనియు నామము లున్నవి. ఇవియే ఆత్మయొక్క నాలుగు పాదములు. అట్లే ప్రణవమునకును, అకార, ఉకార, మకారములు మూడు పాదములగుచున్నవి. ఇవి మూడును జాగ్రత్స్వప్న సుషుప్తులకు గుర్తులు. ఇవికాక ప్రణవమునకు అమాత్రమని నాలుగవపాద మొకటి యున్నది. అట్లే జీవాత్మకును సమాధి అనెడి నాలుగవదశ కలదు. అమాత్రమయిన నాల్గవపాదము, సమాధికి, లేక తురీయమునకు చిహ్నము. కనుక ఈ నాలుగు పాదముల సాదృశ్యమునుబట్టికూడా ప్రణవమును, పరమాత్మయు ఒక్కటే. ప్రణవము పరమాత్మవాచకమే. దానికి సూచకమే. ఇట్టి పరమాత్మ త్ర్యంబకుడుగా ఈ మంత్రమున పేర్కొనబడినాడని పరమ రహస్యము. విశ్వ మ ను న ది ఏర్పడిన పిమ్మటనే త్ర్యంబకములుగాని, త్రికములుకాని కలిగినవి. అవి సృష్టిలోగల అనేక తత్త్వవిశేషములకు సంకేతములు, సూచకములు. వీటిని అతి రహస్యముగాను, అతిసూక్ష్మముగాను విశ్వకర్మ సూక్తము పరమ, మధ్యమ, అవమ ధామములని పేర్కొన్నది.

"యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మ న్నుతేమా" ఈ మంత్రములోని త్రిధామములే అవి. ఆ ధామములే త్ర్యంబక శబ్దములోని, మూడు అంబకములును. ఈ త్రిధామములను (జాగ్రదాదులు మూటిని) దాటిననేకాని నాలుగవదైన పరమాత్మతత్త్వమును

జీవాత్మ చేరజాలడు. కావున ప్రణవముకాని, ఆత్మకాని' పురుషుడుకాని, నాలుగు పాదములు కలవారగుచున్నారు.

ఆత్మయొక్క నాలుగు పాదములను గూర్చి మాండూక్యోపనిషత్తు "సోయమాత్మా చతుష్పాత్"అని వివరించినది. ఆవల నాల్గవదైన సమాధి దశను గూర్చి ఇట్లు వర్ణించినది కూడ.

"నాంతః ప్రజ్ఞం, న బహిః ప్రజ్ఞం, నోభయతః ప్రజ్ఞం,
నప్రజ్ఞాన ఘనం, నప్రజ్ఞం, నాప్రజ్ఞం, అదృష్ట,
మవ్యవహార్య, మగ్రాహ్య, మలక్షణ, మచింత్య, మవ్యప
దేశ్య, మేకాత్మ ప్రత్యయసారం, ప్రపంచోపశమం,
శాంతం, శివ, మద్వైతం, చతుర్థం మన్యంతే, స ఆత్మా
స విజ్ఞేయః" -7

తురీయదశ (సమాధి) యందలి కేవలాత్మ బహిః ప్రజ్ఞుడైన విశ్వుడుకాని, అంతః ప్రజ్ఞుడైన తైజసుడు కాని, ఉభయతః ప్రజ్ఞుడుకాని, ప్రజ్ఞాన ఘనుడైన ప్రాజ్ఞుడుకాని, ప్రజ్ఞుడుకాని, అప్రజ్ఞుడుకాని, కాదనియు, వీరందఱికీ ప్రకృతితో పొత్తు కలిగియున్నందున వీరు కేవలాద్వైత మూర్తులు కారనియు భావము. ఇక తురీయపురుషుడు అగపడనివాడును, వ్యవహారయోగ్యుడు కానివాడును, గ్రహింపదగినవాడుకూడ కాడనియు, ఏ లక్షణములు లేని వాడనియు, మనస్సుచే చింతింపదగని అమనస్కుడనియు, నిర్దేశింప వీలుకానివాడనియూ, ఒకే ఆత్మస్వరూపుడనియు,

ప్రపంచోపశమ స్వరూపుడనియు, శాంతము, శివము, అద్వైతము అయిన తత్త్వమనియు, వాడే తురీయ తురియాతీతములందు ప్రకాశించువాడనియు వక్కాణించుచున్నది. ఇంతకంటెను పరమార్థమేదియు వేదములయందులేదు. (ఇట్టి స్థితిలో నున్నట్టిదే రాజుపాలెం అమ్మగారైన నాగశేషమాంబ) దీనినే నాసదీయ సూక్తము సదసదతీతమనియు, విశ్వకర్మ సూక్తము, విశ్వకర్మ అనియు, పురుష సూక్తము పురుషుడనియు, ఉపనిషత్తులు శాంత శివాద్వైత స్వరూపమనియు, విష్ణువనియు పేర్కొన్నవి. ఈ నాల్గవ పాదము; లేక చతుర్థస్థితి త్ర్యంబకాతీతమైనట్టిది. ఆ మూడు అంబకములను తనలో అంతర్భుక్తము చేసికొన్నట్టిది. అవసరమైనప్పుడు ఆవిష్కరింప కలిగినట్టిది. ఈ మూడు పాదములను, ఈ త్రికములను అర్థము చేసికొన్న పిదపకాని, నాల్గవ దానిని అర్థము చేసికొని తన్మయులు కాలేరు!

త్ర్యంబక మంత్రములో ఇంతటి భావమున్నదా అని పాఠకు లనవచ్చును. లేకేమి? విశ్వమంతయు దానిలోనే ఉన్నది. తదారాధనచేసి, దానిని దాటిననేకాని అమృతత్వము కలుగదు. ఇది అంతయు తపస్సాధన చేతను, అనుభూతి చేతను మాత్రమే తెలియబడునట్టి తత్త్వము.

సత్యమాలోచించిన భగవంతుడు, "విశ్వతశ్చక్షువు" అంతటను కన్నులు కలవాడు. అందటి కన్నులును ఆయనవే అని విశ్వకర్మ సూక్తమును, సహస్రాక్షుడని పురుష

ఉన్నాము. కొబ్బరికాయకు కూడా మూడు కన్నులుండును కనుక దానిని త్ర్యంబక ఫలమన వచ్చును. దానిని తెలుగునకు మార్చినచో ముక్కంటి కాయ, ముక్కంటి పండు అని చెప్పవచ్చును గదా, మూడు కన్నులు గల ఈ కాయ త్ర్యంబకుడైన పరమేశ్వరునికి ప్రతినిధియా అన్నట్లు లేదా! ఆకారమునుబట్టియేగాక గుణమునుబట్టికూడా కొబ్బరికాయ ఓషధులలోనెల్ల శ్రేష్ఠమై ఒప్పుచున్నది. కొబ్బరిచెట్టుయొక్క అన్ని భాగములు మనకు ఉపయోగించునట్టివే. ఇక కొబ్బరికాయ యొక్క ప్రయోజనములు ఇన్ని, అన్ని, అని చెప్పజాలము కొబ్బరి సంపూర్ణమైన ఆహారమనియు, దానిలో జీవాణువులన్నియు కలవనియు, అది ఆహారముగా ఆకలిని పోకార్చుననియు వైద్యశాస్త్రము చెప్పుచున్నది. కొబ్బరిని తినుటచేత మనకు సమస్తమైన పుష్టితుష్టులును చేకూరుచున్నవి. దీనినిబట్టి త్ర్యంబక మంత్రములో చెప్పిన "సుగంధిం పుష్టివర్ధనం" అన్నమాటలు సార్థకమగుచున్నవి గదా!

ఇక కొబ్బరినీళ్ళశక్తి ఇంతింత అనరానిది. కొబ్బరి నీటిని రోగులకు వాడుచుందురు. భగవద్భక్తులు తీర్థముగా ఉపయోగించుచుందురు. ముక్కంటి (శివుడు) గంగమ్మను తాల్చినాడని మన పురాణములు వాకొనుచున్నవి. అట్టి గంగాధరుడైన శివుని మనము చూడలేదుగాని, ముక్కంటి

స్వప్న, సుషుప్తులనెడి మూడు దశలలోను భగవచ్చింతనను మఱువవలదనీ, స్థూల, సూక్ష్మ, కారణ దేహములను భగవ దర్పితము చేసి లోకమును సేవింపు మనియు దేవునికి కొబ్బరికాయ కొట్టుట అనెడి క్రియ మనకు సూచించుచున్నది. కావుననే దీనిని భగవన్మయమని తెలుపుటకు త్ర్యంబక ఫలము, ముక్కంటికాయ అనెడి నామములు దీనికి కలిగిన వనుచున్నాము.

కొబ్బరిలో అమృతరసము కూడా ఉన్నది. కొబ్బరిని నమలుటచేత మన జిహ్వాకందెడి అమృతరసమదియే. ఆ రసము సాక్షాత్తు శివ స్వరూపమే. అదియే రక్త మాంసాదిమయ శరీర రూపముగా పరిణమించుచున్నది. కావుననే భగవంతుని రస స్వరూపుడన్నారు. (రసో వై సః) ఆ రసమును తనలో నిముడ్చుకొన్న కొబ్బరి సాక్షాత్తు శక్తి స్వరూపము, దేవీ స్వరూపము; మాయా స్వరూప మును. మాయ, అనగా ప్రకృతి తనలో పరమాత్మను ఇముడ్చుకొన్నట్లు, కొబ్బరియనెడి భవానీదేవి తనలో రస స్వరూపుడైన పరమేశ్వరుని, పాలు తనలో నేతినివలె ఇముడ్చుకొన్నది. అందుకే వారిరువురు అర్ధనారీశ్వరులైనారు. జగదీశ్వరులైన పార్వతీ పరమేశ్వరులను అర్చించుటచేత కలిగెడు ఫలములన్నియు లౌకికమయిన కొబ్బరికాయను సేవించుటచేత మనకు చేకూరుచున్నవి. దేవునికి కొబ్బరి కాయ నర్పించుట మూలమున బాహ్యముగను, ఆంతరిక

ముగను ఇన్ని రహస్యములను సాధకు తెలుంగవలసి యున్నారు. అందుకే "త్ర్యంబకం యజామహే" అన్న మంత్రము పారమార్థికముగా భగవదర్చనను, దైహికముగా కొబ్బరికాయ సేవను మనకు బోధించుచున్నది. కొబ్బరి కాయ చాలకాలము చెడకుండ నిలువగలదు. తక్కినకాయ లేవియు అంతకాలము నిలువలేవు, అను విషయమునుకూడ మనము గుర్తుంచుకొనవలెను.

ముక్కంటికాయ అనగా తాటికాయ అనికూడ ఎన్నవచ్చును. కొబ్బరికాయకు మూడు కన్నులుండగా, తాటికాయలో మూడు ముంజెలు తావుచేసికొన్నవి. తాటి ముంజెల ఆహారముకూడా ఆకలిని తీర్చి తుష్టిపుష్టులను కలుగచేయును. కొబ్బరిచెట్టువలె తాటి చెట్టులోని భాగము లన్నియు మానవ జీవితమునకు ఉపయోగించునట్టివే. కనుక నే ఈ రెంటిని భూలోకపు కల్ప వృక్షములని మనవారు చెప్పు చుందురు. అయిన, ఇట నొక విశేషము గమనింపవలసి యున్నది. కొబ్బరికాయ సత్వగుణ ప్రధానముకాగా, తాటి కాయ రజస్తమో గుణములను పెంచునట్టిదై యున్నది. కనుక నే కొబ్బరికాయ భగవంతునికి నివేదించుటకు యోగ్య మైనదిగా పెద్దలు నిర్ణయించినారు. శిష్ట కుటుంబములవారు తాటిముంజెలను నేటికినీ తినకుండుట మనమెఱుంగుదుము. దీనినిబట్టి కూడా తాటికాయ గుణహీనత మన కెఱుక పడుచున్నది.

సత్వ గుణమును పెంపొందించు కొబ్బరిలో ఇంతటి ప్రభావముండుటవలననే, భగవన్నివేదితమైన ప్రసాదముగా ఒకచిన్ని కొబ్బరిముక్కనైనను అమృతతుల్యముగా ఆరగింపవలెననియు, అందలి నీటిని, అమృత తీర్థముగ ఒక ఉద్ధరిణె (చెంచా) డైనను పుచ్చుకొనవలెననియు మనవారు కట్టడచేసినారు. కొబ్బరిని పాలుత్రాగెడిశిశువులు తినలేరు. కొబ్బరినీటి (తీర్థము) నైనచో వారు తేలికగాను, రుచిగాను, త్రాగగలరు. కనుక కన్నులు తెరవని శిశువులకుగూడ ఈ తీర్థము సేవింపదగిన అమృతమగుచున్నది. ఇట్టిరహస్యములనేకములు మన వేదములయందు ఆలోచించిననేకాని అంతుపట్టనివి దాగియున్నవి.

త్ర్యంబకమంత్రముతో కొబ్బరికాయనీటిని, విభూతిని, 108సార్లుజపించి, విభూతిని ఆతీర్థములోకలిపి రోగులకిచ్చినచో వారిరోగములు నివృత్తిఅగుటయు, నొప్పులుపడెడు గర్భవతులు, శీఘ్రముగ సుఖప్రసవమగుటయు పలువురు మంత్రోపాసకుల అనుభవములో ఉన్నట్టిదే. అయినను ఈ ఘట్టమున మంత్రశక్తికంటెను మాంత్రికునియొక్క మనశ్శక్తి, ఆత్మశక్తి (will power) ఎక్కువగా పనిచేయవలసియున్నది.

ఈ విధముగా కొబ్బరికాయలో పరమేశ్వరునికి ప్రతినిధి కాదగినగుణములుఉండు వలననే దీనిని ప్రకృతిలో రూపు దాల్చిన దేవునిగానే ఎంచి యజ్ఞములయందు, వ్రతాది కార్యములయందు దీనిని కలశముమీదస్థాపించి భగవంతు

నికివలెనే షోడశోపచారపూజలు, అష్టోత్తరశత, సహస్ర నామార్చనలు చేయుచున్నారు. ప్రకృతిలోని ఏ పండ్లకును ఇట్టిగౌరవము దక్కలేదుగదా! దేవుడు అగపడని దేహముకలవాడుకాగా (అదృష్టవిగ్రహో దేవః) ఈ ముక్కంటికాయ సాక్షాత్కరించినదేవుడే యనునట్లు మన పూజా, ధ్యానాదులను పొందుచున్నది.

ఇంతకూ తేలినసారాంశము త్ర్యంబకుడనగా, త్రిగుణ ములతోగూడిన రుద్రుడని వేదపురాణాదివాఙ్మయము భావించుచుండగా, వసిష్ఠమహర్షి ఇంకనాలుగు అడుగులు ముందుకువైచి బ్రహ్మ, విష్ణు, రుద్రులకుగూడ తండ్రియైన పరతత్త్వమునుగాను, త్రిలోకస్రష్టగాను, పరమాత్మగాను త్ర్యంబకదేవుని భావించినాడు! ఈ భావనకు మూలము నాసదీయసూక్తములోని సృష్టికి పూర్వపుదైన అనిర్వచనీయ స్థితియే. అనగా సదసదతీతతత్త్వమే అన్నమాట. ఇట్టి పర మోత్కృష్టభావమును మనకందించిన వసిష్ఠుడు వంద నార్హుడు. ఆ తత్త్వమే క్రమపరిణితినంది గుణసంగమువలన బ్రహ్మ, విష్ణు, రుద్రులుగా రూపొంది, విశ్వసృష్టికి హేతు వైనది. ఇట్టితత్త్వమును విశ్వకర్మసూక్తము విశ్వకర్మయని సంస్తుతింపగా, పురుషసూక్తము పురుషుడు. విశ్వకర్మ, త్వష్ట, బ్రహ్మ-మున్నగుపదములచే ప్రస్తుతించినది.

ఈ దేవతలను, వారినామములను అటుంచిచూచి నచో ఈ సృష్టిపరిణామమంతయు వైజ్ఞానికమైన (Scientific)

తత్త్వవిస్తరమేకాని భిన్నముకాదు. మూలతత్త్వము (Sprit) గుణసంయోగమువలన పంచభూత మయముగా వివర్తపరిణామమునుచెంది, ప్రకృతి, వికృతులమూలమున జగత్తుగా రూపుదాల్చినదనుట మనము గ్రహింపవలసిన విషయము. ఈ దృష్టితో చూచినప్పుడు, ఆదర్శవాదమునకును, భౌతిక పరిణామవాదమునకును వివాదముండనక్కఱలేదు. శక్తి పదార్థముగామాఱుట, పదార్థము శక్తిగామాఱుట, శక్తి పదార్థములజంట విశ్వక్రీడనునడపుట-మన ఆలోచనాదృష్టికిని, శాస్త్రమునకును, అనుభవమునకును విరుద్ధమెంతమాత్రమును కాదు. ఇందుకు మనమే దృష్టాంతము. మనలో పాంచభౌతికములైన స్థూల, సూక్ష్మ, కారణదేహములు, వాటిని భరించి, ధరించెడు ఆత్మశక్తియు పడుగుపేకలవలె పెనవేసికొనియే ఉన్నవి. వీటివి విడదీయరాని సంబంధము. అవి విడిపోవునప్పటి అవీడ్పాటు, మనము ఊహించి తెలిసికొనలేనిది దీనినే క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమని భగవద్గీత వాక్రుచ్చినది. ఈ అవినాభావసంబంధము నెఱుంగుటకే తత్త్వశాస్త్రము, సాధకులుప్రయత్నించినారు. ఇప్పుడును ప్రయత్నించుచున్నారు. ఇకముందుకూడ ఈ ప్రయత్నమిట్లు కొనసాగునదేకాని, ఆగిపోవునది కాదు. ఈప్రయత్నములో ఆస్తిక, నాస్తిక, అజ్ఞాతాదిభేదములకు తావేలేదు. ఒకరిదృష్టిని ఇంకొకరనుసరించి అర్థముచేసికొనబూనినచో వారి మార్గము కూడ తమ మార్గములోనిదే కాగలదు.

త్ర్యంబకమంత్రద్రష్ట ఇంతటి విశాలభావములను పరిశీలించి తెలిసికొని తత్త్వానుభూతినిపొందిమఱీ వ్రాసినాడా మంత్రమును. కనుకనే ఆ మంత్రమునకు రుద్రుడు దేవత అనుటతో తృప్తిపడక బ్రహ్మరుద్రాదులకు మూలమయిన పరదేవతఅనుడు, అదిమూలమనుడు - దానిని దర్శించి వచించినాడు. కనుకనే ఆతనికి, ఏదశలో మృత్యుసంయోగము కలుగునో, ఏ స్థితిలోవాడు, దానినుండివిడివడి అమృతత్వము నందుకొనునో మంత్రపుటుత్తరార్థమున నిరూపించి నాడు. మృత్యువునుండి విడివడుదునేకాని, అమృతత్వము నుండి విడివడను, అన్నమాట అతనియొక్క శాశ్వతామృత స్వభావమును ప్రకటించుచున్నది. ఆ పరిపూర్ణామృత తత్త్వమునందు జన్మ, జరా, రోగ, మృత్యువులుకాని, మోద ప్రమోదానందాదులుకాని కొన్నిలీలలుమాత్రమే. వాటిని నెఱపునట్టి - లేదా, దర్శించునట్టి-అనుభవించుచున్నాడను కొనునట్టి తానుమాత్రము శాశ్వతామృతాతీత - అనిర్వచనీయ స్వరూపుడే. ఇన్ని భావములను జీర్ణింపచేసికొన జాలకున్నచో, త్ర్యంబకమంత్రము పరిపూర్ణముగా అర్థమయినట్లు కాదు-.

తాను దృక్కనియు, దృశ్యమనియు చెప్పవీలుకాని దృగ్దృశ్యాతీత, ద్వైతాద్వైతాతీతత అనిర్వచనీయ వస్తువు. అట్టితననుండిముందు ద్రష్టవెలువడగా,ఆవల ఆద్రష్ట సాగిసాగి దృశ్యమంకురించినది. దృగ్దృశ్యము లేర్పడగానే ద్వంద్వమయ ప్రపంచము సిద్ధమయినది. ద్వంద్వసంయోగముచేత

తృతీయమువచ్చి త్రిపుటి సిద్ధమైనది. ఇకనేమి సృష్టి, నానాత్వము కొనసాగినది - అదియే త్ర్యంబకమూర్తి; త్ర్యంబకతత్త్వము.

## విష్ణు మంత్రములు

విష్ణుమంత్ర విశేషములు కొన్ని ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున చెప్పికొనియున్నాము. అట్టివాటిలో ముఖ్యమైనవి విష్ణువు త్రిలోకములను, సప్తలోకములను మెట్టినాడనగా - అనాహత, ఆజ్ఞా, సహస్రారములనుకాని, లేక, మణిపూర, అనాహత, ఆజ్ఞలనుకాని మెట్టినాడనియు, అట్లే సప్తలోకములను మెట్టినాడనగా, ఆధారమునుండి, సహస్రారమువఱకుగల, సప్త చక్రములను మెట్టుటయనియు, అదియే కుండలినీ శక్తిమేల్కాంచి స్వాధిష్ఠానాదులను భేదించుకొనుచూ సహస్రారమునకు చేరుటఅనియు చెప్పికొన్నాము. ఇప్పుడు మఱికొన్ని రహస్యములను పరిశీలింతేము.

విష్ణువు త్రిలోకములనుకాని, సప్తలోకములనుకాని ఆక్రమించుటకు ఆయనకంటెనుముందే ఆలోకములు సృష్టింపబడియుండవలెనుగదా. ఆ లోక సృష్టికర్తయే విశ్వకర్మ. ఆ విశ్వకర్మ ద్యావాభూములను సృష్టించిన సృష్టికర్త. ఈ అంశమునే విశ్వకర్మ సూక్తము "ద్యావా

భూమిూ జనయన్ దేవ ఏకః" అని చెప్పినది. ఈ ద్యావా భూముల నడుమ అంతరిక్షముగూడ కలదు. అందుకే ఉపనిషత్తు "పృథి వ్యంతరిక్షం ద్యౌ ర్దిశోఽ వా న్తరదిశాః, అగ్ని ర్వాయురాదిత్యశ్చంద్రమా నక్షత్రాణ్యాప ఓషధయో వనస్పతయ ఆకాశ ఆత్మా" అన్నది. వీటిలో సప్తలోకములే కాదు. చతుర్దశభువన భాండములును ఉన్నవి. ఈ భువనములతో పాటే విశ్వకర్మ - బ్రహ్మ, విష్ణు, రుద్రాదుల సంపజేని సృష్టిచేసినాడు. ఆవల జరిగినట్టిదే విష్ణు దేవుని త్రిలోకాక్రమణముకాని, సప్తలోకాక్రమణము కాని.

అంతేకాదు సహస్రారకమలస్థిత పరమాత్మయే విశ్వకర్మ. ఆ దేవుడు శిరస్సునుండి ఆధారమువఱకు గల సప్త చక్ర (లోక)ములను సృష్టించి తానే ఆధారమున కుండలినీ స్వరూపుడై వెలసినాడు. ఆ కుండలినీ శక్తియే జీవాత్మ స్వరూప విష్ణువు. ఆ జీవాత్మరూప కుండలిని (విష్ణువు) స్వాధిష్ఠానాదుల మీాదుగా సహస్రారమునకుచేరి సహస్రారస్థ విశ్వ కర్మ పరమాత్మతో ఐక్యమగుటయే యోగుల గమ్యమైన సంసిద్ధి. ఇట్టి రహస్యముల నెన్నింటినో మనము ఋగ్వేదతత్త్వ మననము ద్వారా నెఱుంగవలసి యున్నది. ఇక విష్ణు మంత్రమును చూతము.

"ఇదం విష్ణు ర్విచక్రమే
త్రేధా నిదధే పదమ్
సమూాఢ మస్య పాంసురే." ఋ 1-22 17

విష్ణువు మూడు లోకములను మూడడుగులచే ఆక్రమించినాడనగా, స్వాధిష్ఠానాదులను ఆక్రమించినాడనియే కాక, జగత్కారణ పరమాత్మ - స్థూల, సూక్ష్మ, కారణ దేహములను ఆక్రమించి, జీవాత్ముడైనాడని కూడ ఇచ్చట భావింపవలసియున్నది. జీవాత్మ తాల్చిన శరీరములు త్రిగుణమయములైన ఈ త్రిదేహములే. ఆ దేహములలో ముందు కారణ దేహమును దాల్చి, ఆవల సూక్ష్మ స్థూల దేహములను తాల్చినాడనుట రహస్యము. కారణము అవిద్యా శరీరము. సూక్ష్మమేమో- సత్వ రజో గుణములతో ఏర్పడిన జ్ఞాన కర్మేంద్రియ పంచప్రాణ స్వరూపమైనట్టిది. ఇక స్థూల శరీరము పంచీకృత తమోమయ పంచ భూతములతో ఏర్పడినట్టిది. అందుచేతనే అది స్థూలముగానే గోచరించుచున్నది. స్థూలము కనుకనే, స్థూల జగము నందే తిరుగాడుచు సుఖదుఃఖాది ద్వంద్వములను అనుభవించుచు, కర్మలను చేయగలుగుచున్నది. కావుననే దీనిని భోగమున కేర్పడిన శరీరమనియు, స్థూల జగమును భోగ్య జగమనియు అనుచున్నాము. మంత్రము కూడా "సమూఢ మస్యపాంసురే" అని పృథ్వీమయ దేహమునందే భోగానుభవము అని వక్కాణించినది. కనుక ఈ స్థూలాది శరీర త్రయమును అధిష్ఠించినవాడు భగవంతుడే కాని, ఇంకేదియును కాదు. కాగా "దేవుడే ఈ పాడు ఘటమున పడి జీవుడైనా" డన్నమాట. విశ్వకర్మ సూక్తము "స ఆశిషా

ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛదవరా ఆ వివేశ” అని పర మాత్మయే శరీరమున జీవుడై ప్రవేశించినాడని చెప్పగా, ఈ మంత్రము “త్రేధా నిదధే పదమ్” త్రిశరీరములను విష్ణువే అధిష్ఠించినాడను చున్నది. ఈ రెండు మంత్రములును అద్వైత తత్త్వమును నిర్బాధముగా బోధించుచు విష్ణువిశ్వ కర్మల ఐక్యమునుగూడ చాటుచున్నవి. స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల నధిష్ఠించిన జీవుడు వరుసగా విశ్వుడనియు, తైజసుడనియు, ప్రాజ్ఞుడనియు చెప్పబడుచున్నాడు. కాన ఈ మూడు నామములుకల జీవుడు దేవుడేకాని, భిన్నుడు కాడు. కాగా సమస్త జీవారాధన - సేవ, భగవత్సేవయే అగు చున్నది కూడ.

ఈ మూడు శరీరములను విశ్వకర్మ సూక్తము “యా తే ధామాని పరమాణి, యావమా, యామధ్యమా విశ్వకర్మన్నుతేమా” అన్నది. అనగా- దేవ, మానవ, తిర్య గాది శరీరములని ఇదివరకుభావించినాము. అంతేకాక ఇప్పుడు పరమధామమనగా కారణదేహమనియు, మధ్యమ మనగా సూక్ష్మ దేహమనియు, అవమమనగాస్థూల దేహమనియుచెప్పి కొని సాక్షాత్పరమాత్మయేజీవాత్మ అయినట్లు చెప్పుకొనవలసి యున్నది.అట్టిజీవునిమఱల దేవునిగా రూపొందించుకొనుట యే ప్రతి జీవికి కర్తవ్యము. ఈ స్థితిని మనుజులకు చేకూర్చుట కే వేదముప్రవర్తించునది. ఇప్పుడుఇంకొక మంత్రమునుచూతము.

"అతో దేవా అవన్తు నః,
యతో విష్ణు ర్విచక్రమే-
పృథివ్యా స్సప్త ధామభిః." ఋ 1-22.16

ఈ మంత్రమున కిదివఱకు "పృథివ్యా స్సప్త ధామభిః" అనగా పృథివీ శబ్దముచే నెఱుంగదగిన ఆధారము నుండి సహస్రారమువఱకు గల సప్తచక్రములని భావనచేసి, వాటికి సప్తలోకములని కూడా అర్థము చెప్పికొని ఆధ్యాత్మిక సిద్ధి నందినాము. సప్తధామములనగా శరీరమునందు గల-1. చర్మ, 2. రక్త, 3. మాంస, 4. మేదః 5. అస్థి, 6. మజ్జా 7. శుక్రములనెడి సప్తధాతువులని కూడా భావింపవలసి యున్నది. స్థూల శరీరము ఈ చర్మరక్తాదుల సమ్మేళనముగా ఏర్పడిన పిండమే. ఆ పిండము మట్టినుండి కలిగిన ఓషధుల రసముయొక్క పరిణామముగా ఏర్పడినట్టిదే. అట్టి స్థూల దేహము నాశ్రయించియే జీవుడు కర్మలనొనర్చుచు, సుఖ దుఃఖాదుల ననుభవించుచున్నాడు. కాబట్టి విష్ణువు అనగా జీవభిన్నుడేమీ కాదు. ఆ విష్ణువే శరీరమును సృష్టించి అందు వ్యక్తమై జీవనామమును తాల్చి, తన సర్వజ్ఞత్వాది గుణములను పోగొట్టుకొని కించిజ్ఞత్వాదులను స్వీకరించి మందప్రకాశుడై దేహమునందును, వెలుపలి పదార్థముల యందును అహంకారమును మమకారమును కలిగి బంధింప బడినవానివలె సంచరించుచున్నాడు. అనగా సంసారమున చావుపుట్టుకలకు గుఱియగుచున్నాడన్న మాట. అట్టివానికి

తన స్థూల దేహము, దానితోపాటుగల సూక్ష్మ, కారణ దేహములు తానుకాదని ఏనాడు తెలియునో, ఆనాడే అతడు సాధన ద్వారా వాటినుండి ముక్తుడై అమృతుడు కాగలడు. ఇట్టి ముక్తికోసమై బుద్ధిమంతుడైన ప్రతి మానవుడును ఆలోచింపవలసియున్నది. ఎదురుచూడవలసియున్నది. అట్టివారినే సూరులని (పండితులని) దిగువ మంత్రము పలికినది "తద్విష్ణోః పరమం పదం, సదాపశ్యన్తి సూరయః." విష్ణు మంత్రములయందలి ముల్లోకములకు మూడు దేహములనియు, సప్త లోకములకు సప్తధాతుమయ స్థూలదేహమనియు అర్థము చెప్పికొన్నందువలన సాధకుడు తాను మోక్షార్థము యత్నించుటకును, తాను సాక్షాత్తు పరమాత్మాభిన్నుడే అని అమృతసిద్ధి నొందుటకును వీలుకలుగుచున్నది. అటుతరువాత కుండలినీ శక్తి, అది ఆధారాదుల మీదుగా సహస్రార ప్రయాణము చేయుట అనునర్థములు సాధన విధానమునకు సంబంధించి మనలను విష్ణుపదమునకు చేర్చగలవు.

దీనినిబట్టి త్రివిక్రముడన్నచో మూడు దేహముల యందు ప్రవేశించిన జీవుడనియు, ఉరుక్రముడన్నచో సప్త ధాతువులతోకూడిన స్థూలదేహమున జీవభావమున మెలగుచున్నవాడనియు తెలియవలెను. అట్టిపిండాండమునందలి జీవరూపవిష్ణువు బ్రహ్మాండాధికారియైన మహావిష్ణువును తెలిసికొని, ఆతనిపదమును మెట్టిననాడు అమృతుడు కాగల

డన్నమాట. ఈ విషయమునే "ఉరుక్రమస్య స హి బంధు రిత్థాభవతి". అట్టివాడు భగవంతునికి చుట్టముకాగలడని మంత్రము పలికినది. తత్త్వమిట్టిది కాగా, అజ్ఞులైన మానవులు ఇట్టితత్త్వము నెఱుంగకున్నారని (న తం విదాథ) విశ్వకర్మ సూక్త మనగా, ఈసూక్తమునందలి 19వ మంత్రమే మో "విష్ణోః కర్మాణి పశ్యత" అని విష్ణుదేవునియొక్క సృష్ట్యాది కర్మలను, ఆతడు జీవుడై మెలగెడి రీతులనుచూడుడని-అనగా అర్థముచేసికొనుడని అన్నది. ఇందుచేత విష్ణువు కర్మరహితుడు కాడనియు, విశ్వకర్మవలెనే ఆయనయు సర్వకర్మలను చేసెడి భగవంతుడే అనియు తెలియుచున్నది. ఇది విష్ణువిశ్వకర్మ దైవతముల సామ్యమునకు, అభేదమునకు నిదర్శనము. ఇంకొక విష్ణుమంత్రముసైతము విష్ణువునకు విశ్వకర్మతో సామ్యమును వక్కాణించుచున్నది.

"ఆయో వివాయ సచథాయ దైవ్య
ఇంద్రాయ విష్ణుః సుకృతే సుకృత్తరః,
వేధా అజిన్వ త్రిషధస్థ ఆర్య
మృతస్య భాగే యజమాన మాభజత్".

ఋ. **1-156-5.**

ఈ మంత్రమునగల సుకృత్తరః, అనెడిమాట విష్ణుదేవునకు విశేషణము. సుకృత్ = అనగా సృష్ట్యాదులైన మంచి కర్మలనొనర్చు వాడని భావము. అట్టివారిలో సుకృత్తరుడనగా గొప్ప సృష్టికర్తఅని తేలుచున్నది. కావున విశ్వకర్మ పద

ముతో సుకృత్తర పదముకూడ తుల్యమైవారి అభేదమును చాటుచున్నది. ఇందే ఇంద్రుడుకూడ విశ్వకర్మతుల్యుడే అని "సుకృతే" అనెడిమాట చెప్పుచున్నది. ఇంకొకమాట "త్రిషధస్థః" అనియున్నది. దానికి "త్రిసంఖ్యోపేత సహస్థానవాన్"అనిసాయణులు వ్రాసినారు. ఈత్రిస్థాన స్థితుడు విష్ణువు కాన, ఆతడు "త్రీణి పదా విచక్రమే" అన్నట్లు త్రిస్థానవ్యాపి. విశ్వకర్మకుకూడ పరమ, మధ్య, మావమ ధామములు మూడున్నవని"యా తే ధామాని పరమాణి"అన్నమంత్రము చెప్పు చున్నదికదా. కాన విష్ణువిశ్వకర్మల అభేదమున కిట్టివన్నియు నిదర్శనములే. యోగపక్షమున ఈత్రిధామము లను ఇడా, పింగళా, సుషుమ్నా నాళములని తెలియగలము.

త్ర్యంబక మంత్రములోని 'త్రి'శబ్దమునకు అనేకములైన త్రికములను భావించి ఆధ్యాత్మికార్థ సిద్ధిని పొందినట్లు ఇక్కడి త్రివిక్రమశబ్దమునకుకూడ ఆ అర్థములన్నింటిని వీలైనంతవఱకు అనుసరింపవచ్చును. మూడు స్థానములను, భావములను, మెట్టుట అనగా వెలిగించుట, వాటికి అధిపతి యగుట అనియే అర్థము - ఇంకొక మంత్రమును చూతము.

"యస్య త్రీ పూర్ణ మధునా సదా
న్యక్షీయమాణా స్వధయా మదంతి,
య ఉ త్రిధాతు పృథివీ ముత ద్యా
మేకో దాధార భువనాని విశ్వా." ఋ 1-154.4

ఇందు ఒక్కదేవుడే త్రిధాతువులతో కూడిన ద్యావాపృథువులను ధరించి సమస్త భువనములను ఏలుచున్నాడనుట చేత విష్ణువునకు, విశ్వకర్మకు గల సామ్యము, కార్యతుల్యత, ఏకత్వము స్పష్టమగుచున్నవి. విశ్వకర్మ సూక్తముగూడ "ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః, ద్యావాపృథివీ అప్రథేతామ్" అని ఆ విశ్వకర్మ ఒక్కడే భూస్వర్గములను సృష్టించి వ్యాపించినాడని అన్నదికదా! ఇక్కడ భూస్వర్గ శబ్దములచేత ఆధారాది సహస్రారపర్యంతముగల శరీర సృష్టి వ్యక్తమగుచున్నది. ఇట్టిమంత్రములు ఆ యా దేవతలకుగల ఏకకార్యత్వమును తెలుపుచుండుట లేదా!

"భువనస్య పితరమ్ గీర్భి రాభీ
రుద్రం దివా వర్ధయా రుద్ర మక్తమ్". ఋ-6-49-10

ఈ మంత్రము జగములతండ్రియైన రుద్రుని రేలు, పవళ్ళనెడి భేదములేక ఎల్లప్పుడు స్తుతింపుడనిచెప్పుచున్నది. అనగా రాత్రింబవళ్ళనిమాత్రమే అర్థముకాదు. గాలిని లోనికి పీల్చుట పగటివంటిది. దానిని వెలుపలికి విడుచుట రాత్రి వంటిది. ఈ రెంటి మధ్యకాలము సంధ్యలవంటిది. కాగా లోపలికి గాలిని పీల్చుట పూరకము, దానిని వెలుపలికి విడుచుట రేచకము, లోపలనే నిలుపుట కుంభకము- అని మన మెఱింగియే ఉన్నాము. అనగా ప్రాణవాయువును, పీల్చినను విడచినను, స్తంభించినను, ఆమూడు సమయములయందు

భగవంతునే ధ్యానించుచుండుమనుట మంత్రములోని రహస్యము. అందుకే యోగులు ప్రణవముయొక్క అకార, ఉకార, మకారములుమూటిని పూరక, కుంభక, రేచకము లందు అనుసంధించుచుభగవదారాధన, లేక పరమాత్మాను సంధానము చేయుచుందురు. ఇట్టిసందర్భమున విష్ణు, రుద్ర, త్ర్యంబక, ప్రజాపత్యాది శబ్దములకు పురాణాదులు వచించు కథార్థములను చెప్పుకొనుటకంటెను, జగత్కారణ పరమాత్మ రూప మూలపదార్థము అనెడిఅర్థమును చెప్పుకొన్నచో సాధకులకు ముక్తిమార్గము సులభముకాగలదు.

## ఇంద్ర విష్ణువులు జీవేశ్వర రూపులు



వేదద్రష్టలైన మహనీయులలో పరమేష్ఠి, భౌవన విశ్వకర్మ, ప్రజాపతి, త్వష్ట, విశ్వరూపుడు, నారాయణుడు, వసిష్ఠ, వామదేవ, విశ్వామిత్రాదులు, వారిపుత్రులైన మధుచ్ఛంద, శక్తి, పరాశరాదులుగూడ కలరు. వీరిలో పరమేష్ఠి, విశ్వకర్మ, నారాయణ, ప్రజాపత్యాదులు సృష్టికారుల వర్గమునకు చెందిన మహాదేవతలు. ఇక వసిష్ఠ, విశ్వామిత్రాదులు యోగమును పండించుకొన్న మహనీయులేకాని, సామాన్య ఋషిమాత్రులుకారు. వీరెల్లరు కుండలినీ, అష్టాంగ, హఠ, రాజయోగాదులను కడముట్ట అభ్యసించి, అలౌకిక దివ్యశక్తులను ఆర్జించుకొన్నవారే. వీరు మర్మ

(రహస్య -Mistakes) యోగమునుకూడ ఎఱింగినవారనివారి మంత్రములలోని అంతర్గతసాక్ష్యములు వక్కాణించును. ఈ విషయమునే విష్ణు, సూర్యాది మంత్రములలో కుండలినీ యోగము సూచింపబడినదని, మదీయ ఋగ్వేదదిగ్దర్శనము లందు తెలుపుటయైనది. అట్లే ఎన్నెన్నో సృష్టిరహస్యములు వేదమంత్రములలోను, వైదికదేవతల నామములలోను దాగి యున్నవనియు, అవి వ్యంగ్యరీత్యా తత్త్వమును సూచించు చున్నవనియు మనము గ్రహించుటకు ప్రబలతర ఆధార ములు లేకపోలేదు. బ్రహ్మాండమంతయు పిండాండములోనే ఇమిడీయున్నట్లు తపోనిశితమగుదృష్టికిని, అనుభవమునకును, తోచగలదు. ఉదాహరణకు బ్రహ్మాండపాలకులుగ మన సంస్కృతవాఙ్మయమునను, వేదములలోను వర్ణింపబడిన ఇంద్రుడును, విష్ణుదేవుడును జీవేశ్వరులకు ప్రతీకలేకాక, జీవేశ్వర స్వరూపులనియే మనము అర్థముచేసికొని నడచు కొనవలసియున్నది.

ఇంద్రుడు స్వర్గాధిపతి, త్రిభువనాధిపతి అని కూడా వర్ణనలమూలమున మనము వినుచున్నాము. ఇతడు జీవాత్మకు ప్రతీకయే. జీవాత్మ శకి కేంద్రియ ప్రాణములకు అధిపతి అయినట్లు మనమెఱుంగుదుము అతడు సత్వగుణము కొలదిగాగల రజోగుణము ప్రధానముగా కలవాడు. కనుకనే ప్రపంచాధిపత్యము, భోగములు కావలెననియు, తన ఐశ్వర్యమును పెంపుచేసికొనవలెననియు, ఎల్లప్పుడు

చూచుచుండును. ఆ కోరికలను తీర్చుకొనుటలో అతడు ఒకానొకప్పుడు ప్రమాదములకు లోనగుటకూడా మన మెఱుంగనిది కాదు. ఇక అట్టి జీవుని సర్వదా రక్షించుచు ఆతని కోరికలను తీర్చుచుండువాడే ఆతనికి మిత్రునివంటి వాడైన విష్ణువు. కనుకనే మన పురాణ వాఙ్మయమునందు విష్ణువు ఇంద్రునికి రక్షకుడుగాను, సోదరుడుగాను కూడా వర్ణింపబడినాడు. ఈ విషయమును వేదమంత్రములందే కాంచగలము. ఋగ్వేద మంత్ర మొకటి ఇంద్ర, విష్ణువుల మైత్రిని ఇట్లు వర్ణించినది.

"విష్ణోః కర్మాణి పశ్యత
యతో వ్రతాని పస్పశే
ఇంద్రస్య యుజ్యః సఖా." ఋ 1-22.19

ఎవరికిగాని అణంపనలవికాని వాడును, సర్వజగత్తులకు రక్షకుడునగు విష్ణుని విశ్వ సృష్ట్యాది కర్మలను పరికింపుడు. ఇంద్ర సఖుడైన ఆతనిదయవలననే సమస్త కార్యములు నెఱవేఱుచున్నవి. ఈ మంత్రమునందలి "ఇంద్రస్య యుజ్యః సఖా" అనెడి వాక్యము గమనింపదగినది. అది ఇంద్ర విష్ణువుల యొక్క ఏకోదరత్వమును, సఖ్యమును వక్కాణించు చున్నదిగదా! వీరు ఇట్లు జీవేశ్వర రూపులే అనెడి విషయమును మోక్ష సూక్తములోని ఇంకొక ఋక్కు ఇట్లు స్పష్టము చేయుచున్నది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్న న్నన్యో అభిచాకశీతి." ఋ 1-164-20

ఈ మంత్రము సంసార వృక్షము పైనున్న పక్షిద్వయము నుగా జీవేశ్వరులను వర్ణించుచున్నది. సమానయోగము, గమనము, మైత్రిగల రెండు పక్షులు ఒక చెట్టుపై ఉన్నవి. అందొకటి ఆ చెట్టు పండ్లను తినుచున్నది. ఇంకొకటేమో ఏమీ తినకుండా సాక్షి మాత్రముగా వెలుగుచున్నది. ఇందు పండ్లను తినుపక్షియే జీవుడు. అతడు తన కర్మ ఫలములను అనుభవించుచుండగా, రెండవవాడైన ఈశ్వరుడు ఏమీ తినకుండగనే సాక్షిమాత్రుడై తినుచున్న పక్షిని పరికించు చున్నాడన్నమాట. ఇంద్ర విష్ణువులు, ఈ మంత్రమున వర్ణింపబడిన జీవేశ్వరులకు ప్రతీకలే, వారి స్వరూపము కలవారే. "ఇంద్రస్య యుజ్యః సఖా" అని విష్ణుమంత్రము లందుండగా (1-22-19) "సయుజా సఖాయా" అని జీవే శ్వర మంత్రములో ఉన్నది. ఇదియే ఆ ఉభయులు జీవే శ్వరులనుటకు గట్టి నిదర్శనము. "సయుజా" అన్నను 'యుజ్యః' అన్నను ఒకటే అర్థము. ఇక సఖాశబ్దము రెండు మంత్రములలోను కలదు. వేద పురుషుడు ఇట్టి రహస్యములను మిక్కిలి మెలకువగా పదముల సాదృశ్య ముతో సూచించుచుండును. "విష్ణోః కర్మాణి పశ్యత

అన్నప్పుడు కూడా విష్ణువుయొక్క కర్మలనుటచేత లౌకిక, వైదిక కర్మలనియేకాక, సృష్ట్యాది కర్మలు అనికూడా చెప్పుకొనవలయును. ఇట్లు చెప్పికొన్నందున, ఆ కర్మలు చేయు విష్ణునకును, అవే కర్మలు చేయుచు బొందిలో ప్రవేశించిన (ప్రథమ ఛ్ఛదవరా ఆవివేశ) విశ్వకర్మకును అభేదమని సూక్ష్మముగా గ్రహింపవలసియున్నది.

ఇంకను ఇంద్ర విష్ణువు లిద్దరును, ద్వాదశాదిత్యులలోనివారే. అనగా, ఒకేఒక జగన్మాత (అదితి - పరమాత్మ) నుండి కలిగినవారే. ఆమెను అదితి అని ఒక మంత్రమనగా, విశ్వకర్మయని ఇంకొక యజుర్వేద మంత్రమన్నది. వసురుద్రాదిత్యులు విశ్వకర్మ (పరమాత్మ) నుండి జన్మించినారని యజుర్వేదదర్శనములో మనము చదివియే ఉన్నాము. కనుక జీవేశ్వర రూపులైన ఇంద్ర విష్ణువులు ఏకమేకాని భిన్నులు కారని తెలియవలసి ఉన్నది. ఇచ్చట ద్వైత, విశిష్టాద్వైత పరముగాకూడ ఈ జీవేశ్వరాద్వైతమును, అన్వయించుకొనవచ్చును. గ్రంథకర్త దృష్టిని బట్టి విష్ణు విశ్వకర్మలు, భిన్నులుకారు. కాగా" స్థితిస్య గతి శ్చింతనీయా" అన్నట్లు ఉన్న వేద వాక్యములకు సమన్వయమును సంపాదించుటయే గ్రంథకర్త ఆశయము.

ఇంద్రుడు భువనాధిపతి అయినట్లు జీవుడు శరీరేంద్రియమనః ప్రాణాదియుక్త క్షేత్రమునకు, లేదా, త్రికరణములకు అధిపతియనియు, అట్టి జీవుని ఉద్ధరించువాడు విష్ణు స్వరూప

ఈశ్వరుడనియు సమన్వయము. ఇంద్రునివలెనే జీవుడు కూడా భోగప్రియుడు. తన స్త్రీధనాదులతో తృప్తిపడక ఇతరుల సంపత్తిని సర్వదా కోరుచుండును. వాటిని సంపాదించుటలో ఎన్నెన్నో కష్టనష్టములకు, అవమానములకు, ఆపదలకు, గుఱియగుచుండును. వాటినుండి తప్పించుకొనలేక గిజగిజలాడుచు భగవంతుని రక్షించుమని వేడుచుండును. అంతియేకాక కామక్రోధాది పీడితుడై పరద్వేషము, పరావమానము వంటి కార్యములకు పూని తగవులు తెచ్చి పెట్టుకొనుచుండును. ఎంత చేకూరినను చాలదని వగచుచు, ప్రపంచసంపదను పెంచుకొననే చూచుచుండువాడు జీవుడు కదా! ఇట్టివానికి ఇంద్రునితో పోలిక సమంజసమే కాదా. జీవుని ఆపత్సమయములందు అతనిని ఆదుకొని, కామోపశాంతిచేసి దరిచేర్చువాడు. సహస్రారవాసియైన ఒక్క పరమేశ్వరుడే. కావుననే వారిరువురి మైత్రిని, భేదరాహిత్యమును వేద మంత్రములు "ఇంద్రస్య యజ్యః సఖా" "సయుజా సఖాయా" అనెడి వాక్యములచేత సత్యసమ్మతముగా సూచించినవి. ఇంకొక విష్ణు మంత్రము "ఉరుక్రమస్య స హి బంధురిత్థా" అని అట్టి పరమేశ్వరానుగ్రహము పొందిన జీవుడు ఆ పరమేశ్వరునికి బంధువే, పుత్రుడే, సాక్షాత్తు అతడే కాగలడని అద్వైతస్థితిని బోధించినది. సూక్ష్మముగా పరిశీలించినచో ఋగ్వేద మంత్రములలో ఇట్టి రహస్యములెన్నియో మనకు పొడకట్టగలవు

## మిత్రావరుణులు

ఇంద్ర విష్ణువులు జీవేశ్వర స్వరూపులయినట్లే మిత్రావరుణులనెడి దేవతల జంట కూడ ప్రాణాపానరూపులని యజుర్వేద మంత్రము వచించుచున్నది-

"ప్రాణో వై మిత్రో, అపానో వరుణః"

తై. సం. 5 కాండం. 3 ప్రశ్న. 17 మంత్రం.

మిత్రావరుణులు వరుసగా పగటికిని, రాత్రికిని అధిపతులని వేద సంప్రదాయము. వారు సాక్షాత్తు ప్రాణవాయువును, అపానవాయువును అని చెప్పు యజుర్వాక్యము, మనకొక కర్తవ్యమును బోధించు చున్నది. ప్రాణాపానములను ఆశ్రయించియే శరీరమున జీవుడు నెలకొనియుండును. అవి దేహమును వీడిన, వాటితోపాటు జీవుడును లేచిపోవును. కాన ఆ ప్రాణాపానములను ప్రాణాయామాది యోగము ద్వారా రక్షించుకొనుమని వేద బోధ అందులకే ఒక శాంతిమంత్రము "శం నో మిత్రశ్శం వరుణః" మిత్రావరుణులు సుఖమును, అనగా ఆనందమయ జీవనమును కలిగింతురుగాక అని అన్నది. అనగా ప్రాణాయామాదుల వలన చిరకాలము బ్రతికి సుఖింపుమనియే కదా రహస్యము.

## వాక్కు - వాచస్పతి

ఋగ్వేదమున స్తుతించబడిన స్త్రీ దేవతలలో వాక్కు, లేక వాగ్దేవి అగ్రేసరురాలుగా అగపడుచున్నది. వాగ్దేవి అనగా సరస్వతీ దేవియే అని అందరెరింగిన విషయమే.

ఆమెయే గాయత్రిగాను, సావిత్రిగాను కూడ ఎన్నబడి, ప్రాత, ర్మధ్యాహ్న, సాయం సమయములందు అర్చింపబడు చున్నదని సంధ్యావందనము చేయువారికి తెలిసిన విష యమే. ఇట్టి సరస్వతిని గూర్చి ఋగ్వేద దిగ్దర్శన ద్వితీయ భాగమున, 175వ పుటనుండి కొంత వ్రాయుట అయినది. ఈ వాగ్దేవి తొలుత ఋగ్వేదమున ఎట్లు ప్రశంసింపబడినదో దిగువ మంత్రమునుబట్టి తెలియుచున్నది.

"దేవీం వాచ మజనయంత దేవా
స్తాం విశ్వరూపాః పశవో వదంతి,
సా నో మంద్రేష మూర్జం దుహానా
ధేను ర్వా గస్మా నుపసుష్టు తైతు." ఋ 8.100-11

తా॥ ప్రకాశించుచున్న వాగ్దేవిని, తొలుత దేవతలు కనిపెట్టినారు. ప్రాణాదింద్రియముల సాయమునగాని వాక్కు వ్యక్తము కాదు గాన, వారే ఇక్కడ దేవతలని భావము. అట్టి వాక్కును నానావిధప్రాణులు ఉచ్చరించుచున్నారు. ఆ వాగ్దేవి మనకు అన్నమును, ఆధ్యాత్మిక శక్తిని ఒసంగుచు మనచే స్తుతించబడి, కామధేనువువలె అయి మనయందు వెలయుగాక. అనగా మన వాంఛలను నెఱవేర్చుగాక అని భావము.

మానవులు మనస్సులోని సంకల్పములను మాటలలో వెలువరించియే వాటికి కార్యరూపమును సాధింతురు

కాన, వాక్కును కామధేనువుతో పోల్చుట సమంజసమే. అంతేకాక, వాక్కు అనగా, వేద వాక్కు కూడ కావున వేదవాక్కులు కామధేనువువలె సమస్త ప్రయోజనములను మానవులకు చేకూర్చుననియు ఇక్కడి పరమార్థము. ఇట్టి వాక్కునకు, నాలుగు దశలు కలవని ఇంకొక మంత్రము ఇట్లు వివరించుచున్నది.

"చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదు ర్బ్రాహ్మణా యే మనీషిణః,
గుహా త్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి." ఋ 1-164.45

తా॥ వాక్కునకు పరిమితములైన (విహరింపదగిన) స్థానములు నాలుగు. వాక్కులచే ఉచ్చరింపదగిన మాటలు నాలుగు రీతుల నుండునని కూడా ఎన్నవచ్చును. అవియే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ – అనెడి నాలుగు రూపములు కలిగి నాలుగు స్థానములలో వెలయుచున్నవి. అట్టి వాక్కులను ఏ పండితు లెఱుంగుదురో వారే శబ్ద బ్రహ్మము నెఱింగిన బ్రహ్మవిదులు. ఆ నాలుగురీతుల వాక్కులలో పరా, పశ్యంతీ, మధ్యమలనెడి మూడును గుహాలో (లోపల) మాత్రమే కలవు. వాటిని బాహ్యముగా ఎఱుంగజాల మన్నమాట. వాక్కు యొక్క నాల్గవ దశయైన వైఖరిని మాత్రము మానవులు పలుకుచుందురు. పరా, పశ్యంతీ, మధ్యమలు, ఆధార స్థానమునుండి అనాహతము

(గుండె) వఱకు వెలయుచుండును. వైఖరి మాత్రము కంఠ స్థానము (విశుద్ధ చక్రము) నుండి వెలువడి మానవులచే ఉచ్చరింపబడి జనులచే గ్రహింపబడుచున్నది. గుహాలో అనగా ఆధారాదులయందుగల పరాపశ్యంతీ మధ్యమలను తెలిసికొనవలయునన్నచో కుండలినీ యోగసిద్ధి అవసర మగుచున్నది. ఈ నాల్గింటిలోను పరావాక్కు పరబ్రహ్మ స్వరూపము. అదియే గాయత్రీ మాతృ రూపము గూడ.

ఈ పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరులనునవి జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, సమాధులకుగూడా సంకేతములు, నిదర్శనములు అని ఎఱుంగవలయును. పరావాక్కు మాత్రము తురీయమునకు (సమాధికి) తుల్యమైనది. పశ్యంతి సుషుప్తి, మధ్యమ స్వప్నము. వైఖరి జాగ్రత్తు. కావుననే జాగ్రద్దశలో లోకవ్యవహారము సాగుచున్నది. తురీయమున సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత సమాధులు సాగుచున్నవి. కావున గాయత్రీ విశ్వకర్మలకు, లేదా ప్రకృతి పురుషులకు ఇచ్చట అభేదమే. సాధకులు కాని, జిజ్ఞాసువులు కాని ఇట్టి అర్థములను, సత్వగుణముతో కూడిన బుద్ధితో ఆలోచించి అర్థము చేసికొనవలయునేకాని, రాగద్వేషములతో వీటిని దర్శింపరాదు. ఇట్టి పరమ రహస్యములైన వేద వేదాంత పారమార్థిక మర్మములు, అనుభవైక వేద్యములు, గురుముఖ గమ్యములే కాన, అనుభవదూరులకు అందునవి కావు.

వాక్కు గాయత్రి అనుటకు వేద ప్రమాణములను చూతము. తైత్తిరీయ సంహిత రెండవ కాండమునందలి దిగువ మంత్రము వాక్కే సరస్వతి అనుచున్నది.

"వాగ్వై సరస్వతీ, సరస్వతీ మేవ స్వేన భాగధేయే నోపధావతి, సైవాస్మిన్ వాచం దధాతి ప్రవదితా వాచో భవత్యపన్నదతీ భవతి. తస్మాన్ మనుష్యా స్సర్వామ్ వాచం వదంతి." (ప్రశ్న 1, 3)

ఈ మంత్రము వాక్కును సరస్వతి అని చెప్పి దానిని మనుజులు ఉచ్చరింతురన్నది కదా! ఇట్టి సరస్వతి, వేదమునందు బహు విధములుగా స్తుతింపబడినది-

"ప్ర ణో దేవీ సరస్వతీ
వాజేభి ర్వాజినీవతీ
ధీనా మవి త్ర్యవతు." ఋ 6-61.4

తా॥ తనను రక్షించువారిని, రక్షించునదియు, జ్ఞాన రూపాన్నదానము చేయునదియును అగు సరస్వతీ దేవి జ్ఞానమును, అన్నమును ఒసంగి మమ్ము రక్షించుగాక - అని భావము. "ధీనా మవిత్రీ" అనుటచేత ఆమె బుద్ధి ప్రేరకురాలనియు, బుద్ధులను కాపాడునదనియు తెలియుచున్నది. వాగ్రూపిణియైన గాయత్రియే సర్వము అని ఛాందోగ్యోపనిషన్మంత్ర మొకటి అనుచున్నది.

"గాయత్రీవా ఇదం సర్వం భూతం యదిదం కించ. వాగ్వై గాయత్రీ. వాగ్వా ఇదగ్ం సర్వం భూతం గాయతి చత్రాయతేచ." (మూడవ అధ్యాయం 12వ ఖండం)

చరాచరమైన జగమంతయు గాయత్రియే. దీనినే "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనికూడా అన్నారు. కనుక గాయత్రీ పరబ్రహ్మములకు అభేదమే. విశ్వకర్మ కూడా సర్వ వ్యాప్త పరబ్రహ్మమే కావున, గాయత్రీ విశ్వకర్మల తత్త్వములు రెండును ఒక్కటే అన్నమాట. అనగా "ఏకం సత్" అనియే భావము. ఇట్టి గాయత్రియే వాగ్రూపిణియై అన్నింటిని పేర్కొనుచున్నది. అంతేకాదు, రక్షించుచున్నది కూడ. ఛాందోగ్య మంత్రమునకు భాష్యము వ్రాయుచూ శంకరులు-"గాయత్రి ఛందోరూపముగానేకాక, వాగ్దేవతా రూపముగా కూడా ఉండి-గాన, త్రాణములనెడి కార్యములను చేయుచున్నది" అనినారు. దీనినిబట్టి పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములలోనున్న వాగ్దేవికి గాయత్రికి అభేదమే అని తెలియుచున్నది కదా, అందుకే ఆమె వేద మాత కూడ. కావుననే "గాయత్రీం వేదమాతరం". "నమామ వేదమాతరం" అనియు అన్నారు. ఇట్టి వాక్కునకు పతి (ప్రభువు - స్వామి) విశ్వకర్మ అని విశ్వకర్మ సూక్తము విస్పష్టముగానే చెప్పినది.

"వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే
మనోజువం వాజే అద్యాహువేమ." 10-81.7

"వాక్" అనెడి పదముయొక్క షష్ఠీ విభక్తి ప్రథమైక వచనమైన- వాచః = వాక్కునకు, పతిః = భర్త అని వాచస్పతి శబ్దమునకు అర్థము. ఈ మాటకు భాష్యము వ్రాయుచూ సాయణులు "మంత్ర రూపాయా వాచః పంతిః = పాలకం= స్వామినం - విశ్వకర్మాణం" అని అనినారు. దీనినిబట్టి వాగ్దేవికి పతి విశ్వకర్మయనుటలో సాయణాదులు వేద మార్గమును సంపూర్ణముగానే అనుసరించినట్లు తేలుచున్నది గదా!

వేదమున కొన్ని ఘట్టములందు విశ్వకర్మయు, బ్రహ్మయు, అభేదరూపులని భాష్యకర్తలు భావించినారు. దీనికి మూలముకూడ విశ్వకర్మ సూక్తమునందలి "విశ్వకర్మా హ్యజనిష్ట దేవః" విశ్వకర్మ సృష్టికర్తగా - త్వష్టగా, లేక బ్రహ్మగా రూపొందినాడనెడి వాక్యమే. ఇదియే తరువాతి వాఙ్మయమున వాగ్దేవి, లేక సరస్వతీదేవి బ్రహ్మదేవుని భార్య అని వర్ణింపబడినది. ఇట్టి విశేషములన్నియు అరకొఱజ్ఞానముతో కాక, వేదాదుల సంపూర్ణ జ్ఞానముతో గాని తెలియబడవు.

## వాగర్థ రహస్యము

వాక్కు, వాచస్పతి తత్త్వములయొక్క సంపూర్ణ జ్ఞానమునకు పూర్వము అసలు వాగర్థ రహస్యమేమో విచారింపవలసియున్నది. దాని నించుక విచారించి చూతము. వాగర్థములది ఎడబాయని సంబంధము. వాక్కు ఉన్నచోట

నెల్ల అర్థము ఉండితీరవలసినదే. అట్లే అర్థమును వ్యక్తీక రించుటకు వాక్కు కూడా ఉండితీరవలసినదే. ఈ రెంటిది విడదీయరాని- ఎడబాయని సంబంధము. కావుననే దానిని దాంపత్య సంబంధముగా కవులు కొనియాడినారు. కాళిదాస మహాకవిగూడ రఘువంశ మహాకావ్యారంభమున "వాగర్థావివ సంపృక్తౌ" అని దాంపత్య ధర్మమును వాగర్థములతో పోల్చినాడు. అర్థము అవ్యక్త రూపమైనది. అది మానసిక వ్యాపారము మాత్రమేకలది. అర్థశబ్దముపుంలింగముకూడను. అట్టి అర్థమును వ్యక్తము చేయుటకు వాక్కు అనునది ఉండి తీరవలయును. అందుకే మొదటిది అర్థ (భావ) బ్రహ్మ రూపము కాగా, రెండవది వాగ్బ్రహ్మస్వరూపమగు చున్నది. సంస్కృత భాషలో వాక్కు అనుమాట స్త్రీ లింగములోను, అర్థము అనుమాట పుంలింగములోను ఉన్నవి. ఆ స్త్రీ, పుంలింగ సారస్యమునుబట్టియే ఆ రెంటికి దాంపత్య సంబంధము కల్పింపబడినది. పురుషుడు తన్ను ఒండొక వ్యక్తిగా రూపొందించుకొనవలెనన్న ఒక స్త్రీ అవసరమయినట్లే, అర్థాభివ్యక్తికి వాక్కు అవసరము.

పితా పుత్రాది సంబంధము లన్నియును, దాంపత్య సంబంధమంతటి దగ్గఱివి కావు. విడదీయరాని, విడిపోవ వీలుకాని ఘనిష్ఠ సంబంధము అనురాగ రసపూర్ణమైన దాంపత్య సంబంధమొక్కటే. అది శరీర, మానస, ఆత్మల అన్యోన్యతతో కూడినట్టిది. దీనిని అద్వైతముగాకూడా భవ

భూతి మహాకవి సంభావించినాడు. ఉత్తర రామ చరితము లోని "అద్వైతం సుఖదుఃఖయోః" అనెడి శ్లోకము ఈ విషయమునే చాటుచున్నది. ఇక్కడ వాగార్థముల - దంపతుల అద్వైత సంబంధమెట్టిదో కొంత పరికించి చూతము. వాగర్థముల పరమాద్వైత స్వరూపమును ఇట్లు భావనచేయ వలసి యున్నది. వాక్కునకు నాలుగుదశలు, లేక రూపములు చెప్పికొన్నాముగదా! వాటిలో మొదటిది పరాస్వరూపము. ఇది అవ్యక్త పరబ్రహ్మస్వరూపమే అని కదా నిర్ణయము. దీనికిని, నాసదీయసూక్తము చెప్పినభావాతీతస్థితికినిఅవ్యక్తమే - అనిర్వచనీయతయే ఆదిమస్థితి. కనుక పరావాక్కు, అర్థముయొక్క ఆదిమదశ ఒక్కటే అన్నమాట. ఆవల ఆపరావాక్కు పశ్యంతీ, మధ్యమా రూపములను తాల్చుచున్నది. ఇవి సదసదతీత స్థితి కల్పించెడి పరిణామములలో తొలిదశలు కనుక వాటిని సత్తని వచింపవచ్చును. దాని యొక్క ఈషద్వ్యక్త స్వరూపమే మధ్యమవాక్కు. ఇక చివరిది వైఖరియై ద్వైతము తేజరిల్లినది. ఈ రీతిగా వాగర్థములకు అద్వైతస్థితి ప్రథమ దశలో కలుగుచున్నది. కనుక ఏకైక వస్తువే ద్వైత స్వరూపమును, నానాత్వమును పొంది జగద్వ్యవహారమునకు అనుకూలమగుచున్నదన్నమాట. ఈ విషయము సూక్ష్మాతి సూక్ష్మముగా భావించి అనుభవ పూర్వకముగా అవగాహన చేసికొనదగిన రహస్యమును, విశేషమును. కావున ఒకేఒక జగత్కారణ విశ్వకర్మ

యందు ఆత్మకంటె అభిన్నముగా గాయత్రి వ్యక్తమై జగత్క్రీడను నడుపుచున్నదని తెలియవలయును. దీనినే అఖండ నిర్గుణ పరబ్రహ్మమునందు బ్రహ్మశక్తి (చిచ్ఛక్తి) తోచి జగములకు హేతువగుచున్నదని వేదాంతము చెప్పినది. బ్రహ్మమును, బ్రహ్మశక్తియు ఏకమే అయినట్లును, ద్వైతావస్థలో రెండును జగత్క్రీడకు హేతువులైనట్లును మనము వేదాంతముద్వారా గ్రహించుచునేయున్నాము. కాగా తేలినదేమన, అర్థ (భావ) మనునది రూపములేని అవ్యక్తము. అట్లే పరావాక్కు కూడ ఈ అవ్యక్త రూప అర్థముతో - లేక, బ్రహ్మముతో సమానమైనదే. కావుననే ప్రథమ దశలో రెంటికిని అద్వైతస్థితి సంభవించుచున్నది. పరిణామ స్థితి కలుగునప్పటికి అనగా నాసదీయ సూక్త ప్రకారము - తపస్సు - మాయాశక్తి అంకురించిన పిమ్మట ద్వైతము, నానాత్వము కొనసాగి జగద్వైచిత్రి వెలయుచున్నది. కనుక దీనిని అర్థము చేసికొన్ననేగాని, గాయత్రీ విశ్వకర్మల పరమాద్వైత స్వరూపము అవగాహనకాదు. కనుకనే వాగ్దేవిని ప్రథమ స్త్రీ దేవతగా వేదము వర్ణించియున్నది.

ఇట్టి వాగర్థముల సంబంధమువలెనే ప్రకృతి పురుషుల సంబంధముకాని, గాయత్రీ - విశ్వకర్మల సంబంధముకాని, ఏ దంపతుల సంబంధముకాని విడదీయరానిదనీ, విడిపోనిదనీ

"వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అన్న మహామంత్ర వాక్యము స్పష్టీకరించు చున్నది.

వాగర్థములు స్థూలదృష్టికి రెండుగాను, ద్వంద్వము గాను కన్పట్టుచున్నను, ఆలోచించిచూచినచో అవి ఏక మేవాద్వితీయమే. ఉన్నదెల్లనూ ఒకఅర్థమే- భావమే. అది అవ్యక్త స్వరూపము కాని, వ్యక్తరూపముకాదు. ఈ అంశమునే నాసదీయసూక్తము అదిసత్తుకాని, అసత్తుకాని, కాని ఏకైకవస్తువని వక్కాణించినది. అట్టి అద్వితీయా ఖండమునుండియే తమస్సనెడి మాయాశక్తి ఆవిర్భవించినది. దానియందు ఆ అవ్యక్తముతోచగనే దానికి సద్వితీయత్వ మేర్పడినది. ఏకైక వస్తువు సద్వితీయము కానంతవఱకు దానికి అభివ్యక్తి లేనేలేదు. ఒక్కడే తన్నుతానెట్లు చూచు కొనును! ఎవనిప్రేలుకాని, దానికొనను తానే తాకలేదు కదా! కన్ను తనను తానే చూచుకొనలేదుకదా! అందుకే ఆ ఒక్కతత్త్వమునుండి దానిప్రతిబింబమే అయిన మాయా శక్తి తోచినది. ఇట్టి తొలిదీ ప్రకాశమే, మలిదీ (మాయ) ప్రకాశమే అని గ్రహింపవలసియున్నది.

తమస్సు తోచినపిమ్మట మనస్సు, రేతస్సు, కామము ఇత్యాదినానాత్వమంతయు విలసిల్లినది. కనుక తొలితత్త్వము నందు, అదే మలితత్త్వముగాగూడ తోచినదని తత్త్వ దృష్టితో ఎఱుంగవలసి యున్నది. లేకున్న, అద్వైతము సిద్ధింపదు. రెండవది తొలిదానినే అభివ్యక్తముచేసి దానితో

తాదాత్మ్యమును సంపాదించు కొన్నది. ఇదియ సృష్టి రహస్యము.

ఇప్పుడు వాగర్థములనుగూర్చి సంభావింపుడు. ఒకేఒక అర్థము తన్ను తాను అభివ్యక్తముచేసికొనుటకు తననుండియే వాక్కు-అనెడి ఉపాధిని ఆవిష్కరించినది. అప్పుడా అర్థము నకును, దానిశరీరమైన వాక్కునకును భేదమున్నది. భేదము కావలెననుకొన్న కల్పించుకొన వచ్చునేగాని, లేకున్న లేదు. దీని నీ దిగువదృష్టాంతముతో అర్థముచేసికొనవచ్చును.

ఒక బీజమునుండి వెలువడిన శాఖా, పల్లవ, పుష్ప, ఫలములను మనము చూచుచునేయున్నాము. వృక్షము యొక్క నానాత్వమునందు నెలకొన్నదంతయు ఏకైకమైన బీజసారమేకదా. అట్లే విశ్వకర్మతత్త్వమన్నను, గాయత్రీ తత్త్వమన్నను, ఒక్కటేకాని వేఱుకాదని మేము మొదటి నుండియు, మా గ్రంథములయందు నిరూపించుచునే యున్నాము. కనుకనే వాగర్థముల ఈసంబంధమును కాళి దాసువంటి తత్త్వజ్ఞులు గ్రహించి పండితలోకపు కన్నులు తెఱపించినారు. ఆయన విశ్వకర్మసూక్త మర్మములను లెస్సగా చదివి జీర్ణించుకొన్న మహనీయుడు. ఈ సందర్భమున వాగర్థస్వరూపులే అయిన లోకములోని స్త్రీ పురుషులనే ఉదాహరణముగా తీసికొని విచారింతము.

ఈ భా వ ము ను మనపురాణములు అర్ధనారీశ్వర స్వరూపముగా వర్ణించినవి. అర్ధనారీశ్వర స్వరూపమును

స్థూలముగా చూపుటకు శిల్పము, చిత్తరువులు యత్నించినవి. సగముమగవాడుగాను, సగముఆడదిగాను చిత్రించుటకంటె అవి ఎక్కువగా ఆ తత్త్వమును ప్రదర్శింప లేకపోయినవి. అట్లున్ననేకాని స్థూలదృష్టికి అర్ధనారీశ్వర రూపము గోచరింపదు. పారమార్థికముగా చూచినచో ప్రకృతిపురుషులు నీరు పాలు కలసినట్లు ఐక్యమై యుండునట్టి ఏకైక తత్త్వమే కాని భిన్నముకాదు. పాలలో నీరు కలసినను ఆ నీరుపాలే అయిపోవును. ఆ రెంటిని హంసలుతప్ప మనుజులు విడదీయ లేరు. మనుజులుకూడ పరమహంసలగుచో ప్రకృతి పురుష పరమతత్త్వమును విడదీసి చూడగలరు. తాత్త్వికులందఱు అట్టిమహాత్ములే. కాన అర్ధనారీశ్వర తత్త్వమనగా ప్రకృతి పురుషైక్యరూపమేకాని, తదితరము కాదు. వాగర్థరహస్యమును, ప్రకృతిపురుష తత్త్వమును ఇంతలోతైనవి, ఉన్నతమైనవి, గంభీరమైనవికాని సామాన్యములుకాదు.

## జడ చైతన్య క్రీడ (Matter and Spirit)

నాసదీయ సూక్తమునుబట్టి చూడ సృష్టియొక్క ఆదిమదశలో జడముకాని, చైతన్యము (Spirit) కానిలేదని మనకు స్పష్టమగుచునే యున్నది. అట్టి మూల పదార్థము నుండియే జడ చైతన్యములు బయలుదేరినవి. ఇక్కడ జడము ముందా, చైతన్యము ముందా అనువిషయము బుద్ధికి అందునది కాదు. అవి రెండును వాగర్థములవలె అద్వైత స్వరూపములే అనుకొనుట సాధకులకు సుగమముగా

నుండును.ఆలోచించిచూచినశుద్ధచైతన్యమనిగానిశుద్ధజడమని కానివేఱువేఱుగా ఉండజాలవు. ఒకానొకప్పుడు జడమునుండి చైతన్యమును, చైతన్యమునుండి జడమును వ్యక్తమగుటయే సృష్టిధర్మముగాను, రహస్యముగాను పొడకట్టుచున్నది అసలు ఏదికాని, పుట్టుటకాని, గిట్టుటకాని, లేనేలేదని గ్రహింపగలము పుట్టుట అనగా వ్యక్తమగుట. గిట్టుట అనగా అవ్యక్తదశకుచేరుట. పుట్టుట, గిట్టుట అనుమాటలు వ్యవహార సౌకర్యమునకేగాని, సత్య ప్రకటనమునకు కావు. చావు పుట్టుకలనెడి పదములను ప్రయోగించిననేకాని జనసామాన్యమునకు విషయ మర్థముకాదు. ఆ రెంటికి మనము అభివ్యక్తి, అనభివ్యక్తి అనెడి పదములను వాడుకొందము. అభివ్యక్తమగుట అనగా లేనిది తోచుట అనికాదు. మాటుపడి యున్నది తోచుట అనిమాత్రమే అర్థము. అట్లే అవ్యక్తమన్నను పూర్తిగా లేదని అర్థముకాదు. ఉన్నట్టిదే వ్యక్తముకాదని భావము.

జడమునుండి చైతన్యముకాని, చైతన్యము నుండి జడముకాని, అభివ్యక్తమయ్యెడిదశలో కొన్ని సంఘటనలు జరుగవచ్చును. జడమునకు చైతన్యమును వ్యక్తము చేసెడి యోగ్యత కలుగుట, చైతన్యమునకు జడమును వ్యక్తీకరించెడి శక్తి గలుగుటయే సంఘటనలకు మూలమని గ్రహింపవలయును. ఈ రహస్యము అందఱికీ అవగాహన కావలయునని కాని, అందఱూ దీనిని గ్రహించి, ఆమోదించి, తృప్తి

పడవలయునని కాని ఎవరునూ తలంపరాదు. ఎవరు ఆమో దించినను, ఆమోదించకపోయినను సృష్టి స్వభావములో ఉన్నదేదియో అది ఉండియే తీరును. జరుగునది జరిగియే తీరును. ఇట్టి సృష్టి రహస్యములనే ద్రష్టలైనవారు సృష్టి, స్థితి, లయాది పదములతోను, చావు పుట్టుకలు అనెడి మాటలతోను పేర్కొన్నారు. మృత్యుత్వ, అమృతత్వములు కూడ వారివర్ణన ఫలితములేకాని, నిక్కమయినవికావు. అగపడకపోవుట చావుఅనియు, అగపడుట పుట్టుక అనియు సామాన్య దృష్టికి తోచవచ్చును. కావున జడముకాని, చైతన్యముకాని, అభివ్యక్తమగుటయే జరుగుచున్న పని-అనితత్త్వజ్ఞులు గ్రహించవలయును. ఇందుకు బీజాంకురములనే ఉదాహరణముగా తీసికొనవచ్చును. బీజములో వృక్ష స్వరూపమంతయు ఉండియేఉన్నది. అది బీజసారరూపములో ఉండి తగిన సమయమున అభివ్యక్తిని పొందుచున్నది. మనము తొందఱపడినను, ఏదియు వేళకానివేళ జరుగనేరదు. నియమిత కాలము సంప్రాప్తమైననే వృక్షమునుండి శాఖా, పత్ర, పుష్ప, ఫలాదులు వ్యక్తములగును. జడ చైతన్య క్రీడ కూడ ఇట్టిదే!

ఈ రహస్యమును నాసదీయ, విశ్వకర్మ, పురుష సూక్తాదులు సుస్పష్టముగా వర్ణింపక, పొనపొనగామాత్రమే చెప్పబూనినవి. చెప్పగలిగినంతవఱకు, మనముఅర్థముచేసికొన గలిగినంతవఱకు అవి చెప్పజాలినవేకాని, సత్యబింబము

యొక్క సర్వముఖములను సమగ్రముగా చూపలేకపోయిన వనియే అనవలయును. ఈ రహస్యమునే "విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖః" అనెడి వాక్యము పూర్ణసత్యమునకు నానాముఖములు, నానానేత్రములు కలవని వచించినది. అందుకే వ్యాఖ్యాతలకు ఎన్నియో వివరణావకాశములు చేకూరుచున్నవి. వాటికి మనము తగినవ్యాఖ్యానములు చేసి కొని సంపూర్ణసత్యస్వరూపమును తెలిసికొనవలసియున్నది.

జడచైతన్యములు రెండును ప్రకృతి, పురుష స్వరూపములే. ఇవి రెండుకూడ ఎడబాయని జంటలే. ఒకటి లేకుండా ఇంకొకదానికి ఉనికి లేనేలేదు. జడములేనిది చైతన్యము వ్యక్తము కాదు. వాక్కులేనిది అర్థము తెలియదుకదా! అట్లే చైతన్యములేనిది జడము ప్రకాశింపదు. వట్టిమొద్దు వలన జరుగు ప్రయోజనమేమున్నది! కాన చైతన్యము నాశ్రయించియే జడముయొక్క క్రీడయును, జడమును ఆశ్రయించియే చైతన్యముయొక్క క్రీడయును. ఒకటి నింకొకటి ఎడబాసినను, లేక, అద్వైతస్థితిని పొందినను క్రీడయే లేదు, సృష్టియేలేదు, విశ్వమేలేదు. అందుకే విశ్వోత్పత్తికి ఉభయములు (Matter and Spirit) హేతువులగుచున్నవి. అట్టితఱి ఏది ఉపాదేయము. (గ్రహింపదగనది) ఏది అనుపాదేయము! (గ్రహింపదగనిది) రెండును ఉపాదేయములే అగుచున్నవిగదా!

కొందఱు జడమును తిరస్కార్యమను కొని, దానిని

చిన్న చూపుచుందురు. అది చేయరాని తప్పు. ఆ జడమే లేకున్నచో, నీవు అభివ్యక్తుడవే కాలేవు. నిన్ను, నీ ఉనికిని, నీకూ, లోకమునకూ చెప్పినదీ - తోప చేసినదీ జడమేకదా. జడమే లేకున్నచో, నీవున్నావని ఎవరికి తెలియును! నీ ఉనికిని తేటపఱచినది జడ పదార్థమేకదా! జడ చైతన్యములు రెంటిలో ఒకదానికి ఇంకొకదాని మీద తిరస్కారదృష్టి లేనే లేదు. అవి రెండును ఒక నాణెముయొక్క రెండు పార్శ్వములే కాని భిన్నములు కావు. ఏది లేకున్నను రెండవదానికి, ఉనికి ఉండదు. అందుకే ప్రకృతిలో అవి రెండును ఒక దాని నింకొకటి ఆహ్వానించుకొనుచూ పరస్పర పూరకములై ప్రయాణము సాగించుచున్నవి. కనుక ప్రకృతిని - లేదా, జడమును చిన్న చూపు చూచుట యన్న, చైతన్యమును చిన్న చూపు చూచినట్లే లెక్క! నీ జననమునకు నీతలిదండ్రు లిరువురు కారణమైనట్లు, నీ ఉనికికీ, నీ ప్రకాశమునకూ, జడ చైతన్యములు రెండును అవసరములైనవని, ఏనాటికిని మఱు వకుము. నీ పుట్టుకకు నీ తలిదండ్రులవసరమైనట్లు, ఇంకొకరి రాకకును, నీకొకతోడు అవసరమని మఱువకుము. ఇదే సృష్టి రహస్యము. విశ్వమర్మ జ్ఞానము. ఇట్టి ద్వంద్వజ్ఞానమే నిన్ను అద్వయస్థితికి ఉద్ధరించునట్టిది. అందుకే బుద్ధుడిట్టి అద్వయజ్ఞానము నెఱింగియే అద్వయవాది అయినాడు.

ప్రకృతి పురుషుల ఈ లీలను - చిజ్జడముల ఈ క్రీడను తత్త్వదర్శనమును పొందిన కబీరుమహాశయుడు "ప్రకృతి

"పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" అన్నది. విశ్వకర్మ సూక్తము "ద్యావా పృథివీ అప్రథేతామ్" అన్నది. కనుక ఆ దివ్య పురుషార్చనము ఎక్కడనున్నను జరుగునట్టిదే, జరుగవలసినదే. అందుకే దానిని అమూర్తము, ఇంద్రియములకు గోచరించు రూపరస గంధాదులు లేనట్టిదని అమూర్త శబ్దముచే ఎఱుంగవలసియున్నది. కనుకనే మఱొక వాక్యము "భావగ్రాహ్యో మనోమయః" అన్నది. తరువాత పురుష శబ్దమునుగూర్చి ఈ తత్త్వము స్త్రీ పురుష జనన కారణమైన పురుష స్వరూపమే అని స్పష్టముగా చెప్పినది. తరువాతి పదము "సబాహ్యాభ్యంతరః" ఆ తత్త్వమునకు లోపల, వెలుపల అనెడి భేదములు లేవట. నీవు దానిని నీ లోపలనే కాక, అన్నింటి లోపలనేకాక, వెలుపలకూడ అనుభూతి పొందవచ్చునని గ్రహింపవలసియున్నది. ఈ విషయమును మంత్ర పుష్పము "అంత ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అన్నది. విశ్వకర్మ సూక్తమేమో "పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభి రసురై ర్గుహా యత్" అది దేవాసురులకంటెను, భూదివములకంటెను పరమైయున్నను, వీటన్నిటియందును వ్యాపించి నీ హృదయ గుహలోకూడ ఉన్నది నాయనా! అని, ఎంతో వాత్సల్యముతో దాని రహస్యమును కరతలామలకము చేసినది. పిమ్మట "అప్రాణః" "అమనాః" అనెడి మాటలు దానికి ప్రాణాదులైన ఇంద్రియములు కాని, మనో బుద్ధి

"పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" అన్నది. విశ్వకర్మ సూక్తము "ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః" అన్నది. కనుక ఆ దివ్య పురుషార్చనము ఎక్కడనున్నను జరుగునట్టిదే, జరుగవలసినదే. అందుకే దానిని అమూర్తము, ఇంద్రియములకు గోచరించు రూపరస గంధాదులు లేనట్టిదని అమూర్త శబ్దముచే ఎఱుంగవలసియున్నది. కనుకనే మఱొక వాక్యము "భావగ్రాహ్యో మనోమయః" అన్నది. తరువాత పురుష శబ్దమునుగూర్చి ఈ తత్త్వము స్త్రీ పురుష జనన కారణమైన పురుష స్వరూపమే అని స్పష్టముగా చెప్పినది. తరువాతి పదము "సబాహ్యాభ్యంతరః" ఆ తత్త్వమునకు లోపల, వెలుపల అనెడి భేదములు లేవట. నీవు దానిని నీ లోపలనే కాక, అన్నింటి లోపలనేకాక, వెలుపలకూడ అనుభూతి పొందవచ్చునని గ్రహింపవలసియున్నది. ఈ విషయమును మంత్ర పుష్పము "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అన్నది. విశ్వకర్మ సూక్తమేమో "పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్గుహా యత్" అది దేవాసురులకంటెను, భూదివముల కంటెను పరమైయున్నను, వీటన్నిటియందును వ్యాపించి నీ హృదయ గుహలోకూడ ఉన్నది నాయనా! అని, ఎంతో వాత్సల్యముతో దాని రహస్యమును కరతలామలకము చేసినది. పిమ్మట "అప్రాణః" "అమనాః" అనెడి మాటలు దానికి ప్రాణాదులైన ఇంద్రియములు కాని, మనో బుద్ధి

చిత్తాహంకారములు కాని లేవని చెప్పినది. దానికి అవి లేకున్నను, వాటిని జనింపచేసిన తాను వాటియందు మాత్రము లేకపోలేదని ఇచ్చట సాధకులు గ్రహింపవలసి యున్నది. వాటి యందది లేకున్నచో, అవి తమ తమ ధర్మములను నెఱవేర్పలేకపోగా, కదలక, మెదలక మొద్దుల వంటివి కావలసివచ్చును. ఆ ప్రాణాదులు దానినుండియే చైతన్య స్ఫూర్తిని పొంది తమతమ విషయములను నెఱవేర్ప గలుగుచున్నవి. అవి దానినుండియే కలిగినవని ముండకోప నిషత్తు పలికినది.

> "ఏ తస్మాజ్జాయతే ప్రాణో, మన స్సర్వేంద్రియాణి చ. ఖం, వాయుః, జ్యోతి, రాపః, పృథివీ, విశ్వస్య ధారిణీ." **-2-1-3.**

అనెడి మంత్రము చెప్పినది. అనగా ఈమూలతత్త్వము నుండియే ప్రాణము, మనస్సు, తదితరేంద్రియములు, ఆకాశము, గాలి, అగ్ని, జలము, విశ్వమును ధరించు పృథివి కూడ కలిగినదని భావము. ఇన్నిటిని తానై జనింపజేసిన వస్తువు తాను వీటియందు లేకుండ నెట్లుండును! కావుననేఅది వాటిలో ఓతప్రోత భావమున (పడుగుపేకలరీతిని)కలసిమెలసి యున్నదట. అంతేకాదు. అవి ఆ చైతన్యముతో తాదాత్మ్యమునుచెంది,తమ్మును, దానినివేఱుపఱుపవీలుకానిరీతిని క్షీర నీరములవలెకలసి పోయినవి కూడను. అందుకనియే మూల తత్త్వమునుతరువాతిమాటశుభ్రమనిఅన్నది.అనగా బుద్ధింద్రి

యాదుల మాలిన్యము లేవియు అంటుకొననంతటి పరి శుద్ధమును, స్వచ్ఛమును అయినదన్నమాట తత్త్వము. ఇట్టి తత్త్వము అక్షరమని (నాశనము లేనిదని) చెప్పబడిన ప్రత్యగాత్మకంటెను, మనము పరములని చెప్పుకొనుచున్న వాటి కంటెను కూడ పరమై ప్రకాశించు చున్నదట. దీనినే తురీయాతీత స్థితిగా యోగులు వర్ణించినారు. నాస దీయము సదసదతీత మన్నది. విశ్వకర్మసూక్తము పర శబ్దముతోనే పేర్కొన్నది. పురుష సూక్తమేమో ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" అని మనకు కొంత అందుబాటులో నుండునట్లు వర్ణించినది. దీనిని తురీయమైన సంప్రజ్ఞాత సమాధితో పోల్చవచ్చును.

ఈ మంత్రమునందలి అజశబ్దముచేత బుద్ధిమంతులు అజాత సిద్ధాంతమును బయలుదేరతీసినారని మనము గ్రహింపవలసి యున్నాము. శుభ్ర శబ్దమును బట్టి "తచ్ఛు భ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్యదాత్మ విదో విదుః" అను వాక్యము పుట్టినది. నాసదీయ సూక్తము దీనిని సత్తు, అసత్తు కాదని చెప్పగా, మూల స్తంభ వర్ణనానుసారము స్వయం భువు- స్వయం సిద్ధ విశ్వకర్మతత్త్వమే అది అని తెలియు చున్నది. దాని తరువాతిది పురుష సూక్తవర్ణిత పురుషదశ. కావుననే దానియందు విశ్వకర్మ గాయత్రీ సహితముగా అనుగతుడైనాడు. స్త్రీ పురుషాత్మక ద్వంద్వములను వెలువ రింపజాలిన పురుష సూక్తమునందు చెప్పబడిన పురుషదశ

జగత్తుల సృష్టి ప్రకారమును, అందు మానవుడు నడచుకొన వలసినరీతులను, దానిమూలమున భగవత్సాక్షాత్కారమును పొంది అమృతత్వము నందుటను బోధించునని మన మెంచు చుందుము. వేదములోని సూక్తము లన్నియు, మంత్రము లన్నియు ఇట్టి భగవత్తత్త్వమునే సృష్టి రహస్యమునే చాటు నని మనము భ్రాంతిపడ రాదు.

వేదములోని కొన్ని సూక్తములు, కొన్ని మంత్రములు మాత్రమే సృష్టిరహస్యమును చెప్పి భగవత్తత్త్వమును ఎఱుక పఱచును. అట్టివాటిలో నాసదీయ (ఋ.10-129) విశ్వకర్మ (10-81-82) పురుష (10-90) మోక్ష (1-164) సూక్తములు మొదట చెప్పదగినవి. అయినను అవి బోధించు తత్త్వము భగవంతునిదే కాన "వేదైశ్చ సర్వైః" అన్నది గీత దీని నీ దృష్టాంతముతో గ్రహింపవచ్చును.

"సుబ్బయ్య నాకీమాట చెప్పినాడు" అన్నప్పుడు సుబ్బయ్యయొక్క సమస్త దేహము ఆ మాటను చెప్పలేదు. సుబ్బయ్య మనస్సు ఒక సంగతిని ఆలోచింపగా, దానిని ఆతని మాటలు (వాగింద్రియము) చెప్పినవి. ఇక్కడ పని చేసినది సుబ్బయ్యలోని కొంతభాగమే అయినను, మొత్తము సుబ్బయ్య ఆ పని చేసినట్లు మనము వ్యవహరించుచున్నాము కదా. అట్లే వేదములోని ఏ నాలుగు సూక్తములో, ఏ కొన్ని మంత్రములో సృష్టి రహస్యమును, భగవత్తత్త్వమును బోధించినను మొత్తము వేదమునకు ఆ గౌరవము దక్కు

చున్నది. తక్కిన వేద భాగములకు ఈ ముఖ్యసూక్త, మంత్రములతో పరంపరగా సంబంధము ఉండవచ్చును. కావున "వేదైశ్చసర్వైరహమేవ వేద్యః" అన్నమాటలోని రహస్యార్థమును ఇట్లు భావింపవలయును.

## ఈశ, ముండకవాణి

ఈ సందర్భమున మనము మఱికొన్ని ముండకోప నిషన్మంత్రముల ద్వారాకూడ జడచైతన్య క్రీడను గూర్చి తెలిసికొనుట విశ్వసత్య సాక్షాత్కారమునకు దోహదము కాగలదు.

"తదేత త్సత్యం, యథా సుదీప్తా త్పావకాద్విస్ఫులింగా స్సహస్రశః ప్రభవన్తే సరూపాః, తథాక్షరాద్వివిధాస్సోమ్య భావాః ప్రజాయన్తే, తత్రచైవాపియన్తి." 2-1-1

మూలతత్త్వము శాశ్వత సత్యమైనట్టిది. బాగుగా ప్రజ్వలించుచున్న అగ్నినుండి నిప్పురవ్వలు శతసహస్ర సంఖ్యలలో కలుగునట్లు, అక్షర పరబ్రహ్మమునుండి దానికి సరూపములు, విరూపములు అయిన భావములు (ఆకాశాది పదార్థములు)పుట్టుచున్నవి. మఱల అందే కలసిపోవుచున్నవి- అని మంత్ర భావము. దీనిని బట్టి మూలతత్త్వమునుండి చేతనములే పుట్టవలెనని లేదు. చేతనములు, అచేతనములు, జడము, చైతన్యము, మిశ్రము కలుగవచ్చునని మనము గ్రహింపవలసియున్నది. కనుకనే, ఉపమానమయిన

అగ్నినుండి కలిగిన నిప్పురవ్వలను సరూపములని చెప్పి, అక్షర వస్తువునుండి కలిగిన భావములను వివిధములని చెప్పినది శ్రుతి. దీనినిబట్టి ఆ భావములు జడములు, చేతనములు, మిశ్రములు అని మనమర్థము చేసికొనవలసియున్నది. మనమనుకొన్న జడ చైతన్య క్రీడను ఉపనిషత్త్రివిధముగా వివరించినది. ఇవ్వట్టున ఈశోపనిషద్వాణి కూడ పాఠకులు అనుసరించి తత్త్వ నిర్ణయము చేసికొన దగినట్టిదే.

"అనేజ దేకం మనసో జవీయో
నైన ద్దేవా ఆప్నువ న్పూర్వ మర్శత్,
తద్ధావతో ఒ న్యా నత్యేతి తిష్ఠ త్తస్మి న్నపో
మాతరిశ్వా దధాతి (4) తదేజతి, తన్నై జతి,
తద్దూరే, తద్వంతికే, తద న్తరస్య సర్వస్య
తదు సర్వస్యాస్య బాహ్యతః (5) యస్తు సర్వాణి
భూతాన్యాత్మన్యేవానుపశ్యతి, సర్వభూతేషు చాత్మా
నం తతోన విజుగుప్సతే (6) యస్మిన్సర్వాణి భూతా
న్యాత్మైవాభూ ద్విజానతః, తత్ర కోమోహః కశ్శోక
ఏకత్వ మను పశ్యతః. (7)

తా॥ ఆ ఏకైక వస్తువు సర్వ పరిపూర్ణమైనందున స్వయముగా చలింపదు. అయినను మనస్సుకంటెను వేగము గలది. దానిని ఉత్తమ సాధకులుగూడ పరామర్శించి తెలియలేకపోయినారుఅదికదలకున్నను,పరుగెత్తుచున్న వారిని మించును. దానియందే జల వాయువులు ఆధారపడియున్నవి.

చలించుట, చలించకపోవుట, దూరముననుండుట, దగ్గఱనే యుండుట, అందఱికీ లోపలవెలుపలవెలుగుట, ఇత్యాది విరుద్ధ ధర్మములు దానికిగలవు. ఇట్టి పరమతత్త్వమును ఎవగు తమలోచూచు కొందురో, అన్నింటను చూడగల్గుదురో, వారు దేనినిగాని గర్హించరు. ఏదశలో సర్వభూతములు తానుగానే పొడకట్టునో, అప్పుడట్టివానికి శోకమోహాదు లుండవు. అపుడతడు పరమాద్వైత స్వరూపుడే.

ఇప్పట్టున, ముండకముచేసిన వర్ణనమంతయు చిజ్జడము లయిన వస్తువులకు సంబంధించినట్టిదే! ఎట్లో చూతము.

"పుమాన్ రేత స్సించతి యోషితాయాం,
బహ్వీః ప్రజాః పురుషా త్సంప్రసూతాః". 5

పురుషుడు స్త్రీ గర్భమున రేతస్సునుంచును. ఆవల ఆమెనుండి అతనిద్వారా బహుసంతానము కలుగుచున్నది. ఈ మంత్రముచెప్పిన స్త్రీ పురుషులు, మన ఇప్పటి స్త్రీ పురుషులని మాత్రమే అనుకొనగూడదు. వారు జగత్కారణు లైన ప్రకృతి పురుషులు, లేదా గాయత్రీ విశ్వకర్మలు. వారి నుండి కలిగిన ప్రజలే ఆకాశాదిభూతములు, వాటి పరిణామ మైన చరాచరములును. ఇంతటి విశ్వ సంతానమును దృష్టిలో నుంచుకొనియే పైమంత్రవాక్యము ప్రవర్తిల్లినది. ఆమంత్రములోనివారు విశ్వపితలుకాని, సామాన్యపితలుకారు.

పిమ్మటి మంత్రమును ఆ పురుషునినుండి ప్రకృతిద్వారా కలిగిన సృష్టివిశేషములనే ఇట్లు వర్ణించినది.

"తస్మా దృచ, స్సామ, యజూంషి, దీక్షా
యజ్ఞాశ్చ, సర్వే క్రతవో, దక్షిణాశ్చ
సంవత్సరశ్చ, యజమానశ్చ, లోకాః,
సోమో, యత్ర పవతే యత్ర సూర్యః. 6
తస్మాచ్చ, దేవా బహుధా సంప్రసూతాః,
సాధ్యా, మనుష్యాః, పశవో, వయాంసి,
ప్రాణాపానౌ, వ్రీహియవౌ, తపశ్చ,
శ్రద్ధా, సత్యం, బ్రహ్మచర్యం, విధిశ్చ, 7
సప్తప్రాణాః, ప్రభవన్తి తస్మాత్
సప్తార్చిషః, సమిధ, స్సప్తహోమాః,
సప్త ఇమే లోకా, యేషు చరన్తి ప్రాణా,
గుహాశయా నిహితా స్సప్త సప్త. 8
అత స్సముద్రా, గిరయశ్చ సర్వే,
అస్మాత్ స్యందంతే, సింధవ స్సర్వరూపాః।,
అతశ్చ సర్వా ఓషధయో రసాశ్చ,
యేనైష భూతై స్తిష్ఠతే హ్యన్తరాత్మా. 9
పురుష ఏవేదం విశ్వం కర్మ,
తపో బ్రహ్మ పరామృతం, ఏత ద్యో వేద,
నిహితం గుహాయాం। సోఽవిద్యాగ్రంథిం
వికిరతీహ సోమ్య" 10

తా॥ ఆ అక్షర పురుషుడగు విశ్వకర్మ నుండియే ఋక్కులు, సామములు, యజుస్సులు, దీక్షలు, యజ్ఞములు, ఎల్లక్రతువులు, దక్షిణలు, సంవత్సరము, కర్మాధికారియైన యజమానుడు, ఆయజమానులుండు లోకములు, సోముడు, సూర్యుడు, ఇంద్రాదిదేవతలు, సాధ్యులు, మనుష్యులు, పశువులు, పక్షులు, ప్రాణాపానములు, వ్రీహియవధాన్యములు, తపస్సు, శ్రద్ధ, సత్యము, బ్రహ్మచర్యము, విధి అను నవి పుట్టినవి. అంతేకాదు. దానినుండియే సప్తప్రాణములు, సప్తకిరణములు, లేదా అగ్నియొక్క సప్తజిహ్వలు, ఆధారాది సప్తచక్రములు, సప్తసమిధలు, హోమములు, భూర్భువరాది సప్తలోకములు కలిగినవి. అంతేకాదు, ఆ విశ్వకర్మనుండియే సముద్రములు, గిరులు, నానావిధనదీనదములు, ఓషధులు, ఆయురుచులు కలిగినవి. ఈ మంత్రము పురుషునినుండి నదీనదసముద్రములు కలిగినవని చెప్పగా యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తము.

"సముద్రాయ వయునాయ సింధూనాం పతయే నమః,
నదీనాం సర్వాసాం పిత్రే జుహూతా విశ్వకర్మణే
విశ్వాహా మర్త్యం హవిః."

సముద్రములకు నదీనదములకు తండ్రియు సృష్టి కర్తయు విశ్వకర్మయే అనిచెప్పి పురుషవిశ్వకర్మల ఐక్యమును చాటినది. ఇంకను చివరికు-

"పురుష ఏవేదం విశ్వం కర్మ తపోబ్రహ్మ పరామృతమ్"

అని ఆ పురుషుడే ఈ విశ్వమంతయు అనియు, అట్టిపురుషుడు విశ్వముయొక్క, కర్మయొక్క స్వరూపమేఅని పలికి, పురుష విశ్వకర్మల సమైక్యమును లెస్సగా నిరూపించినది. "విశ్వం కర్మ" అనునవి వ్యస్తపదములు. 'విశ్వం'లోని బిందువు (సున్న)ను తొలగించినచో, అది విశ్వకర్మఅయి పరాత్పర పురుషుడును విశ్వకర్మయు ఒక్కటేకాగలరు. ఆ తత్త్వము పరమును, అమృతమును కూడఅయినది. అట్టి పరమపురుష విశ్వకర్మ తత్త్వమును హృదయగుహాలోనున్నదాని నెఱింగిన యోగి అవిద్యనుదాటి అమృతుడగునని, ఉపనిషత్తు మూలతత్త్వమునుండి కలిగిన సృష్టివిస్తరమును వర్ణించి, దాని తత్త్వమునెఱింగి అందు తగుల్కొనక, దానికి అధిపతివి కమ్మని సాధకుని హెచ్చరించుచున్నది. వేదోపనిషత్తుల యందు పరతత్త్వమును, జగత్తత్త్వమును ఇంత రహస్యము గాను, సూక్ష్మముగాను వర్ణింపబడి వ్యాఖ్యానము నపేక్షించుచు ఉండును. అట్టిదానిని తపస్సులేక తెలిసికొనుట కెవరికిని సాధ్యముకాదు.

ఇచ్చట ఇంకొక రహస్యమును పాఠకులు గమనించ వలసి యున్నది. నాసదీయసూక్తము సృష్టికిముందు సద సత్తులుగానట్టియు, తదితరమేమియు లేనట్టియు ఒకానొక అనిర్వచనీయ వస్తువున్నదనిచెప్పి, దానిని "....తదేకం, తస్మాద్ధాన్య న్న పరః కించనాస" (10-129-2) ఆ ఒక్కటి తప్ప దానికిపరమైనదేదియు లేదని దృఢముగానే పలికినది.

తరువాత తోచిన తత్త్వమును - "తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే" అని దానిని తమశ్శబ్దముచే పేర్కొన్నది. దానినే ప్రకృతి, అవ్యక్తము, లేక మాయాశక్తి, ఆత్మశక్తి, బ్రహ్మచ్ఛాయ - ఇత్యాది పదములతో మనము పేర్కొనుచున్నాము. తరువాత సలిలము, కామము (కామ స్తదగ్రే సమవర్తతాధి) మనస్సు, రేతస్సు-ఇత్యాదులను గూర్చి వచించినది. పిమ్మట విశ్వకర్మ సూక్తమున, ఆ దివ్యశక్తికి విశ్వకర్మఅని దేవతానామమునుంచి, ఆతడే ద్యావాపృథువులతో గూడిన సృష్టినిచేసిన సృష్టికర్తయని ఋగ్వేదము పేర్కొన్నది. పిమ్మట పురుషసూక్తము దానినిపురుషశబ్దముచే పేర్కొని ఆ పురుషునియొక్క ఒక్కపాదమైన సృష్టినిగూర్చి సవితాత్మకముగా వర్ణించినది. సృష్టినంతటిని యజ్ఞముతో పోల్చి ఆ యజ్ఞమునుండియే అన్నియు కలిగినవనువర్ణనమును మనము గమనింతుము.

ఏ మూలకారణ వస్తువునుండి విశ్వములు ఉదయించి మఱల ఏ శక్తిలో లీనమగునో, విశ్వకర్మ సూక్తము ఇట్లు చెప్పినది. "య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా న్యసీదత్ పితా నః" ఏ విశ్వకర్మచేత విశ్వ భువన సృష్టి జరిగినదో, ఆ విశ్వకర్మలోనికే మఱల విశ్వభువనములు పోవుచున్నవని పై మంత్ర వాక్యమునకు భావము. ఈ విషయమునే విశ్వకర్మ సూక్తములోని మఱొక వాక్యము "యో దేవానాం నామధా ఏకఏవ తం సంప్రశ్నం భువనా

యన్త్యన్యా" ఆతనిలోనికే భువనములన్నియు పోవుచున్నవని చెప్పినది. ఇది మన అనుభవమును బట్టి చూచినను సత్యమే. ఎట్లన, మట్టినుండి కలిగిన కుండ, చట్టి, బాన, మూకుడు, ప్రమిద మొదలగు మృద్వికారములన్నియు కడకు అందులోనే కలియుచున్నవి. బంగారుతో చేయబడిన నగలన్నియు కడకు బంగారములోనే లీనమగుచున్నవి. కాన సదసదతీత తత్త్వమునుండి వచ్చిన జగము చివరకు దానిలోనే లీనమై తుదకు సదసదతీత తత్త్వమే మిగులుచున్నది. ఈ ఋఙ్మంత్రములను వివరించుటకోసమై పుట్టిన ఉపనిషత్తులు కూడ జగమెట్లు మూలకారణమునుండి వెలువడి తుదికందే కలసిపోవునో చెప్పినవి. ముండకోపనిషత్తు ఈ అంశమును చక్కని ఉపమానముతో వర్ణించినది చూడుడు.

"యథోర్ణనాభిః సృజతే గృహ్ణాతే చ,
యథా పృథివ్యా మోషధయ స్సంభవన్తి
యథా సతః పురుషా త్కేశ లోమాని
తథాక్షరా త్సంభవతీహ విశ్వమ్." 1-1-7

సాలెపురుగు తననుండియే దారములను వెలువరించి గూడునల్లి, దానిని మరల తనలోనే లీనము చేసికొన్నట్లు ఎన్నో ఓషధులు భూమినుండియే పుట్టి తుదకు అందే కలసిపోవునట్లు అక్షరమునుండి కలిగన విశ్వములు కడకు అందులోనే కలసిపోవుచున్నవని భావము. ఇంకొక ఉపమానము- జీవించియున్న పురుషునినుండి వెంట్రుకలు, గోళ్ళు కలిగినట్లు

విశ్వము అక్షరమునుండి కలుగుచున్నదట. గోళ్ళకుగాని, వెంట్రుకలకుగాని ప్రాణములేదు. వాటిని త్రుంచినను, ఖండించినను నొప్పియుండదు. అట్లయినను ప్రాణముకలవాటి వలెనే అవి పెరుగుచున్నవి. కనుక అక్షరమునుండి అక్షర రూపములూకలుగుచున్నవి, జడములునుకలుగుచున్నవి. ఇది గొప్ప శాస్త్రీయాంశము కదా! ఈ సందర్భమున శ్వేతాశ్వత రోపనిషన్మంత్రము నొకదానిని గూడ చూతముగాక.

"యస్తూర్ణనాభ ఇవ తంతుభిః ప్రధానజైః
స్వభావతః, దేవ ఏకః స్వ మావృణోతి,
స నో దధాతు బ్రహ్మావ్యయమ్." 6-10

తా॥ ఒకే ఒక్కడైన యే దేవుడు (ఆత్మ) స్వభావ సిద్ధముగా ప్రధానమునుండి కలిగిన దారముల చేత సాలె పురుగువలె, తనను తానే ఆవరించి బంధించు కొను చున్నాడు. అట్టి పరమాత్మ మనకు అవ్యయ బ్రహ్మస్థితిని చేకూర్చుగాక! ఈ మంత్రము "స ఆశిషా ద్రవిణమిచ్ఛ మానః ప్రథమచ్ఛద వరానావివేశ" అన్నఋగ్వాక్యమునకు వ్యాఖ్యానమేకాని ఇతరముకాదు. ఈ విషయమునే పిమ్మట శ్వేతాశ్వతర మంత్రము కూడ బలపఱుచుచున్నది.

"ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ
స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా,
కర్మాధ్యక్షః స్సర్వభూతాధివాసః,
సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ." 6-11

తా॥ ఒకే ఒక దేవుడు(పరమాత్మ)ఎల్లభూతములందు గూఢముగానున్నాడు. అతడే అంతట వ్యాపించి యున్నాడు. అన్నిభూతములకు అంతరాత్మయైయున్నాడు. అతడే కర్మాధ్యక్షుడు, సర్వ భూతములకు నివాసము ఆధారము. ఇంతయేల, ఆతడేసాక్షి, చేతనుడు, కేవలుడు. త్రిగుణసంగము లేని నిర్గుణుడును. ఇట్టి అనిర్వచనీయ శక్తినుండి సరూపము, విరూపము అయిన సృష్టి కలిగి అందే లీనమగుటలో వైపరీత్యమేమియు లేదు. ఈ భావమునే భాగవతములోని దిగువ పద్యమిట్లు చెప్పినది.

క. ఒకపరి జగముల వెలికిని
నొకపరి లోపలికిఁ గొనుచు నుభయము తానై
సకలార్థ సాక్షియగు న
య్యకలంకుని నాత్మమయుని నర్థిఁ దలంతున్.

- జ్ఞేయ వస్తువు -

తెలియదగిన దేది! అను విషయమునుగూర్చి వేదముల అభిప్రాయమును ఆరయవలసియున్నది. ఋగ్వేదములో విశ్వోత్పత్తి ప్రకారమును వర్ణించు సూక్తములు 1. నాసదీయ సూక్తము. (ఋ 10-129) 2. విశ్వకర్మ సూక్తములు (ఋ 10-81-82) 3. పురుష సూక్తము. (ఋ 10-90) 4. హిరణ్యగర్భ, త్వష్ట్ర సూక్తములు (10-121, 3-55)

6. మోక్ష సూక్తము - ఇవియేగాక మఱికొన్ని రుద్ర, విష్ణు మంత్రములును పరిశీలింప దగినట్టివి. వీటినిగూర్చి 'ఏకం సత్' అనెడు ఋగ్వేదదిగ్దర్శన ప్రథమభాగమున కొంతచర్చ కొనసాగింపబడినది. అయినను ఋగ్వేదరహస్యాలు అనెడి ఈ భాగమున ఇంకనులోతుగను, ఉన్నతముగను విస్తృతముగను పరిశోధించి తేల్చవలసినవిశేషములు అనేకములున్నవి. వాటిలో తెలియదగిన (జ్ఞేయ) వస్తువేది, అనునంశము అతి ముఖ్యమైనది. ఏలయనిన, ఎద్దానిని తెలిసిన ఇక ఆవల తెలియదగినది ఉండదో, సర్వసందేహములు, భయములు ఎద్దాని తెలివిచేతతీరునో, దేని తెలివి సమస్తవిశేషవిజ్ఞానమునకు మూలమో దానిని తెలిసికొనుట ప్రతిమానవునికి కర్తవ్యము కదా! అందుచేత ప్రధానముగా జ్ఞేయవస్తువిచారణ మనకు కర్తవ్యమగు చున్నది. ఈ జ్ఞేయవస్తువును గూర్చి ఋగ్వేదాదులు ఏమను చున్నవో పరిశీలించి చూతము.

దీనినిగూర్చి విశ్వకర్మసూక్త మంత్రమొకటి ఇట్లను చున్నది. "న తం విదాథ, య ఇమా జజాన"(ఋ 10-82-7) ఓ మానవులారా! ఏదివ్యశక్తి (ఏ విశ్వకర్మ) ఈ జగములను సృష్టించెనో, అట్టిదానిని (విశ్వకర్మను)మీరెఱుంగకున్నారు. -అని దీనిభావము. ఈ వాక్యమునే యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తము ఇట్లన్నది. "న తం విదాథ య ఇదం జజాన" (5వ మంత్రము) ఈ జగమునుసృష్టించిన విశ్వకర్మను మీ

రెఱుంగరనియే దీని భావమును. అనగా విశ్వములు వెలువడుటకు, లేదా వికసించుటకు హేతువయిన పరమమూలకారణ తత్త్వమును ఎఱుంగకున్నారనియేగదా భావము. ఏలన, ఎప్పుడును కారణవిజ్ఞానము సందేహములను పోగొట్టునుకాని, కార్యవిజ్ఞానము సంశయములను పోగొట్టజాలదు. కార్యకారణములయొక్క సమగ్రజ్ఞానము కలిగినప్పుడే మానవుడు భయ సందేహ విభ్రమములనుండి ముక్తుడగుచున్నాడు. కనుక నరునకు ఏలోపమూలేని సమగ్రమైన కార్యకారణజ్ఞానము కావలసియున్నదని ఈ మంత్రము స్పష్టీకరించుచున్నది. "న తం విదాథ" అను మంత్రభావమును శ్వేతాశ్వతరోపనిషత్తు ఇంకొకరీతిగా పలికినది-

"అపాణిపాదో జవనో గ్రహీతా
పశ్యత్యచక్షు స్స శృణోత్యకర్ణః,
న వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
త మాహు రగ్ర్యం పురుషం మహాంతం." **3-19**

తా॥ ఆవిశ్వకారణునకు కాలుసేతులులేవు. అయినను అతడు తొందఱగానడువగలడు. అన్నింటిని పట్టుకొనగలడు. వానికి కన్నులు, చెవులులేవు. అయినను చూడగలడు, వినగలడు. ఇంతయేల తెలియదగినదాని నంతటిని ఆతడు తెలిసికొనును. కాని అతని నెఱుంగువాడు మాత్రములేడు. అనగా అతని విశ్వస్వరూపమును సంపూర్ణముగా నెఱుంగువాడు లేడని భావము. అంశరూపమున నెఱింగినవారు ఉండ

వచ్చును. అట్టి మహాపురుషునే మొట్టమొదటి వానినిగాను, మహాత్మునిగాను చెప్పుచున్నారు. ఈ మంత్రమున "న చ తస్యాస్తి వేత్తా" అన్నమాట "నతం విదాథ" అనెడి పై వేదవాక్యానుసారము వెలువడినదే అని గ్రహింపవలయును. విశ్వకర్మ సూక్త, శ్వేతాశ్వతర మంత్రములు ఇట్లు మానవులు జగత్కారణ విశ్వకర్మ నెఱుంగకున్నారని, పలుకగా, పురుష సూక్తము ఏమనుచున్నదో ఆలకింతము. పురుష సూక్తము ఋగ్వేద దశమ మండలమున తొంబదవ సూక్తముగా నున్నది. అందు 16 మంత్రములలో 64 పాదములలో సృష్టిస్వరూప తత్త్వములు వివరింపబడగా, అదే పురుష సూక్తము యజురారణ్యకమున, 99 పాదములతో విశ్వకర్మ తత్త్వమును వివరించినది. అందు వివరింపబడిన జగత్కారణ వస్తువుగూడ మొదట పురుషశబ్దముతో పేర్కొనబడినను చివరకు "అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణ స్సమవర్తతాధి" అని విశ్వకర్మగానే పేర్కొనబడినది.విశ్వమునకు సంబంధించిన సృష్టి, స్థితి, లయాదులైన సమస్తకర్మలు గలడి కావున జగత్కారణమును విశ్వకర్ముడని పేర్కొనుట వేదఋషులకు అత్యంతము ఇష్టము. ఇట్లనుటచేత ఇతర పదములచే పేర్కొనలేదని భావముకాదు. ఆ జగత్కారణమును విశ్వకర్మపదముచేతనే పేర్కొనుట సమంజసమును, సంపూర్ణార్థప్రదమును, సార్థకమును,కాగలదు.ఇట్టి యజురారణ్యక పురుషసూక్తములోని దిగువ మంత్రము ఏమనుచున్నదో చూతము-

"వేదాహ మేతం పురుషం మహాంతం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్,
త మేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ".

తా॥ పురుషసూక్తములో వర్ణింపబడిన "జగత్కారణ మహాపురుషుని—చీకట్లకవ్వల వెలుగు ఆదిత్యవర్ణుని నే నెఱుంగుదును. అతనిని ఈ రీతిగా నెఱింగినవాడే మృత్యురూప సంసారమునుండి విడివడి అమృతుడు కాగలడు. గమ్యమును చేరుటకు ఇంతకంటెను వేఱుమార్గము లేదు. దీనిని బట్టి జగత్కారణ వస్తుజ్ఞానము సర్వులకు ఆవశ్యకమని తెలుచున్నది. విశ్వకర్మసూక్తము, జగత్తులను సృష్టించిన విశ్వకర్మనామక జగత్కారణమును మీ రెఱుంగకున్నారని అనగా, పురుషసూక్తమంత్రము ఆతని నెఱింగిననే జీవులకు—అమృతత్వసిద్ధి. గమ్యమును చేరుటకు ఇంతకంటె గత్యంతరము లేదు - అన్నది. కాగా, పరమాత్మ జ్ఞానమనునది జీవులకత్యవసరమని తేలినదికదా! ఈ భావమునే పురుషసూక్తము రెండవసారికూడ ఇట్లు పలికినది.

"త మేవం విద్వా నమృత ఇహ భవతి,
నాన్యః పంథా అయనాయ విద్యతే".

రెంటిభావము ఒకటే అయినను రెండవసారి శ్రుతిమాత పునరుక్తిగా ఏలచెప్పెననగా, "ద్విర్బద్ధం సుబద్ధం భవతి" అనెడిన్యాయము ప్రకారము రెండుసార్లు చెప్పినది

నిర్బాధమైన సత్యమని తెలియచేయుటకే- అనిపాఠకులు గుర్తించ వలయును. ఒకటికి రెండు మూడుసార్లు చెప్పి మున్మాటికీసత్యమనుట వ్యవహారములోకూడ ఉన్నదిగదా!

విశ్వకర్మసూక్తము జగత్కారణ పరమతత్త్వమును మానవులెఱుంగకున్నారని అనగా, దానికి పూరణముగా పురుషసూక్తము ఆతని (దాని) నెఱింగిననేకాని జన్మమృత్యు రాహిత్యరూప అమృతస్థితికలుగదని చెప్పినది. అంతటితో నూరకుండక ఇంకను ఇట్టి అమృతత్వమునకు ఆజగత్కర్తయే ప్రభువనియు, అనగా మోక్ష ప్రదాత అనియు "ఉతామృతత్వస్యేశానః" (పు. సూ. రెండవ మంత్రము) భూత భవ్య స్వరూపుడయిన ఆ పురుషుడే అమృతత్వము నిచ్చు ప్రభువు, అనగా మోక్షరూపుడేఅనియు- అన్నది. ఈవిశ్వోత్పత్తిసూక్తములకు గల సంబంధము ఈ విధమయినదే. దీనిని తెలిసికొని మఱీ పాఠకులు వీటి అర్థ రహస్యములను భావింపవలసి యున్నది.

దీనినిబట్టి జగత్కారణము లేదా జగత్కర్త జ్ఞేయమనియు, ఆ జ్ఞేయము నెఱుంగుటచేత కలుగునది అమృతత్వమనియు తెలియుచున్నది. ఇట్టి వేద మార్గమునే అనుసరించిన భగవద్గీత కూడ ఈ భావమునే అనువదించినది.

"జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి
యద్ జ్ఞాత్వామృతమశ్నుతే,

అనాదిమ త్పరం బ్రహ్మ
న స త్తన్నాస దుచ్యతే" -13-12

తా॥ జ్ఞేయ వస్తువేది కలదో, దానిని గూర్చి చెప్పు చున్నాను. దాని నెఱుంగుటచేత నీవు అమృతుడవుకాగలవు అన్నది. కనుక జ్ఞేయ వస్తు జ్ఞానము అమృత ప్రదమని తేలు చున్నది. ఇట్టి అమృతస్థితియే ఉపనిషత్తుల లక్ష్యము కూడ అని "అమృతత్వస్య తు నాశాస్తి విత్తేన" (బృహదా రణ్యకం) ఇత్యాది మంత్రములు వాకొనుచున్నవి. మృత్యు వును దాటుట అమృతత్వమునకు అర్థమయినను, మృత్యు భయమును దాటి, తాను సర్వదా అమృత స్వరూపుడే అనుజ్ఞానమును పడయుటయే అమృతత్వము యొక్క పరమ తాత్పర్యము.

పురుష, విశ్వకర్మ సూక్తములయందు వర్ణింపబడిన తత్త్వము ఒక్కటే యనుటకును, పురుష, విశ్వకర్మలు ఏకమే అనుటకును వాటి మంత్రములలో మనకు అనేక దృష్టాంతము లగపడును. ఇప్పుడు చెప్పుకొన్న "న తం విదాథ య ఇమా జజాన" "త మేవం విద్వా నమృత ఇహ భవతి "అన్న వాక్యములే కాక, పురుష సూక్తపు మూడవ మంత్రము నందలి" ఏతావా నస్య మహిమా, అతో జ్యాయాం శ్చ పూరుషః" భూత, భవిష్య, ద్వర్తమాన రూపమయిన జగమంతయు ఆతని మహిమయే. కాగా ఆతడు మాత్రము దీని (ఈ జగము) కంటెను జ్యాయాన్" గొప్ప

వాడు. విలక్షణుడు గూడ అన్నమాట. జగము కార్యము కాగా, ఆతడు కారణ స్వరూపుడు. ఈ జగద్విలక్షణమైన గొప్పదనము, విశ్వకర్మ సూక్తమునుండియే పురుష సూక్తము లోనికి వచ్చినది. విశ్వకర్మసూక్తవర్ణన ఇది.

"పరో దివా పర ఏనా పృథివ్యా,
పరో దేవేభి రసురై ర్యద స్తి." ఋ-10-82.5

ఆ విశ్వకర్మ తత్త్వము దివముకంటెను, ఈ భూమి కంటెను, దేవాసురులకంటెను, పరమైనది. పురుషసూక్తము జ్యాయాన్ అనగా విశ్వకర్మ సూక్తము పరము, అన్నది-అనగా శ్రేష్ఠము, అవతలిది అని అర్థము. అది జగద్రూపమయినను, ఆ జగత్తునకు విలక్షణము, శ్రేష్ఠము అయినదన్నమాట. అందుకే దీని నెఱుంగుటతో బాటు, దాని నెఱింగిననేకాని అమృతత్వము కలుగదట. జగమును అందఱెఱుంగుదురు. అనుభవింతురు. దాని కారణము మాత్రము సర్వ శ్రేష్ఠము కాన, ఎవరో ఒకరు మాత్రమే దాని ననుభవించి అమృతు లగుదురనుట ఇచ్చట రహస్యము. "కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దావృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్" అని గదా ఉపనిషత్తు. కావున ఏ ఒకానొకడో మాత్రమే దానిని పొంది తన్మయుడగును.

ఇట్టి జగత్కారణము తెలియదగిన జ్ఞేయమని చెప్పిన ఋగ్వేదము- దాని స్వరూపమును, ఆదియందు దాని స్థితిని

ఎట్లు వర్ణించినదో మనము నాసదీయ సూక్త మంత్రములను బట్టి తెలిసికొనగలము.

## నాసదీయ సూక్తము

ఋగ్వేదములోని రహస్యములలోని కెల్లను పరమ రహస్యమయినది నాసదీయ సూక్తము. ఇందు ఏడు మంత్రములు కలవు. దీనికి ద్రష్ట పరమేష్ఠిగా ప్రసిద్ధుడయిన ప్రజాపతియని చెప్పబడినది. ప్రజాపతి, పరమేష్ఠి, విశ్వకర్మ పదములు ఒకే వస్తువుయొక్క భిన్న నామములని, మూర్తులని సాయణుల భావము. విశ్వకర్మ సూక్త ద్రష్ట భావన విశ్వకర్మయని అనుచున్నారు. అతడేకాని, లేక ఆతని తుల్యుడే కాని, ఈ ప్రజాపతి కావచ్చును. సృష్టికి ఆద్య పురుషుడే ఈతడని భావించుటలో అనుచితమేమియు లేదు. వేద మంతయు పరమేశ్వరుని నిఃశ్వాసమనియేకదా మనవారి భావము. ఈ సూక్తమునందు విశ్వోత్పత్తి కారణమును, ప్రకారమును, జీవులు పొందవలసిన గమ్యమును, అతి నిగూఢముగాను, సత్య సమ్మతముగాను ఇందలి మంత్రములు సూచించుచున్నవి. ఆ సత్యమును ఋతమని కూడ ఋషులు కొన్ని మంత్రములలో పేర్కొనియున్నారు. ఆ యంశములనే ఇచ్చట అవకాశానుసారము పరిశీలించి చూతము. స్థూలముగా చూచినచో, నాసదీయ సూక్తమున 7 మంత్రములు మాత్రమే యున్నవి. ఇక విశ్వకర్మ సూక్తములు 10వ మండలమున 81-82 సంఖ్యలుగలవి. వాటిలోను

ఒక్కొక్కసూక్తమున ఏడేసి మంత్రములేయున్నవి. నాసదీయ, విశ్వకర్మసూక్తములు మూడును- సృష్టి కారణమును, సృష్టి స్వరూప తత్త్వములను ప్రవచించునట్టివే. మూటి అంత స్స్వరూపమును ఒకేరీతిగానుండుటను మనము గమనించ గలము. నాసదీయసూక్తము సృష్టికారణమును సదసద్విల క్షణమనిచెప్పి దానికేపేరునుపెట్టలేదు. కాగా విశ్వకర్మ సూక్తములు ఆ జగత్కారణ వస్తువునకు విశ్వకర్మనామము సముచితమన్నవి. ఇందలి సప్తమంత్రసంఖ్యకూడ సప్తవ్యా హృతులకు, సప్తలోకములకు, సప్తచక్రములకూ సూచకమై పిండబ్రహ్మాండ తత్త్వములనే చాటుచున్నది. కావున నాస దీయ విశ్వకర్మ సూక్తముల ద్రష్టలు అభేదరూపులుగాని ఒక్కరేగాని కావచ్చునని తోచుచున్నది. వీరొక్కరైనను, ఇద్దరైనను మనకందలి తత్త్వార్థమే ముఖ్యము.

ఋగ్వేదీయ పురుషసూక్తములో 16 మంత్రాలున్నవి. కాగా యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తములు రెంటిలోను 16 మంత్రములున్నవి. 17 వదిగా "సముద్రాయ" అను మంత్రముగలదు. ఈ 16 సంఖ్యకూడ పురుష విశ్వకర్మ సూక్తముల సాదృశ్యమునకు నిదర్శనమే. నాసదీయసూక్తము నందు స్తుతింపబడినదేవత జగత్కారణ పరమాత్మఅని యాస్క, సాయణాదులభావము. అందలిమొదటి మంత్రమిది.

"నా స దాసీ న్నో స దాసీ త్తదానీం

నాసీ ద్రజో నో వ్యోమాపరో యత్
కి మావరీవః కుహ కస్య శర్మ
న్నంభః కి మాసీ ద్గహనం గభీరమ్".

-ఋ - **10-129.1**

**తా॥** ఈ మంత్రము సృష్టి వెలువడుటకుపూర్వము ఏది యేది లేదో చెప్పుచున్నది. ఒకవిధముగా అప్పుడున్న దానిని, వ్యతిరేఖముగా వర్ణించుచున్నదనవచ్చును. దీనినే నేతి, నేతివాక్యములచే తత్త్వమును నిర్దేశించుటఅని శాస్త్ర పరిభాషలో చెప్పినారు. సామాన్యులు దీనిని డొంకతిరుగుడు మార్గమందురు. అప్పుడు సత్తుకాని, అసత్తుకాని లేదు. అప్పటిస్థితి సదసత్తులకు అతీతమై అనిర్వచనీయమైన దన్న మాట. అనగా అది చెప్పనూ, చూపనూ, ఆలోచింపనూ వీలుకానిస్థితిఅన్నమాట. అనగా ఆస్థితిని, సాధకులు అనుభ వింపలేరా, అని ప్రశ్నరావచ్చును. ఏల అనుభవింపలేరు ? కొందఱు సాధకులుమాత్రము అనుభవింతురు. వారే ధీరులు. అందుకే "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" ఆ తత్త్వము మాటలకు మనస్సునకు అందనట్టిది-అని చెప్పినది. ఇంకనూ "ఆనందం బ్రహ్మణో విద్వా న్న బిభేతి కదాచనేతి" అనికూడ అన్నది. అనగా అది కేవలము బ్రహ్మానందమనియు దాని నెఱింగినచో ఇక భయము ఉండ దనియు ఉపనిషత్తుల వర్ణన.

ధీరులైనసాధకులు, ఆ స్థితిని, సమాధి సమయమున

కొంతవఱకు పొందుదురు. వారుపొందెడి సమాధికంటెను, అతీతమయిన మహాతురీయాతీతమే అది. అప్పటికి అందు జగద్బీజము అంకురింపనేలేదా? అయిన దానియందది ఉన్నదా? ఏమో చెప్పలేము. పిమ్మట వ్యక్తమగుచున్నది కాన, ఉన్నదనుకొనక తీరదు. అందుకే అది అవ్యక్తము జగత్తు దానియందు వ్యక్తముకానిస్థితి. ఏకైకతత్త్వము మాత్రమే ఉన్నస్థితి. దీనిని సాధకులు జాగ్రత్తును, స్వప్నమును, సుషుప్తిని దాటి సమాధినిపొంది రుచిచూచుచున్నారు. ఆవల నాల్గవదైన ఆ సమాధినిగూడ దాటి తురీయాతీతము అగుచున్నారు. ఈ స్థితినే "త మేవ చాద్యం పురుషం ప్రపద్యే" అని గీతయు, "త మేవం విద్వా నమృత ఇహాభవతి" అని పురుషసూక్తమును అన్నవి. కాన ఈ స్థితి అగమ్యము-అనగా పొందరానిది ఏమాత్రమునుకాదు. తానే, అయ్యును తన్ను దానిగా తెలిసికొనలేని స్థితి అది. దీనినే సద్గురుమూర్తి "తత్, త్వం, అసి" అనెడిమహావాక్యముచేత బోధించుచున్నాడు. శిష్యుడు "అహం, బ్రహ్మ, అస్మి" అని అనుభూతివిపొందుచున్నాడు. ఈ స్థితిని గీత "తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే త దనంతరమ్" అన్నది. నన్ను తత్త్వములతోపాటు తెలిసికొని నాలోప్రవేశించుట, నాలో కలసిపోవుట, నేనేఅగుట-అనిదీని భావము. ఇది విశ్వవికాసమునకు కారణమయిన మూలతత్త్వముకాన, దీనిని విశ్వకర్మ అన్నపదముతో విశ్వకర్మ సూక్తము పేర్కొన్నది. అట్టి

దాని నుండియే ద్యావాపృథువులు వెలసినవన్నది ఈ ద్యావాపృథువులతో గూడిన విశ్వమునకు రెండవదయిన ధాతికమూలబీజమును, అనగా ఉపాదానకారణమును నాస దీయసూక్తము "తమస్సు" అన్నది "తమ ఆసీత్తమసా గూఢ మగ్రే" అని మంత్రవాక్యము. సదసదతీత తత్త్వమునందు తమస్సని చెప్పదగినమాయ, లేక మూలప్రకృతి తోచినది. దానిని ప్రధానమని, అవ్యక్తమనికూడ అన్నారు. ఇది సదసదతీత తత్త్వమునుండి అవిభాజ్యము. అందే అవ్య క్తముగా నిగూఢము. అందుకే "తమసా గూఢ" మన్నది శ్రుతి. మొదటి విశ్వకర్మతత్త్వము దీనిని తనలో వ్యక్తము కానీయక అనన్యముగా ఇముడ్చుకొన్నది. అందుకనికూడ ఇవి రెండూ అవ్యక్తములైనవి. దీనిని ఆ విశ్వకర్మయొక్క (లేక, మూలవస్తువును బ్రహ్మమని పిలుచుకొన్నచో) జగత్కారణ బ్రహ్మముయొక్క దివ్యశక్తి అనవచ్చును. కాగా, అప్పుడది బ్రహ్మశక్తి, చిచ్ఛక్తి కాగలదు. ఆ మాయా శక్తి గాయత్రీస్వరూపము. అది విశ్వకర్మలో అవిభాజ్య ముగా అనన్యముగా సంలీనము. నాటిద్విశ్వకర్మయే అన్నను దోషములేదు. అందుకే గాయత్రీవిశ్వకర్మలు అభేదస్వరూపులు. ఒకరిని చూచినచో, ఇంకొకరిని చూచి నట్లే అనుభూతికలుగును. ఒకరు విశ్వరూపముకాగా, ఇంకొకరు విశ్వకారణస్వరూపము.. విశ్వమునకు విశ్వకర్మకు అభేదమే. కావుననే విశ్వకర్మగా (భగవంతునిగా) ఉపాసింపు

డని సాధనకాండమనుచున్నది. ఈ (తమోరూప) గాయత్రి నుండి మహదహంకారములు వెలువడినవి. అవికూడ అవ్యక్తములే. అటుతరువాత పంచతత్త్వముల ప్రాదుర్భావము. అవియే పంచతన్మాత్రలు. పంచమహాభూతములు. తొలుత పేర్కొన్న అవ్యక్తములోనే త్రిగుణములున్నవి. కాన పంచతత్త్వములుకూడ త్రిగుణాత్మకములే. ఈ త్రిగుణాత్మక పంచతత్త్వముల సాంకర్యముచేతను, పరిణామము చేతను వెలసినదే బ్రహ్మాండము. పంచతత్త్వములు, పంచ బ్రహ్మలు, పంచమూర్తులు, పంచఋషులు, పంచేంద్రియములు, పంచవిషయములు, జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయ, తురీయాతీతములనెడి పంచావస్థలు, సత్తు, చిత్తు, ఆనందము, నామము, రూపము - అనెడి పంచాంశములుగా వెలసినవి. వాటి సమూహమే ప్రపంచమయినది. ప్రపంచ శబ్దములోని పంచశబ్దము దానినే సూచించుచున్నది. దానికి మించి, ప్రపంచము లేనేలేదు. ఈ రహస్యమును సృష్టికర్త మనశాలు స్వేతులకు అయిదేసి వ్రేళ్ళను నిర్మించి, మనకు సూచించినాడు. మనలను పొరపాటు పడవలదని హెచ్చరించినాడు. ఈ ప్రపంచకార్యములను సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహమును చూపుటకు విశ్వకర్మచే సృజింపబడినవారే పంచబ్రహ్మలుకాని, పంచమూర్తులుకాని. వీరే మను, మయ, త్వష్ట్ర, శిల్పి, (దైవజ్ఞ) విశ్వజ్ఞులు. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యులు. సానగ, సనాతన,

అహాభూన, ప్రత్న, సుపర్ణులు. వీరిని విశ్వకర్మసూక్తము, "త ఆయజంత ద్రవిణం సమస్మా ఋషయః పూర్వే, జరి తారో న భూనా" అన్న మంత్రముచే సూచించినది. అట్లని సప్తఋషులను వదలలేదు. "యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః" అని వారిని- ఆధార, స్వాధిష్ఠ, మణిపూర, అనా హత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములుగా పేర్కొన్నది శ్రుతి మాత. ఆ ఋషులందఱికిని జనకుడు విశ్వకర్మయే అని చెప్పి నది. ఆ పంచబ్రహ్మాది పంచకములు విశ్వకర్మనుండితోంచి నవే. తత్సంతానమే అన్నది శ్రుతి. వసు, రుద్రాదిత్యులు గూడ సూర్య చంద్రులతో పాటు విశ్వకర్మ సంతానమే అని యజుర్వేదమంత్రములు సూచించినవని మనము "యజుర్వేద దర్శనము"న చదివియే యున్నాము.

## బ్రహ్మ, విష్ణు, రుద్రులు

బ్రహ్మ, విష్ణు, రుద్రులు తమస్సు (మూల ప్రకృతి) తోంచిన పిమ్మట కలిగినవారే. ఎట్లన, రజ, స్సత్వ తమస్సు లనెడి మూడు గుణములు అవ్యక్తమని చెప్పబడిన మూల ప్రకృతిలోనివే. ఆ గుణ సంయోగమువలన అందు పర మాత్మ ప్రతిబింబము పడగా ఏర్పడినదే జగమంతయును. దీనిని గీత-

"యావత్సంజాయతే కించిత్ సత్వమ్‌స్థావర జంగమమ్

క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్ తద్విద్ధి భరతర్షభ."
13-26

అన్నది. రజోగుణమువలన,పదార్థములుపుట్టుచున్నవి. సత్వగుణమువలన కొంతకాలముపాటు స్థితిని పొందుచున్నవి. తమో గుణమువలన నశించుచున్నవి. మానవులు కూడ సత్వగుణముచేత జాగ్రత్తును, రజస్సుచేత స్వప్నమును, తమస్సుచేత సుషుప్తిని, శుద్ధసత్వము చేత సమాధిని గుణాతీత తత్వముచేత తురీయాతీతమును పొందుచున్నారు. కావున సృష్టిచేయు బ్రహ్మ రజో గుణప్రధానుడు, పాలించెడి విష్ణువు సత్వగుణ ప్రధానుడు, సమయించెడి రుద్రుడు తమో గుణ ప్రధానుడు అగుచున్నాడు. ఈ గుణ సంయోగము వల్లనే వారి కాయా శక్తులు, రూపములు ఏర్పడుచున్నవి. కావున మాయాశక్తి తోచకముందు త్రిగుణములే ఉండుటకు వీలులేదు. త్రిగుణములు లేనప్పుడు దేవ, మానవ, తిర్యగాదులు ఉండవు. కావున మాయాశక్తి ప్రభవించకముందు-తమస్సుపుట్టక పూర్వము విశ్వకర్మ తత్త్వ మొక్కటే ప్రకాశించునుకాని, బ్రహ్మ, విష్ణు రుద్రాదులకు అప్పుడు తావే లేదు. నాసదీయ సూక్తము ఇట్టి ఋతమునే ప్రవచించినది. ఈ భావము నంతటిని రాశిపోసి చూపినట్లు వెలసిన మూల స్తంభమనెడి తాత్త్విక గ్రంథ ప్రథమ శ్లోకము ఏమను చున్నదో చూతము.

"న భూమి ర్న జలం చైవ, న తేజో న చ వాయవః,

న చ బ్రహ్మా, న విష్ణుశ్చ, న రుద్రో, న చ తారకాః,
సర్వశూన్యే విశ్వకర్మా, స్వయంభూ రభవ త్తదా".

ఆకాశాదితత్త్వములు, బ్రహ్మా విష్ణ్వాదులు, ఎవరూ లేనప్పుడు ఉన్నది ఒక్క సదసదతీతతత్త్వమే. అదే జగత్కారణము. అదే నిరాలంబ స్వయంభూ విశ్వకర్మ స్వరూపము. కనుక జగమంతయు-విశ్వమెల్లనూ, అట్టి స్వయంభూ విశ్వకర్మ సంభూతమే కాన, వైశ్వకర్మణమే. స్వాయంభువమే! ఈ స్వయంభూ విశ్వకర్మనుండియే జగములు వచ్చినట్లు, ఆ జగముల కథాక్రమమును వక్కాణించు వేదములు కూడ వచ్చినవి.

"అస్య మహతో భూతస్యనిఃశ్వసితమేతద్యదృగ్వేదో
యజుర్వేద స్సామవేదో హ్యథర్వవేదః."

భగవంతునినుండి వచ్చిన ఇట్టి వేద సూక్తముల ననుసరించియే మన వేద గ్రంథములు కొనసాగుచున్నవి. మధ్యకాలమున ఈ సత్యములకు సరియైన ప్రచారము తగ్గినది. స్వార్థపరుల అపసిద్ధాంతములు పెచ్చు పెరిగి మానవ సమాజమున భేదములను, వైషమ్యములను సృష్టించినవి. ఈ అంశమునే గీతలో కృష్ణుడు "స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప" అన్నాడు. ఆ నష్టయోగము నుద్ధరించుటయే గ్రంథకర్త ఉద్దేశ్యము.

## ఇంకొక రహస్యము

"పాదోఽస్య విశ్వా భూతాని" అన్నప్పుడు జాగ్రదవస్థ సూచింపబడుచున్నది. మానవుడనుభవించు పంచావస్థలలో తురీయాతీతము తురీయములోనే అంతర్భూతము. జాగ్రదవస్థ నిక్కమయిన జగదనుభవము కనుక, ఆ ఒక్క భాగమునందే జీవుడు జగదనుభవమును పొందునది. తక్కిన స్వప్న, సుషుప్తి, సమాధులనెడి మూడు పాదములు జాగ్రత్తునకు పైనుండునవి. జీవి ఏ పరమకారణమునుండి వచ్చెనో, మఱల ఆ పరమకారణమును చేరిననేకాని, అతని ప్రయాణము పూర్తికాదు. అదియే విష్ణుపదము అని వేదమన్నది. "తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః" అన్న మంత్రమున. "త మేవ చాద్యం పురుషం ప్రపద్యే" అని గీత-"త మేవం విద్వానమృత ఇహ భవతి" అని యజురారణ్యకము. కాగా జీవుడు ఏ ఆద్య వస్తువునుండి వచ్చెనో మఱల ఆ ఆద్యవస్తువులోనే లీనమగుట జీవిత గమ్యము దీనిని విశ్వకర్మసూక్తము "తం భువనా యన్త్యన్యా" అన్నదికదా! ఆ జగత్కారణమున భువనములు ప్రవేశించి ధన్యము లగుచున్నవని భావము.

జాగ్రత్ స్వప్నములను ఒక పాదముగా చెప్పుకొని, సుషుప్తి. సమాధి, తురీయా తీతములను మూడుపాదములుగ నయినను చెప్పుకొనవచ్చును. ఇది సమన్వయము కుదురు

టకును, అనుభవమునకు గూడ సరిపోవుచున్నది. జాగ్రత్తు వంటిదే స్వప్నము కూడ కనుకను, రెంటికిని స్థిరము అస్థిరములే భేదము కనుకను అవి రెండును ఒక్క పాదముగా లెక్కింపబడుటయే యుక్తము. ఇక జగదనుభవము లేనట్టి దశలు సుషుప్తి, సమాధి, తురీయాతీతమునే గనుక అవి పురుషునియొక్క త్రిపాద్విభూది వంటివే. సృష్టి కూడ, అనగా జగదనుభవముకూడ సుషుప్తినుండి లేచిన పిమ్మటనే కలుగుచున్నది. కనుక జాగ్రత్స్వప్నాదులు పురుషుని యొక్క చతుష్పాదములని గ్రహించుట ఆధ్యాత్మిక సాధకులకు ముక్తిమార్గ సూచకమే.

ఇక పరమతత్త్వ విషయమునను, ఇట్టి క్రమమునే కాంచగలము. సదసదతీత స్థితి తురీయా తీతము. అందుండి సచ్చిదానందములు తోచుట సమాధిలేక తురీయస్థితి. ఇక సుషుప్తి అజ్ఞాన ప్రధానము కాన, అదియేమో జగత్కారణమయిన తమస్సు (మాయ) తోచినట్టి దశ. ఆవల స్వప్నమంతయు, ఈశ్వరుని జగన్నిర్మాణ సంకల్పమువఱకు గల స్థితి. ఇక జాగ్రత్తు చతుర్థమయిన విశ్వము తోచి అనుభూతమయ్యెడు దశ ఈ రీతిగా సృష్టికార్యము విస్తరించు దశలన్నియు (నాలుగును) మన జీవితమున పరమేశ్వరుడు చూపెట్టియేయున్నాడు. ఈ మొత్తమే పురుషునియొక్క చతుష్పాద్విభూతి యన్నమాట. ఇంతటి విస్తృతార్థము నాసదీయ సూక్తములో గూఢాతిగూఢముగా నెలకొని యున్నది.

దానిని మూలస్తంభశ్లోకము సత్యసమ్మతముగాను, వ్యాఖ్యాన రమ్యముగాను వివరించినది.

ఆ శ్లోకమున బ్రహ్మ, విష్ణు, రుద్రులు లేనప్పుడు విశ్వకర్మ ఒక్కడే ఉన్నాడనుటలోని పరమార్థము ఇది.- బ్రహ్మ, విష్ణు, రుద్రులు, త్రిగుణములయొక్క సంయోగమువలన ఏర్పడిన ప్రత్యేక, ప్రత్యేక శక్తులు. విశ్వకర్మనామక శక్తియే మొ, త్రిగుణరహితమేగాక, సదసత్తులకును అతీతమని నాసదీయసూక్తమే చెప్పినదికదా! రెండవదశలో అది సచ్చిదానందస్వరూపము. దానిని మనము సమాధితో ఉపమించుకొన్నాము. ఇక "తమ ఆసీ త్తమసా గూఢమగ్రే" అన్న తరువాతకాని, మూలప్రకృతి తోచలేదు, అది తోచిననే గాని, అందలి త్రిగుణముల సంపర్కముచే బ్రహ్మ విష్ణు రుద్రాదులు ఏర్పడరు. రజోగుణసంబంధముకలవాడు బ్రహ్మ. తమోగుణ సంపర్కముగలవాడు రుద్రుడు. సత్వగుణ సంయోగకలవాడు విష్ణువు. కాగా గుణరహితమైన జగత్కారణ విశ్వకర్మయందు ఈ త్రిగుణములు వెలసిననేకాని బ్రహ్మ విష్ణు రుద్రులు ప్రకాశింపలేరు. కావుననే మూల స్తంభ శ్లోకము "నచ బ్రహ్మా, న విష్ణుశ్చ, నరుద్రో, న చ తారకాః" అని పరమసత్యమును చెప్పినది. ఆ శ్లోకము నాసదీయసూక్త ప్రథమమంత్రమునకు వ్యాఖ్యావివరణలవంటిది. బ్రహ్మాదులు గుణసంగమున్ననేగాని, సిద్ధింపరు. అట్టి గుణమయప్రకృతినిగూడ తనలో నిముడ్చుకొన్న-అంతర్లీనము

చేసికొన్న జగత్పిత విశ్వకర్మ. (యోనః పితా జనితా యో విధాతా) ఆ గుణమయ ప్రకృతినే మనము గాయత్రి అను చున్నాము. ఈ గాయత్రి ప్రత్యేకవ్యక్తి కాదు. సాక్షాత్తు విశ్వకర్మ స్వరూపిణియే అయి విశ్వకర్మలోనే అంతర్భూత మయినట్టిది. విశ్వకర్మను నిర్గుణబ్రహ్మముగా భావించి నప్పుడు అట్టిశక్తియే గాయత్రి కాగలదు. అందుకే ఆమెను చిచ్ఛక్తి గూడ అన్నారు. ఆ తల్లినుండియే పంచశక్తుల ప్రాదు ర్భావము. అయిన గుణసంగము విశ్వకర్మకులేనట్లైనా, అందు రేమో ఆయన దానికి జనకుడై ప్రకాశించుచున్నాడు. ఈ విషయమునే గీత "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" ఈ దైవమాయ దాటరానిదని భగ వానుడనుట అయినది. గుణములు బ్రహ్మమునుండి పుట్టిన వను టను గీత ఇట్లుచెప్పినది.

"యేచైవ సాత్వికాభావా, రాజసా స్తామ సాశ్చ యే
మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషు, తే మయి." 7-12

కనుక ఆయన గుణసంగము బ్రహ్మాదుల గుణసంగమువంటిది కాదు. దాని నంతర్భుక్తము చేసికొన్న పరమకారణుడు, పరమపిత ఆయన. ఇట్టి రహస్యములనెల్ల తత్త్వసాధకులు లెస్సగా మననముచేసి, సాక్షాత్కారమునకు తెచ్చుకొన్న నే గాని ("త మేవం విద్వాన్") ఆతని నెఱింగినవారు కారు. ఇక మూడవమంత్రమును చూతము.

"తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే

అప్రకేతం సలిలం సర్వమా ఇదం,
తుచ్ఛ్యే నాభ్వపిహితం యదాసీ
త్తపస స్తన్మహినా జాయతైకమ్." 3

సదసదతీతమునుండి కలిగిన వస్తువును ఈ మంత్రము తమస్సు - (అజ్ఞానము)అని అన్నది. దీనినే బ్రహ్మశక్తి, మాయ, మూలప్రకృతి, అవ్యక్తము, ప్రధానము, అవిద్య, ఇత్యాది పదములతో వేదాంతశాస్త్రము పేర్కొన్నది. సృష్టిచక్రము ఆద్యంతములు లేనిది. అదిఎల్లప్పుడును తిరుగుచునే ఉండును. ఏ జీవుడు పరమాత్మ (జగత్కారణ) సాక్షాత్కారము నందునో వానికిమాత్రమే సంసారనివృత్తి అయినట్లు. ఆతనికే ప్రపంచపర్యటనశ్రమ తీరునుకాని, అందఱికిని తీరదు. కనుక జీవులయొక్క పూర్వజన్మకర్మలే జగత్సృష్టికి ఉపాదాన కారణమయిన "తమస్సు"లేక మూల ప్రకృతి అని మనము అనుకొనవలసియున్నది. ఈ తమస్సును విశ్వకర్మసూక్తమేమో "నీహార" (మంచు) మన్నది. "నీహారేణ ప్రావృతాః" నీహారమనగా మంచు. జీవకోటి యంతయు దానిచేత కప్పబడియున్నారు. ఎండ సోకినంత మాత్రాన మంచు కరగిపోవును. వెలుగుతగిలినంతటనే చీకటిమాయమగును. కావున జగత్కారణజ్ఞానమనెడి వెలుగు పడినచాలును. సంసారమనెడిచీకటి పటాపంచలగు నన్నమాట. కనుక ఈ మూడవ మంత్రము జగత్కారణ మయిన మాయను తమస్సు అనెడిమాటచేత పేర్కొన్నది.

దానిని తరువాతి గ్రంథములు, అవిద్యాది పదములచేత పేర్కొన్నవని చెప్పకొనియే యున్నాముకదా!

"తుచ్ఛ్యేనా భ్వ పిహితమ్" అనగా తుచ్ఛమైన మాయచేత పరమాత్మ ఆవరింపబడినదన్నమాట. ఆవరించిన ఆమాయయే పరమాత్మకు, లేక విశ్వకర్మకు శరీరమయినదని మనమెఱుంగవలయును. ఈ మాయ అవ్యక్త, మహ, దహంకార, పంచతన్మాత్ర రూపమై పరమాత్మను ఆవరించినందున దానిని మంత్రము తుచ్ఛశబ్దముచే పేర్కొన్నది. కాగా మాయోపాధికుడైన ఈశ్వరుడు ఏర్పడినాడని భావము. శాస్త్రీయముగా ఆలోచించినచో, పరమాత్మ తత్త్వముమీాద దానిఛాయయే అని చెప్పదగిన-ఒక ఆవరణ మేర్పడినదన్న మాట. ఈ ఆవరణమునందుకూడ పరమాత్మ ప్రతిబింబము ఉండియే ఉన్నది. అనగా పరమాత్మ మీాదనే తోచిన ఆ పరమాత్మప్రతిభాస మయిన మాయయందు ఎల్లయెడల పరమాత్మ నిండియే ఉన్నాడనిభావము. ఈ విషయమును తరువాతి మంత్రివాఙ్మయము, యజురారణ్యకము "అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అని అంతటను పరమాత్మతత్త్వము కలదని పేర్కొన్నది. ఇప్పుడీ మాయారహితబ్రహ్మముకాని, మాయాసహిత బ్రహ్మముకాని, జగత్కారణమే అయినందున, దానిని విశ్వకర్మఅని ఋగ్వేదము పేర్కొనుటలో ఎంతో ఔచిత్యమున్నది. కాగా, నాసదీయసూక్త విచారణానంతరము జరిగిన జగత్సృష్టిరీతిని

విశ్వకర్మసూక్తము ద్వారా మనము తెలిసికొనవలసి యున్నాము. సత్తుఅనికాని, అసత్తుఅనికాని చెప్పవీలుకాని జగత్కారణతత్త్వము విశ్వకర్మ నామముచే పేర్కొనబడి జగత్కారణ మగుచున్నదన్న మాట. ఈ విశ్వకర్మ పురుషుడు కాగా, ఆయన యొక్క ప్రతిభాసమే మాయా స్వరూప గాయత్రి అగుచున్నది. బింబ ప్రతిబింబములకు భేదముండదు కనుక ఈ గాయత్రీ విశ్వకర్మలు అభేదాకారులు, అద్వైత స్వరూపులగుచున్నారు. మన లోకానుభవమునుబట్టి స్త్రీ, పురుష భేదము వారికి ఆరోపించి అర్థముచేసికొని, ఆరాధించుచున్నామేకాని, వారు ఏకైక పరమాద్వైత స్వరూపమే.

విశ్వోత్పత్తి సూక్తముల వరుసలో మొదటిది నాసదీయ సూక్తము. రెండవది విశ్వకర్మ సూక్తము. మూడవది పురుష సూక్తము- అని యెంచి పర్యాలోచనము చేసినచో, మనకు సృష్టితత్త్వము, సృష్టికార స్వరూపము, ప్రపంచ స్వభావము, మన కర్తవ్యము బోధపడగలవు. ఇంతకన్న సుగమ మార్గము తత్త్వజ్ఞానసిద్ధికిలేదు. ఆ వరుస ప్రకారమే ఉపనిషత్తులు ప్రవర్తించినవి. ఈ సూక్తము లందలి ముఖ్యాతి ముఖ్య పరమార్థమునే అవి బ్రహ్మము, సత్తు,చిత్తు,అక్షరము, ఆనందము- ఇత్యాది పదములచే వివరించినవి. ఇప్పుడు ఇక నాల్గవ మంత్రమును చూతము.

"కామ స్తదగ్రే సమవర్తతాధి,
మనసో రేతః ప్రథమం యదాసీత్".(ఋ.10-129-4)

బహు ప్రకారమయిన సృష్టి పుట్టుటకు ముందు, ఈశ్వరునికి సృష్టిచేయవలెననెడి కోరిక గలిగినది. దానినే ఈ మంత్రము కామము (కోరిక) అని పేర్కొన్నది. ఏ మనుజుడు కాని, ఏ పనిని చేయదలచినను, ముందు మనస్సుచే దానిని సంకల్పించును కదా! దేవుడు కూడ సృష్టికి ముందు సృష్టి చేయు నిచ్ఛకలవాడాయెనట. ఈ యంశమునే విశ్వకర్మ సూక్తము "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛద వరా ఆవివేశా" (10-81-1) ఆ విశ్వకర్మ ఆశీస్సుచేత పిండ బ్రహ్మాండములను సృష్టించి, ముందుగా అందు ప్రవేశించెను అన్నది. ఇందలి ఆశీస్సే నాసదీయ సూక్తములోని కామము. కోరికలను సృష్టించునది మనస్సు కావున మంత్రము యొక్క రెండవపాదము, ఆ మనస్సును "మనసో రేతః ప్రథమం యదాసీత్" ఒక ప్రాణి సృష్టికి రేతస్సు (ఇంద్రియము-శుక్రము) కారణమైనట్లు ఈ కామసృష్టికి మనస్సు కారణమని మన మర్థము చేసికొనవలయును. భగవంతుడు సంకల్పము చేయవలెనన్నచో మనకువలె ఆయనకు మనస్సు అక్కఱ లేదు. అయినను మానవ సృష్టి ననుసరించి, ఇక్కడ మనః ప్రశంస చేయబడినది. ఈశ్వరునికి మనః ప్రాణేంద్రియముల అవసరములేదని ఉపనిషత్తు పలికినది.

"అప్రాణో హ్యమనాః శుభ్రో
హ్యక్షరాత్పరతః పరః." (ముండకం 1-2-7)

భగవంతునికి మనః ప్రాణశరీరములు లేవని ఈ

మంత్ర భావము. అయినను, శ్రుతి ఒక్కొక్కచో మనస్సును కూడ ఉన్నట్లు చెప్పకపోలేదు. ఈ విశ్వకర్మ సూక్తమే నాసదీయ సూక్తమువలె "విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సందృక్" (10-82-2) అన్నది. విమనాః=విశేషమయిన సత్యసంకల్పాదులు కలవాడై అని ఋగ్వేదముననూ "విశ్వకర్మా మనసా" అని మనశ్శబ్దముచే యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తమునను పేర్కొన్నది. కనుక మనస్సంసర్గము ఉన్నదన్నను ఆక్షేపింప పనిలేదు. మొదటి మంత్రమునందు "ఆశిషా" అని చెప్పి ఈ మంత్రమున "విమనాః" అని చెప్పినది గదా !

పరమేశ్వరునికి సృష్టి చేయవలెనని, కోరిక కలుగుట దోషము కాదా అని ఇచ్చట ఒక ప్రశ్న పుట్టవచ్చును. ఇది పరమేశ్వరునికి స్వయముగా కలిగిన సంకల్పముకాదు.

సంసారమనుడు, జగమనుడు, ప్రపంచమనుడు- అది అనాది.ఎప్పుడు ప్రారంభమైనదో ఎవరికీ తెలియదన్నమాట. సంసారముయొక్క ఆది తెలియకున్నను, దానికి అంతము మాత్రము లేకపోలేదు. ఆ అంతముకూడ జీవులయొక్క జ్ఞాన సాధనల తారతమ్యములనుబట్టి వారివారికి సంప్రాప్తించు చుండును. ఒకనికి తత్త్వజ్ఞానము కలిగి జగద్రహస్యము గోచరించిన దనుకొనుడు. ఇక ఆతనికి సంసారముతోడీ- అనగా జనన మరణచక్రముతో సంబంధము ఉండదన్న

మాట. అట్టివానినే ముక్తుడందురు. వానికి సంసారము అంతమైనట్లే లెక్క. అతనికి జగద్భ్రాంతులు ఉండవు. వాటిచే ఆతడు బాధపడడు. తక్కినవారికి మాత్రము సంసారము ఉండియే తీరును. అందుకే సంసారమనునది అనాది, స్థానము అని శాస్త్రమును, మహనీయులును చాటుచున్నారు. జగములోని ఏ కొందఱో ముక్తినందినంత మాత్రమున వారికి మాత్రమే సంసార నివృత్తి జరిగినదికాని, ఎల్లరకు జరుగలేదు కదా. తక్కినవారికోసము జగచ్చక్రము తిరుగుచునే, ప్రవర్తించుచునే ఉండును. వారికోసమే ఈశ్వరుడు సృష్టికార్యమునకు పూనుకొనుచుండును. ఇది సర్వతాత్త్వికులును తెలిసికొని యుండవలసిన సృష్టి రహస్యము.

ఈ దృష్టితో చూచినప్పుడు పూర్వకల్పమునందలి జీవుల పుణ్యాపాపకర్మల ఫలములు వారిచే అనుభవింప చేయుటకు సృష్టి అవసరమగుచున్నది. విశ్వసృష్టి జరుగనిది జీవులు ఆ యా సుఖదుఃఖములను అనుభవించుటకు వీలుకాదు. వారికి స్థూలములయిన భోగశరీరములు కావలయును. అవి సంభవించుటకుస్థూలజగములు కావలెను.వాటికోసమేపరమేశ్వరునికి సృష్టీచ్ఛ కలుగుట. ఆయన ఇచ్ఛకు జీవుల పాపపుణ్యరూపకర్మలు కారణము గావున, పరమేశ్వరునికి ఇచ్ఛ కలిగెననికాని, కొందఱికి మంచి, కొందఱికి చెడు చేయుచున్నాడనికాని అనుటకు, అరోపించుటకు వీలులేదు. జీవుల కర్మలే జగత్తుల సృష్టికికాని, వాటి వినాశమునకుగాని బీజ

మని తెలియవలయును. ఈ బీజమును గర్భమనెడి పదము చేత విశ్వకర్మ సూక్తము పేర్కొన్నది. ఎట్లో చూడుడు.

"కిం స్విద్ గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమపశ్యంత విశ్వే." (10-82-5)

ఆ జగద్బీజమును మొదట ఏది భరించెను? అని ప్రశ్న వేసికొని తరువాతి మంత్రముచే సమాధాన మిచ్చుచున్నది వేదమాత-

"త మి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛంత విశ్వే." (10-82-6)

ఇంద్రాది దేవమానవ తిర్యక్ స్థావరములు కూడియున్న ఆ గర్భమును (జగద్బీజమును) మొదట ఉదకములు తమయందు ధరించినవి. జగద్బీజమును కాని, జీవాజీవ బీజముకాని ఎప్పుడైనను జలముల నాశ్రయించియే యుండును. జలము రసస్వరూపముకాన,-ఈశ్వరుడును రసరూపుడేకావున (రసోవై సః = తైత్తిరీయం) అట్టి రసమునందే బీజము నిలిచి యుండును. దీనిని స్థూల జలపక్షమున చెమ్మ అని చెప్ప వచ్చును. సైంటిస్టులు చెప్పెడు క్రోమోజోములు మొదలగునవి ఈ గర్భరూప బీజమునందే నెలకొని యుండును. మనుస్మృతి కూడ "అప ఏవ ససర్జాదౌ తాసు బీజమవాసృజత్" భగవంతుడు మొదటగా నీటినే సృష్టించి దానియందే బీజమును ఉంచినాడని మీది వేదవాక్యమునే అనువదించినది.

సూక్తము. ఆ రెంటిని తులనాత్మకముగ పరిశీలించుటకు ముందు వాటి తాత్పర్యమును సంగ్రహముగా తెలిసికొందము.

## విశ్వకర్మ సూక్తముల భావము

నాసదీయసూక్తము ప్రళయానంతరస్థితిని-అనగా సృష్టికి పూర్వపుదశను వర్ణించినది. ఈ విషయమును మనకు అందలి "నాసదాసీన్నో సదాసీత్తదానీం" అన్న వాక్యములోని "తదానీం" (అప్పుడు)అన్నమాట విశదీకరించుచున్నది. విశ్వకర్మసూక్తమేమో "య ఇమా విశ్వా భువనాని జుహ్వదృషి ర్హోతా న్యసీద త్పితా నః" అని ప్రారంభమగుచున్నది. దీనిభావము - "ఏ విశ్వకర్మ హోమకారుడు హోమము చేయునట్లు, ఈ జగములనన్నిటిని తనలో వ్రేల్చుకొనెనో (జుహ్వత్)"అని. దీనిచేత అప్పుడుజరిగినది ప్రళయమే అగుచున్నదిగదా! కనుక ప్రళయానంతరస్థితినే నాసదీయ, విశ్వకర్మసూక్తములు వర్ణించుట వాటియొక్క సమానత్వమునకు నిదర్శనము. అటుపిమ్మట జరిగినదంతయు సృష్టి ప్రారంభవర్ణనమే. అదిఎట్లో:సూతము. - "స ఆశిషా ద్రవిణమిచ్ఛమానః, ప్రథమచ్ఛదవరా ఆవివేశ" ఆ ప్రళయానంతరతత్త్వము మఱల జగన్నిర్మాణమును జరుపుటకు తండ్రివంటిదని, (పితృస్థానీయము)"నిషసాద పితా నః" అన్నమాట తెలుపుచున్నది. సంతానమున్ననేకాని ఏవ్యక్తికాని తండ్రికాడు. విశ్వకర్మ జగములను ఉపసంహరించి మఱల తండ్రికానెంచి, ఆ జగముల పునఃసృష్టికి పూనినాడనునది ఇచ్చట

రహస్యము. అతడు జగములను-అనగా పిండబ్రహ్మాండ రూపఉపాధులను సృష్టించి, అందు తానే ప్రవేశించినాడు. కాన జీవేశ్వరులకు అభేదము ఏర్పడి అద్వైతసిద్ధి కలుగు చున్నది.

విశ్వకర్మసూక్తమునందు జగత్కారణవస్తు పరముగ కొన్నిపదములు ప్రయోగింపబడినవి. వాటి బాహ్యాంతరర్థ ములనెఱింగి సాధకులు, తాము తత్త్వసాధనలయందు నిమ గ్నులు కావలసియున్నారు. ఆ భగవంతుడు ఋషి. అనగా అన్నింటిని ఎఱింగినజ్ఞాని, ద్రష్ట. తరువాత ఆయన హోత. హోమరూపములైన విశ్వ నిర్మాణాది యజ్ఞ కార్యములు చేయువాడన్నమాట. అట్లే సాధకుడుకూడ జగత్కల్యాణకర కర్మకారుడు కావలయునని దీనిభావము. అందుకే ఆయన, పిత-సర్వమును పోషించుతండ్రికూడ. నీవును అట్లే ప్రాణి పోషకుడవు కావలయును. ఇన్నిపనులను చేయుచున్నాడు కావున, ఆ దేవుడు విశ్వకర్మకూడ. నీవుకూడ విశ్వహిత కార్యముల నొనర్చి, విశ్వకర్మవు కావలసిఉన్నావు. ఆ జగ త్కారణము 'విహాయాః'. విశేషముగా తాను సృష్టించిన లోకములను సంహరించి తనలో లీనముచేసికొన్నునదికూడ. నీవుమాత్రము అట్లు సర్వసంహారకుడవుగాక, లోకోపకార కార్యములను ఆచరించు వాడవు కావలయును. లేదా కర్మా తీతుడవైనను కావలయును. ఆవల ఆయన ధాత, విధాత. అనగా పుట్టించువాడు, పోషకుడు అగు చున్నాడు. పిమ్మట

సంద్రృక్ =పరమజ్ఞాని, ద్రష్ట, దృక్కు-అన్న మాట. సర్వదృశ్య ములనుచూచు దృక్స్వరూపుడే భగవంతుడు. ఆ దృక్కు-నుండియే దృశ్యములన్నియు వెలువడి చివరకందులోనే లీన మగుచున్నవి. అట్లే నీవును సమస్తవస్తుజ్ఞానమునకు ప్రయత్నించి తెలిసికొని ద్రష్టవుకావలయును. ఆయన సప్తఋషుల జ్ఞానవాంఛలను తీర్చి, వారిని ఆనందింపచేసినాడు. నీవును లోకహిత కార్యములచేత లోకకళ్యాణ కారకుడవై విశ్వమిత్రుడవు, విశ్వబంధుడవు, విశ్వశంభుడవు కావలసియున్నది. ఆయన పిత (తండ్రి) పోషకుడు, జనిత-పుట్టించినవాడును అని చెప్పినవిషయములనే దృఢత్వము కోసమై శ్రుతిమాత మరలచెప్పినది. ఇంతేల ఇంద్రవరుణాది సర్వదేవతలు, బ్రహ్మావిష్ణ్వాది ఎల్లమూర్తులు, బ్రహ్మలు, ఋషులు ఆతడే! అతడేఅన్ని నామరూపములనుదాల్చి వారివారికర్మలను చేయుచున్నాడు. కావుననే ఆయననుండి తోచినభువనములు చివరకు ఆయనలోనే లీనమైపోవుచున్నవి. బ్రహ్మ, విష్ణు, రుద్రాది దేవతలు ఆ విశ్వకర్మనుండియే వెలువడి లోకసృష్టి కార్యములను నిర్వహించి, జరామరణములులేని శాశ్వతులుగా ఒప్పుచున్నారు. (జరితారో న భూనా) కాని మహాప్రభావముకల ఆ విశ్వకర్మ పరమాత్మను ఐహికాముష్మికసుఖాసక్తిగల మానవులెఱుంగ జాలకున్నారుగదా! వారిదృష్టి అ జగత్పితపై ప్రసరించుటక్షేమము.అది దుఃఖనాశహేతువు. వారిమీద మంచువంటి అజ్ఞానపుతెర ఆవరించియున్నది.

అందుకేవారు బహిర్దృష్టికరవారై హృదయములో నిగూఢముగ సన్నిహితుడైఉన్న ఆ విశ్వకర్మతత్త్వమును ఎఱుంగజాలకున్నారు. ఆ జగత్కారణ వస్తువు ఎంత గొప్పదనుకొన్నారు! అది భూమికంటెను, దినముకంటెను గొప్పది, వాటికి పరమైనది-దేవాసురులకంటెను పరమైన అతీతశక్తి అది. అందుకేదానిని 'పరాత్పరము' అన్నారు. అట్టిశక్తి ఎక్కడనో-ఏమబ్బులమాటుననో లేదు. మీఅందఱి అంతర్ హృదయములోనే అది "నేను, నే" ననుచు చైతన్య రూపమున వెలుగుచున్నది.

ఎన్నోదైవశక్తుల రాశియై ఉన్నదానిని, మున్ముందు జలములు తనుయందు తాల్చినవి. ఆ నీటియందాశక్తి, బీజరూపమున వ్యక్తమైనది. జన్మరహితమైన, (అజస్య) దాని నాభి (బొడ్డు) యందుంచబడిన బీజమే విశ్వాభివ్యక్తికారణమైనది. అందుకే ఈ దేశమునకు అజనాభదేశమని పేరు వచ్చినది. ఈ మాటనుబట్టి మానవసృష్టి ఈ దేశముననే ప్రారంభమాయెనా, అనితోచుచున్నది. ఇది గ్రంథకర్త సూచనమాత్రమే. దీని ననుసరించి విజ్ఞులింకను పరిశోధనలు సాగింపవచ్చును.

ఆ విశ్వకర్మ తొలుత త్వష్ట(బ్రహ్మ)గా రూపొందినాడు. ఆయనయే జగత్తులను సృష్టించెడు బ్రహ్మదేవుడు. ఆపల ఆ జగములను వెలిగించెడి సూర్యచంద్రులుగా ఆ విశ్వకర్మ రూపొందినాడు. ఈ విషయమే "విశ్వకర్మాహ్యజనిష్ట

దేవ ఆది ద్గంధర్వో అభవ ద్ద్వితీయః,తృతీయఃపితా జనితౌష ధీనాం.'' అన్నమంత్రము స్పష్టీకరించినది. అట్టి విశ్వకర్మయే మన మానసాదులయిన ఇంద్రియములను సృష్టించి ప్రేరే పించి వాటిచే ఆ యా పనులు చేయించుచున్నాడు. అట్టి తండ్రి ఈ భూదివములను ప్రాణులతో కూడిన వాటినిగా చేసినాడు. అనగా జీవపూర్ణము లొనర్చినాడన్నమాట.

అట్టి దేవదేవునికి తన విరాడ్దేహము నందంతటా కన్నులు, ముఖములు, చేతులు, పాదములు కలవు. అంతే కాదు, అన్ని అవయవములు కలవన్న మాటయే. అనగా ఎల్లజీవుల ముఖ నేత్రాదులు ఆయనవే అయినందున ఎల్ల జీవులును, ఆయనయే అయినందున అందటి అవయవములు ఆయనవే. అందుకే ఆతడు "విశ్వత శ్చక్షువు, విశ్వతో ముఖుడు, విశ్వతో హస్తుడు, విశ్వతః పాదుడు" అగు చున్నాడని శ్రుతి పరమార్థమును ఋతసమ్మతముగా ఘోషించినది ! అనగా సత్యమునకు అనేక ముఖములు, పెక్కు తలలు, దానిని చేరుటకు అనేక సాధనములు కల వనెడి మహారహస్యమును పాఠకులు ఇక్కడ గ్రహించవలసి యున్నది. ఆయన తన చేతులతో ఊర్ధ్వలోకములను, పాదములతో అధోలోకములను సృష్టించినాడు. ఇది అంతయు ఎంత మనోహర కవితాపూర్ణమయిన ఋతవస్తు వర్ణనము!

ఆయనకీ సృష్టికార్యమొనర్చుటకు ఉపాదాన కారణమైన పదార్థముకాని, సాధనములుకాని, ఏవియు అక్కఱలేనే లేదు.ఆయన విశ్వవిజ్ఞాని. ఏది ఎట్లు కావలయునన్న అది అట్లే అయిపోవు దివ్యశక్తికల మహానుభావుడా జగత్పిత. ఆయన దేవ, మనుష్య, తిర్యగ్జడాది ప్రపంచమును సృష్టించి అందే తాను నిలిచెను. పిండాండమున స్థూల, సూక్ష్మకారణ దేహములను కల్పించి, వాటియందు ప్రత్యగాత్మగా తోచెను. ఆయనయే మనలో నిలిచి అన్నికర్మలను చేయుచు, చేయించుచున్నట్లు వెలయుచున్నాడు.

ఆయన వాచస్పతి. అనగా వేదములను సృష్టించిన విశ్వపండితుడన్నమాట. అట్టి దేవాది దేవుని సర్వులు ఆరాధింతురుగాక, అర్థము చేసికొందురుగాక. ఎన్నో మంచి పనులు చేయు ఆ జగత్కారణుడు విశ్వములన్నింటికిని సుఖములను చేకూర్చువాడని (విశ్వశంభువు) మఱువకుడు. అట్టి దేవుని గూర్చి మనము మనోవాక్కాయములతో చేయుసర్వకర్మలు యజ్ఞములే కాగలవు. ఇట్టి ఆయన తత్త్వము నెఱుంగక ద్వేషించువారు సంసార చక్రముననే పడి తిరుగుచుందురు. ఆ దేవుడు మనకు పండితుడు, ధనవంతుడు, కర్మకుశలుడు. ఇతరులకు గెలువరానివాడు, మిత్రరక్షకుడు అగు పుత్రునిగూడ ప్రసాదింపజాలును. ప్రతి మానవుడును సర్వకాల సర్వావస్థలయందును తమ కర్మలను ఆ స్వామికర్పించి ధన్యులు కావలయును. సర్వకర్మలచేత

ఆ దేవునే పూజింపవలయును. ఆయన పరమ జ్ఞాన స్వరూపుడు. నదీనద జలములకు అధిపతియైన తండ్రికూడ. అట్టి విశ్వపిత అయిన విశ్వకర్మను సదా అర్చించి ధన్యులుకండు. విశ్వకర్మ సూక్తములు రెండును మనకు బోధించు పరమార్థము ఇదియే. ఇక పురుష సూక్తార్థమును పరిశీలింతము, దీనిని యజురారణ్యక పురుష సూక్తమంత్రముల భావములతో సహా మననము చేయుదము.

## పురుష సూక్త భావము

పురుషసూక్తమందు పేర్కొనబడిన దేవుడు విశ్వకర్మయే అను విషయము జగత్ప్రసిద్ధమయినను, శ్రీకాళహస్తి మునీశ్వర ప్రణీత విశ్వకర్మపురాణము వేదాదుల ప్రామాణ్యముతో ఇట్లు వక్కాణించనది.

"భూత్వాథ పురుషాకారో, విశ్వకర్మాది పూరుషః,
ప్రతీకే ష్వసృజ ద్దేవాన్, విశ్వోత్పత్తి చికీర్షయా."

దీనినిబట్టి ఆదిపురుషుడైన విశ్వకర్మ తన అవయవముల నుండియే సూర్యచంద్రాది దేవతలను సృజించినాడని తెలియుచున్నది. "శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత, చంద్రమా మనసో జాతః- చక్షో స్సూర్యో అజాయత- ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" ఇత్యాది వర్ణన మంతటిని దృష్టిలో పెట్టుకొనియే ఆ సత్యమును వక్కాణించినది. దానిసే ముండకోపనిషదాదులు ఆయనకు స్వర్గమే శిరస్సు, పాదములే భూమి

నాడు. (అయినాడన్నమాట) ఆవల లోకములందు భోగ యోగ్యములైన స్థూలదేహములను స్వీకరించినాడు. పిమ్మట దేవతలు, పురుషునే హోమ ద్రవ్యముగా చేసికొని ఒక యజ్ఞము చేసినారు. ఆ యజ్ఞమునకు వసంత ఋతువు నేయి, గ్రీష్మము సమిధ, శరదృతువు, హవిస్సు అయినవి. ఇంకను ఆ యా యజ్ఞ సాధనములతో ఆ యజ్ఞము కొన సాగినది........ ఆ యజ్ఞమునుండి ఋక్కులు సామములు, గాయత్ర్యాది ఛందస్సులు కలిగినవి. యజుస్సుగూడ దాని నుండియే జన్మించినది. అశ్వములు, గోవులు, మేకలు, గొఱ్ఱెలును అందుండియే పుట్టినవి. అనగా సృష్టియజ్ఞము యొక్క ఫలముగా ఇవి అన్నియు జన్మించి సృష్టికార్యము జరిగినదని భావము.

అప్పుడువారు విశ్వపురుషుని ఎన్నోరీతులుగా కల్పించి నారు. అతనికి ముఖము, చేతులు, తొడలు, పాదములు ఏవి? అనగా దానికిది సమాధానము. ఆ విరాట్పురుషునికి బ్రాహ్మ ణుడు ముఖము. చేతులు రాజన్యుడు-(క్షత్రియుడు) తొడలు వైశ్యుడు. పాదములు శూద్రులు. చంద్రుడు మనస్సు. కన్ను సూర్యుడు. ఇంద్రాగ్నులు ముఖము. వాయువే ప్రాణము. అంతరిక్షమే బొడ్డు. శిరస్సే స్వర్గము. పాదములు భూమి. దిక్కులు చెవులు. అట్లే లోకములన్నియు అవయవములై వెలసినవి.

ఇట్టి విరాట్పురుషుని చీకట్లకు అవ్వలవెలుగు జగ

త్కారణపరమాత్మను మహాత్మునిగాను, మహాజ్ఞాన స్వరూపునిగాను నే నెఱుంగుదును. ఆతడు సర్వరూపములను సృష్టి చేసి వాటికి పేర్లుపెట్టి ప్రకాశించినాడు. (నామరూపాత్మక జగమును సృష్టించినాడు). ధాత, ఇంద్రుడు, నాలుగుదిక్కులు మొదట ఏదేవునిగూర్చి తెలిసికొనినారో, అట్టివాని నీ రీతిగా నెఱింగినజనుడే లోకమున అమృతుడు కాగలడు. గమ్యమును చేరుటకు ఇంతకంటెను వేఱుత్రోవ లేదు. దేవతలు యజ్ఞము చేత యజ్ఞరూపభగవంతుని అర్చించినారు. ఆనాటి ఆ ధర్మములే ప్రధానములయినవి. ఏ లోకమున పూర్వులైన సాధ్యులు, దేవతలు నెలకొనియున్నారో, దాని నెఱింగినవారు దుఃఖరహితపదమును పొందుదురు.

ఇంతవఱకు వర్ణితుడై పురుషశబ్దముచే చెప్పదగిన విశ్వకర్మ నిమిత్తకారణముగా పృథివియొక్క సారమువల్లనూ, నీటివలననూ, (ఇవి రెండును తక్కిన భూతములును ఉపాదాన కారణములు) ఈజగము ఏర్పడినది. ఆ విశ్వకర్మయొక్క ప్రతిరూపముగానే త్వష్టఅనెడి దేవుడు (బ్రహ్మ) రూపొందినాడు. అతనినుండియే జగత్తులసృష్టి జరిగినది. అనగా బ్రహ్మదేవుడు (త్వష్ట) సృష్టికర్తగా జగములువెలసినవన్నమాట. ఇట్టి పరమపురుషుని, ఆతనినుండి కలిగిన విరాట్పురుషుని, సృష్టికర్తను, సర్వము అయినవానిని నే నెఱుంగుదును. (ఇది యొకజ్ఞానియొక్క వాక్యము.) దానిచే ఏమిప్రయోజనమందు రేమో! ఆతని నెఱింగినవాడే అమృతుడు కాగలడు.

గమ్యమునుచేరుట కింతకంటె మఱొక మార్గము లేదు. ఆ విశ్వకర్మప్రజాపతి సర్వుల హృదయములందును కలడు. ఆతడు జన్మనెత్తకయే అనేకవిధరూపములను అతిచిత్రరీతులతో పొందగలడు. పుట్టకున్నను పుట్టినట్లు కనపడగలడు. ఆతనియొక్క జగత్కారణత్వమును ధీరులు (సిద్ధపురుషులు) మాత్రమే తెలియగలరు. ఆదిత్యవర్ణమైన ఆ తేజస్తత్త్వమును బ్రహ్మలమనుకొనెడివారే ఎల్లప్పుడు కోరుచుందురు. అట్టి బ్రాహ్మమైన-వేదసిద్ధమయిన వెలుగునకు నమస్కారము. ఆ బ్రాహ్మతేజమును తొలుత దేవతలెఱింగి ప్రవచించినారు. ఎవడు- దేవతలచేత ఆ యాపనులను చేయింపగలుగుచున్నాడో-అనగా చరాచరములకు శాసకుడై ఉన్నాడో, ఎవడు దేవతల క్షేమమునుకోరు పురోహితుడో, ఎవడు ఎల్ల దేవలకంటెను ముందే ఉండి ప్రకాశించెనో అట్టి బ్రాహ్మతేజమునకు నమస్కారము. (దేవతలనగా పిండాండ పక్షమున మనఃప్రాణేంద్రియము లన్నమాట). ఈ రహస్యము నెఱింగినవారికి సర్వదైవశక్తులు వశీభూతములై ఉండును. హ్రీ, శ్రీలు పత్నులై ఉందురు. అహోరాత్రములు పార్శ్వములు. నక్షత్రములే రూపము. అశ్వినీదేవతలే నోరు. అట్టి దివ్యశక్తి మా మోక్షేచ్ఛను సఫలముచేయుగాక. ఈ లోక వాంఛలను చేకూర్చుగాక. మాకు సర్వమును సిద్ధింపచేయుగాక- అని పురుషసూక్తము ముగియుచున్నది. దేవతలనగా వేదదృష్టిలో-యూపము, ఱోలు - ఇత్యాది జడవస్తువులు

గూడను. అశ్వము మొదలగునవియు దేవతలే. సూక్తము లలో స్తుతింపబడు ప్రతిదియు దేవతయే. దేవతాపదమును విశాల పరిధిలో వేదమువాడినది.

## పురుష విశ్వకర్మ సూక్తముల తులనాత్మక పరిశీలనము (సమన్వయము)

విశ్వకర్మసూక్తములు ఋగ్వేదదశమ మండలమున 81, 82 సంఖ్యలుగలవి. ఇవి శుక్ల, కృష్ణయజుర్వేదము లందును, ప్రకారాంతరముగా అథర్వ వేదమునందును, కొన్నిమంత్రములు సామవేదమునందుగూడ కలవు. ఇక పురుషసూక్తమేమో; ఋగ్వేద దశమమండలమున, 90వ సూక్తముగా ఉన్నది. ఇదికూడ సామాథర్వ శుక్లయజుర్వే దములయందును కలదు. ఋగ్వేదమునగల విశ్వకర్మసూక్త మంత్రములు 14 కాగా, కృష్ణయజుర్వేదమునందు 17గా ఉన్నవి. ఆ విశేషములు యజుర్వేద దర్శనమున మనము చదివియేఉన్నాము. ఋగ్వేదీయ పురుషసూక్తమున 16 ఋక్కులుగలవు. వాటిలో మొదటి ఋక్కు ఇది-

"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్,
స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్."

తా॥ సర్వప్రాణులయొక్క సమష్టియే రూపముగాగల బ్రహ్మాండదేహుడు, విరాట్పురుషుడునగు, పరమేశ్వరుడు సర్వజీవుల శిరస్సులు, తనవేకనుక అనంతశిరస్సులు

కలవాడై యున్నాడు. ఇంకను ఆ త డు అ న ం త నేత్రములు అనంతపాదములు కలవాడుకూడ. సర్వ భూతములలో నున్నది ఒకేఒక పరమేశ్వరుడు కావున అందఱి ఇంద్రియములు అతనివేఱయి ఆతడు సహస్రాక్షుడు, సహస్రపాదుడు, సహస్రశిరస్కుడు అగుచున్నాడని అంత రర్థము. అట్టి పురుషుడు బ్రహ్మాండ గోళమునంతటిని ఆవ రించి (వ్యాపించి) బ్రహ్మాండమును మించినప్రదేశమును కూడ దాటి, నిండి, తానే వెలుగుచున్నాడు. ఇచ్చట దశ అంగులము లనగా దశదిక్కులని చెప్పుకొనుట సముచితము. ఈ మంత్రమునకు మూలమయినమంత్రము వి శ్వ క ర్మ సూక్తమునందు కలదు.

"విశ్వత శ్చక్షు రుత విశ్వతోముఖో,
విశ్వతో హ స్త ఉత విశ్వత స్పాత్,
సం బాహుభ్యాం ధమతి సంపత త్త్రై
ర్ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః"

- ఋ 10-81-3

తా॥ ఆ విశ్వకర్మ అంతటను కన్నులు కలవాడును, అంతటను ముఖములు కలవాడును, అంతటను చేతులు, కాళ్లు కలవాడును అగుచున్నాడు. ఆతడు ఇతరుల సాయము లేకయే జీవులయొక్క పుణ్యాపాపరూప కర్మలచేత భూ లోకము మొదలుకొని, దివమువఱకునుగల సప్తలోకములను

సృష్టించినాడు. బాహుశబ్దమునకు చేతులని అర్థముచెప్పి కొని, చేతులచే ఊర్ధ్వలోకములను, నడువగలిగిన పాదముల చేత భూమిమొదలుకొని దిగువలోకములను. సృష్టించెనని కూడ చెప్పికొనవచ్చును. ఈ మంత్రమునందలి మొదటి రెండు పాదములలోని భావములే పురుష సూక్తమునందలి "సహస్ర శీర్షా, సహస్రాక్షః, సహస్రపాత్" అను రూపము లను తాల్చినవి. విశ్వకర్మ సూక్తము అంతట (విశ్వతః) అని అనగా పురుషసూక్తము దానికి బదులుగా సహస్ర శబ్దమును ప్రయోగించినది. సహస్ర శబ్దమున కిచ్చట వేయి అనియే అర్థముకాదు. అనంతములనియే భావము. అట్లే ఉత్తరార్థ భావమునుండియే "పద్భ్యాం భూమిః, శీర్ష్ణోద్యౌ స్సమవర్తత" అనెడి వాక్యములు కలిగినవి. ఇట్లు రెంటికిని చక్కని భావసాదృశ్యముండుట గమనింపదగిన విశేషము. ఇట్టి శబ్దార్థభావసాదృశ్యములు విశ్వకర్మ పురుష సూక్త ములు రెంటియందును స్తుతింపబడిన జగత్కారణతత్త్వము, లేదా భగవంతుడు ఒక్కడేయని మనకు ప్రబోధించుచున్నవి.

భగవద్గీతకూడ అనేకాంశములందు పురుష, విశ్వకర్మ సూక్తములనే అనుసరించి కొనసాగినది. ఏలయన, జగ త్తత్త్వము, జగత్కారణమును వాటి నెఱుంగుటచే కలిగెడి ఫలములు ఈ రెండు సూక్తములయందును నిండియున్నందు వలన వాటిననుసరింపక ఏ తత్త్వశాస్త్ర భాగమునకును తప్పదు. "విశ్వత శ్చక్షుః, సహస్ర శీర్షా పురుషః" అనెడి

వాటి భావమును, గీతాకర్త దిగువ శ్లోకములందు పొందు పఱచుకొన్నాడు. జ్ఞేయ వస్తువును గూర్చి చెప్పుచూ-

"సర్వతః పాణి పాదం, త త్సర్వతో౽క్షి శిరోముఖం,
సర్వతః శ్రుతిమ ల్లోకే, సర్వ మావృత్య తిష్ఠతి." 13-13

ఇది ముమ్మూర్తులా పైమంత్రముల అనువాదమే కదా. ఇంకను విశ్వరూప వర్ణన సందర్భమున-

"అనేక బాహూదర వక్త్రనేత్రం,
పశ్యామి త్వా సర్వతో౽నంత రూపం,
నాంతం న మధ్యం న పున స్తవాదిం,
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప." గీత 11-16.

ఇందు వర్ణింపబడినది విశ్వకర్మ స్వరూపమే అగుటకు శ్లోకమునందలి "విశ్వేశ్వర, విశ్వరూప" అనెడి పదములే సాక్ష్యములు. ఈ వర్ణన విష్ణు, విశ్వకర్ముల పరమైక్యమునకు గూడ నిదర్శనమే. ఎన్ని నామరూప క్రియాభేదములచే వర్ణింపబడినను జగత్కారణ పరమేశ్వరు డొక్కడే అని (ఏకం సత్) మన మెన్నటికిని మఱువరాదు. ఇంతేకాదు. 11 వ అధ్యాయము నందలి విశ్వరూప వర్ణన మంతయు విశ్వకర్మ స్వరూపమునకు ప్రతిరూపమే.

"పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం, స్తథా భూతవిశేష సంఘాన్,
బ్రహ్మాణ, మీశం, కమలాసనస్థం,
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్." 11-15

బ్రహ్మ విశ్వకర్మయందున్నాడనుటకు "విశ్వకర్మాహ్యజనిష్ఠ దేవః" అనెడి మాటయు, ఈశుడున్నాడనుటకు "విశ్వకర్మా మనసా య ద్విహాయా"- "ధాతా విధాతా" అను వాక్యమును ప్రమాణములు "విహాయాః" అనగా విశేషణ సంహర్తా" ప్రళయకాలమున జగత్సంహారము చేయు రుద్రుడని గదా భావము. ఋషులు విశ్వకర్మ యందున్నారనుటకు "యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః" అన్నవాక్యమే నిదర్శనము. ఈ రీతిగా గీత ఈ సూక్తద్వయము ననుసరించుట గమనింపగలము.

"రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
వీక్షంతే త్వాం విస్మితా శ్చైవ సర్వే." 11-22

అని గీతఅనుట ఎంతయు తగియున్నది. వసురుద్రాదిత్యాది దేవగణములు విశ్వకర్మనుండియే పుట్టినారని యజుర్వేద దర్శనమున చదివియే ఉన్నాము. (114 నుండి 118 పుటల వరకు)

"ఏతావా నస్య మహిమా, అతో జ్యాయాంశ్చ పూరుషః,
పాదోఽస్య విశ్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి." 3

తా॥ కనపడు బ్రహ్మాండమంతయు ఆ పురుషుని మహిమయే, ప్రతిభాసమే. అయినను, దీని దృష్టితో చూచు కొన్నప్పుడు దీనికంటెను ఆ పురుషుడు ఎన్నో రెట్లుగొప్పవాడు (జ్యాయాన్). ఈ సమస్త విశ్వకర్మాండములు కూడ అతని యొక్క ఒక అంశము (పాదము) మాత్రమే. తక్కిన మూడు

పాదములు ప్రకాశరూపము. అనగా ప్రపంచరహిత కేవల పురుషతత్త్వము మాత్రమే అని తెలియవలయును. ఈ విషయమును గీత "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ (10-42) నే నీ విశ్వమును నాయొక్క అంశ మాత్రముచేతనే వ్యాపించియున్నాను అన్నది. ఈ అంశము విశ్వకర్మ సూక్తములో ఇట్లు చెప్పబడినది.

"పరో దివా పర ఏనా పృథివ్యా
పరో దేవేభి రసురై ర్య దస్తి." ఋ. 10-82-5

తా॥ ఆ విశ్వకర్మ (తత్త్వము) దివము (ఊర్ధ్వలోకములు) కంటెను, భూమికంటెను (అధోలోకము కంటెను), దేవాసురులకంటెను పరమై ఒప్పుచున్నాడు. అనగా బ్రహ్మాండములన్నియు ఒక అంశముకాగా, ఆతడేమో వాటి కంటెను అధికుడేగాక, అతీతుడును, అవియునుకూడ అయి ప్రకాశించుచున్నాడనునది రహస్యము. అనగా పరమేశ్వర తత్త్వమును సాధకులు బ్రహ్మాండములయందేగాక, బ్రహ్మాండమున కంటె ఇతరత్రకూడ వ్యాపించి ఉన్నదానినిగా ఎఱింగి సాక్షాత్కరించుకొని ధన్యులు కావలయునని భావము. "ఏతావా నస్య మహిమా, అతో జ్యాయాంశ్చ పూరుషః" అనిచెప్పిన పురుషసూక్తము ఇంచుమించు అదే భావమును మఱల నాల్గవమంత్రముచేతగూడ చెప్పుచున్నది.

"త్రిపా దూర్ధ్వ ఉదై త్పురుషః-పాదోస్యేహా భవాత్పునః,
తతో విష్వఙ్వ్య క్రామత్-సాశనానశనే అభి." 4

ఈ త్రిపాత్పురుషుడు అజ్ఞాన (తమః) కార్యమగు సంసారమును అంటక నిస్సంగుడై ఊర్ధ్వమునందుండెను. అనగా పిండాండపక్షమున ఆధారాదికమలములకంటెను పైనున్న సహస్రారమునందు ఉండెనని భావము. కుండలినీస్వరూపుడగు ఈ త్రిపాత్పురుషుడు కుండలినీరూపమున, ఆధారమునుండి సహస్రారమువఱకు ఎగసెననియు సాధకులిచ్చట భావింపవలయును. కాని అతనియొక్క ఒకపాదము (లేశము) మాత్రము మాయాసంపర్కము చేత సృష్ట్యాదికార్యముల నిమిత్తమై తడవ తడవకు, (పునః) వ్యక్తమగుచుండెను. సృష్టిప్రళయాదులను జరుపుచు సంసారరూపమున వెలయుచుండెనని భావము. ఆ పరమపురుషుని ఏకాంశమునందు మాత్రమే సృష్ట్యాదిక్రియలు జరుగుచుండెనన్నమాట. మాయోపాధులయందు పురుషుడు ప్రతిబింబించిన పిదప దేవ, మనుష్య, తిర్యగాది భేదములచేత భిన్నుడై ఆహారము అవసరమయిన జీవులుకొన్నిగాను, అది అవసరములేని కొండలు, నదులు, మొదలగునవి కొన్నిగాను వ్యాపించినాడు. అనగా ప్రాణి-అప్రాణిరూపములతో వెలసినాడని భావము. భగవద్గీతయేమో ఈ పరభావమును "మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ" (7. 7) నాకంటె పరమయినది ఏ కొంచెమును లేదు అన్నది. అనగా అన్నింటికిని పరమైనది తానే కాని, తన తరువాత ఇంకేమియును లేదన్నమాటయే కదా. అనగా తాను పరుడుగా ఉండగా, తన తరువాతనే తక్కినవన్నియు

ఏర్పడినవన్న మాట. తనకుపిమ్మటనే ప్రకృతి, అవ్యక్తమహ దహంకార పంచతన్మాత్రలు పుట్టినవి కాన, తానువాటికి కారణమును తండ్రియుఌగుచున్నాడు. ఈ గీతావాక్యము నకు మూలము "పర్ఠోదివా పరఏనా పృథివ్యాః" అనెడి మంత్రమే.

ఇక్కడ పురుషపదముచే చెప్పబడినవిశ్వకర్మ స్వరూపతః విశ్వకర్మయై వెలసినాడని భావము. ఈ సందర్భమున మాయాఽవిద్యాది పదములచే పేర్కొనదగిన సంసార కారణము అతనినుండియే వ్యక్తమైనదని, సాధకులు గమనింపవలయును. తననుండి వ్యక్తమైన మాయ, లేకతమస్సు, విచిత్రసృష్టిని చేసి, తనను ఆవరించినట్లు కన్పట్టినను, అది వస్తుతః తన్ను ఆవరింపజాలదు. కారణజ్ఞానము కలుగగానే అది తొలగిపోయి, ఒక్క పరమపురుషుడే మిగులుచున్నాడు. తరువాత 5వ మంత్రముచేత విరాట్పురుష స్వరూపము వర్ణింపబడుచున్నది.

"తస్మాద్విరాం డజాయత, విరాజో ఽధిపూరుషః,
స జాతో అత్యరిచ్యత, పశ్చాద్భూమి మథో పురః". 5

తా॥ అంతట వ్యాపించిన ఆ ఆదిపురుషునినుండి విరాడ్దేహము (బ్రహ్మాండము) కలిగినది. ఆకాశాదులగు వస్తువులు ఈతనియందు ప్రకాశించుచున్నవి కాన,ఇతనికి విరాట్టు అనుపేరు సార్థకము. తత్త్వములను ధరించి, విశేషముగా ప్రకాశించువాడుఅని, విరాట్, శబ్దమునకు వ్యుత్పత్తి. ఆ

విరాడ్దేహము నాధారము చేసికొని ఇంకొక పురుషుడు కలిగి నాడు. అనగా దానిని ఉపాధిగా చేసికొని తోచినాడని భావము. ఆతడే జీవుడు-అక్షరపురుషుడు అతనికి తాను తాల్చిన దేహములయందు అభిమానము కలిగినది. పరమ పురుషుడే జీవుడను విషయమునే ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తము "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛద వరా ఆవివేశ" అనిచెప్పినది. అట్లుకలిగిన పురుషుడు పిమ్మట లోకము (భూమి)న వ్యాపించి దేవ, మనుష్య, తిర్యగాది పురముల (శరీరముల) యందు ప్రవేశించినాడు. ఈ అంశ మును యజుర్వేదీయ విశ్వకర్మసూక్తమిట్లు వక్కాణించినది. "విశ్వకర్మాహ్యజనిష్ట దేవ ఆదిద్గంధర్వో అభవ ద్ద్వితీయః" ఆ విశ్వకర్మ పరమేశ్వరుడు మొట్టమొదట దేవుడైనాడు. అన్నవాక్యమునకు సాయణులు బాష్యము వ్రాయుచూ, దేవ శబ్దమునకు "సత్యలోక నివాసిఅయిన బ్రహ్మదేవుడు ఆ విశ్వకర్మనాభినుండి కలిగెనని" వ్రాసినారు. ఇదే అంశము పురాణవాఙ్మయమున విష్ణునాభికమలమునుండి బ్రహ్మోత్పత్తి నని ప్రచారమయినది. ఏది ఏమయినను విశ్వకర్మనుండి బ్రహ్మఅనుడు, పురుషసూక్తానుసారము విరాట్పురుషుడనుడు కలిగెనని స్పష్టముగా తేలుచున్నది. ఇందుకుగూడ యజురా రణ్యకసూక్తమే సాక్ష్యము-అది ఇది-

"అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ
విశ్వకర్మణ స్సమవర్తతాధి,
తస్య త్వష్టా విదధ ద్రూప మేతి."

తా॥ తొలుత విశ్వకర్మతత్త్వము కలదు. దానినుండి త్వష్ట రూపొందినాడు. ఆ త్వష్టయే జగన్నిర్మాణము చేసినాడని ఋగ్వేద దిగ్దర్శన ప్రథమభాగమున సవిస్తరముగా నిరూపింపబడినది. ఈ త్వష్టను ప్రజాపతి, పరమేష్ఠి, విశ్వకర్మ అనికూడ వేదములు పేర్కొన్నవి. మనదర్శనములు ఆవిషయమును పలుతావుల సూచించుచునే ఉన్నవి. ఆ త్వష్టయే పురాణములయందు బ్రహ్మగా, సృష్టికర్తగా, వర్ణింపబడినాడు. వేదములయందు బ్రహ్మశబ్దము విరళము (తక్కువ). వేదములయందు బ్రహ్మమనగా వేదమనియెడి అర్థమే ఎక్కువగా చెప్పబడినది. దానినిచదివి, దానిఅర్థ సారముల నెఱింగినవారే ఆనాడు బ్రాహ్మణులుగా ఎన్నబడినారుకూడ. పురుషసూక్తము చెప్పిన విరాట్పురుషుడు విశ్వకర్మసూక్తము చెప్పిన ఆదిదేవుడే. ఈ విషయమునకూడ విశ్వకర్మసూక్త భావమునే పురుషసూక్తము వివరించినది - విస్తరించినది అని తెలియవలయును.

సాయణులు "అజస్య నాభా వధ్యేక మర్పితం, యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః" (10-82-6) అనెడి విశ్వకర్మ సూక్తమంత్రమును ఆధారముచేసికొనియే విశ్వకర్మ నాభినుండి (బొడ్డు) సత్యలోకవాసియైన చతుర్ముఖుడుపుట్టినాడని వ్రాసియుండును. వాటికిట్టి సంబంధము వేదవాణిలోనే అగపడుచున్నది. పురాణముల ప్రభావముచేత సాయ

కొన్నచో కుండలినీ యోగరూపార్థము బలపడును. పర దేవత కుండలినీ స్వరూపమేఅని మన లలితాసహస్రనామాది గ్రంథములు పలుకుచున్నవి.

ఇక ప్రకృతమునకు వత్తము. పిమ్మట పురుషసూక్త మంత్రములలో దేవతలుచేసిన ప్రథమయజ్ఞము ప్రస్తావింప బడినది.

"య త్పురుషేణ హవిషా, దేవా యజ్ఞ మతన్వత." 6

ఆ యజ్ఞమునుండియే ఋక్కులు, సామములు, ఛంద స్సులు, యజుస్సు పుట్టినవని వర్ణన కొనసాగినది. అనగా వేద జనకుడు (విశ్వకర్మయని, పురుషుడని) దీని కంతటికి సారాం శము. ఈ అంశమును బృహదారణ్యకాదులు గూడ రూఢి పఱచినవి. ఇక విశ్వకర్మ సూక్తమేమో, వేదవాఙ్ప్రపంచ మున కంతటికిని, విశ్వకర్మయే అధిపతి-అని ఒక్కమాటలో చెప్పినది. అ మాటఇది.

"వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే
మనో జువం వాజే అద్యాహువేమ,
స నో విశ్వాని హవనాని జోషతే
విశ్వశంభూ రవసే సాధుకర్మా". ఋ-10-81-7

దీనికిసాయణులు "వాచస్పతిం = మంత్రాత్మకస్య వచసః స్వామినం, విశ్వకర్మాణం=విశ్వకర్తారం" అనివ్రాసి సమస్తమంత్రరాశితోకూడిన వేదమునకు విశ్వకర్మను అధి పతిగాను, కర్తగాను పేర్కొన్నారు.

పూర్వమువచించిన విశ్వోత్పత్తి సూక్తభావములను పెక్కింటిని అనువదించిన భగవద్గీతకూడ వేదము భగవద్వాక్యమే అనుచున్నది.

"సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనంచ,
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాంతకృ ద్వేదవి దేవ చాహమ్." 15-15

ఈ శ్లోకము నందలి అందఱిహృదయముల యందును "నేనే ఉన్నాను" అనెడిమాట - "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః." అనెడి శ్వేతాశ్వతరోపనిషన్మంత్రమునుండి గ్రహింపబడినదే. నాల్గవ పాదమున వేదాంతమును చెప్పినదికూడ తానే అనియు, వేదముయొక్క సంపూర్ణార్థము తనకే తెలియు.(వేదవి దేవ) ననియు అన్నాడుగదా! అసలు వేదము (జ్ఞానము) అనాది, అనంతము అయినను, దానికి ఆద్యంతములున్నట్లు వ్యవహారము. "అనంతా వై వేదాః" అని ప్రమాణము. అట్టి దానికి ఆద్యంతములు లేకపోవుటఅనునది పరమార్థ భావము.

ఇక్కడ వేదాంతమనగా వేదముయొక్క ఆదినుండి అంతమువఱకుఅని భావము. వేదమనగా సాక్షాత్తు విశ్వమే! ఏలయన, వేదములయందు వర్ణింపబడిన సృష్టివిధానమునే విశ్వమునందు కాంతుముకాన, విశ్వము వేదమునకు ఉదాహరణమే. వేదము లక్షణముకాగా, విశ్వము లక్ష్యము (ఉదా

హరణము) అగుచున్నదన్న మాట. ఇట్టివేదాంతమును చేసినవాడును, ఎఱింగినవాడును, పరమేశ్వరుడుగాక ఇంకె వరు ? కనుకనే ఋగ్వేదదిగ్దర్శనము రెండవభాగమునకు "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనిపేరుపెట్టి పంచభూత, నదీ, పర్వతాదులను వర్ణించుట అయినది. వేదములు విశ్వ కుటుంబకథయేఅని గ్రంథకర్తభావముకూడ.

మంత్రములోని "వాచస్పతిం విశ్వకర్మాణం" అన్న పదము భగవద్గీతలో ఈ విధముగా వివరింపబడినది. కాగా విష్ణు విశ్వకర్మలు భగవద్రూపులే. ఏకైక వ్యక్తులే. అట్టి దేవుని దయవల్లనే భగవంతునియొక్క స్మృతి, జ్ఞానము కలుగుచున్నవి. ఆయన దయలేనప్పుడు, ఆ రెంటి నాశనము కలుగుచున్నదట. ఇట్టి విశేషములన్నియు తపశ్శక్తిచే లభ్యములుకాని, సామాన్యములు కావు. ఈ అంశము వాఙ్మయమున "యస్య నిఃశ్వసితం వేదః, యో వేదోభ్యో ఽఖిలం జగత్" ఏ పరమేశ్వరునియొక్క నిఃశ్వాసమే వేదమో, ఆ వేదానుసారమే సమస్త జగము నాతడు రూపొందించెను-అని ప్రశంసింపబడినది. అట్టి విశ్వకర్మ మన అర్పణలను (హవనాని) స్వీకరించి మనలను రక్షించుగాక అనియు, ఆయన విశ్వశంభుడనియుగూడ మంత్రములో కీర్తింపబడినది.

నాసదీయ సూక్తముకాని, విశ్వకర్మసూక్తముకాని, బ్రాహ్మణాది వర్ణములను ప్రస్తావించలేదు. అట్లే మోక్ష

సూక్తముగూడ వర్ణప్రశంస జోలికి పోలేదు. ఏదో ఒక మంత్రమున "చత్వారి వాక్పరిమితా పదాని ........ తాని విదుః బ్రాహ్మణా యేమనీషణః" (1-164-45) అని అన్నను, అది వేదార్థము నెఱింగిన వేదవేత్తలనెడి అర్థమునందే వాడబడినది. కాని, వర్ణవాచకముగా ప్రయోగింపబడలేదు. కాని పురుష సూక్తమున నట్లుగాక, పని కట్టుకొని వర్ణ ప్రశంస చేయదలచినదా ఏమి? అనునట్లు ఈ మంత్రము లగపడుచున్నవి.

"యత్పురుషం వ్యదధుః, కతిధా వ్యకల్పయన్,
ముఖం కి మస్య కౌ బాహూ, కావూరూ పాదా వుచ్యేతే."
(11)

తా॥ ఆ విరాట్ పురుషుని ఎట్లు విభజించినారు? ఎట్లు కల్పించినారు? అతనికి ముఖమేది? చేతులేవి? తొడలేవి? పాదములేవి? అని ప్రశ్నించుకొని ఇట్లు సమాధానము చెప్పబడినది.

"బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్
బాహూ రాజన్యః కృతః
ఊరూ త దస్య యద్వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయత." 12

తా॥ ఆ విరాట్పురుషునికి బ్రాహ్మణుడు ముఖమైనాడు, చేతులు రాజన్యుడు. వైశ్యుడేమో తొడలు. పాదములేమో శూద్రుడు. పాదములనుటకు "పద్భ్యాం" అని ఉపనిషత్తు

అన్నరీతిని ఇప్పుడే గమనించగలము. ఇది కల్పితమనియు, నడిమికాలమున దీని నెవ్వరో ప్రక్షిప్తము చేసినారనియు, కొందఱు (దయానందాదులు) వేదవేత్తల భావము.ఇప్పట్టున ముండకోపనిషత్తులోని దిగువ మంత్రము ఆరయదగినది-

"అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్ర సూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః,
వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా."
2-2-4

ఆ విశ్వమయునకు అగ్నిశబ్దముచే చెప్పదగినదియు తేజః ప్రధానమును అగు ద్యులోకమే శిరస్సు. ఇక్కడ ద్యుశబ్దముచేత ఊర్ధ్వలోకములన్నియు గ్రహింపదగినవే. రాత్రిందివములను చేసెడు చంద్ర సూర్యులే కన్నులు-దిక్కులే చెవులు, వేదములే ఆయన వాక్కులు. గాలియే ఆతని ప్రాణము. ఈ విశాలమయిన విశ్వమే ఆ భగవంతుని హృదయము, భూమియే ఆతని పాదములు. ఇక్కడ "పద్భ్యాం" అనుమాట పాదములు అనునర్థమున వాడబడినది. ఈ పంచమీ భక్తిని ప్రథమలోనికి మార్చుకొని అర్థము చెప్పికొనవలెను. "పద్భ్యాం శూద్రో అజాయత" అన్నప్పుడు కూడ పంచమికి ప్రథమార్థమే. ఇట్టి దేవదేవుడు సర్వభూతములకు అంతరాత్మ. అందఱి హృదయములందుండెడువాడు ఈతడే. ఈ మంత్రమున "సర్వస్య గాత్రస్య

శిరః ప్రధానమ్" కనుక శిరస్సు పేర్కొనబడినది. ఆవల జ్ఞానేంద్రియములకు చిహ్నములైన కన్నులు, చెవులు చెప్ప బడినవి. నామరూపాత్మక సృష్టిని ప్రాణులు ఈ రెంటిచేతనే గ్రహింతురు కదా! రూపములను కన్నులచేత చూచు చున్నాము. నామములను చెవులచేత వినుచున్నాము. కనుక కన్నులను, చెవులను చెప్పుటచేత నామరూపమైన సృష్టి నంతటిని చెప్పినట్లయినది. దీనికి తగినట్లే పురుషసూక్తము–

"సర్వాణి రూపాణి విచిత్య ధీరః,
నామాని కృత్వాభివదన్ యదాస్తే."

భగవంతుడు రూపసృష్టిచేసి పిమ్మట వాటికి నామములుంచినాడనుచున్నదిగదా! ఇక కర్మేంద్రియము లలో ముఖ్యమైనది వాక్కు. భగవంతుని వాక్కులే వేదము లట. ఇక ఆయన ప్రాణమేమో! బ్రహ్మాండమున తిరుగాడు గాలియే హృదయమన్నచో సమస్తమైన విశ్వమే భగవంతుని హృదయము నెఱుంగవలెనన్నచో, విశ్వ తత్త్వము నెఱుంగవలయునని ఇందలి పరమ రహస్యము. ఇట్టి దేవుడు సర్వభూతములకు అంతరాత్మయట. భూతాంత రాత్మయైన ఈతడెవ్వరబ్బా! ఎవరోకాదు. నాకూత్తు విశ్వ కర్మయే అని శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పుచున్నది కదా!

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మనీషా మనసాభిక్లప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవంతి." 4-17.

ఈ మంత్రమునుబట్టి విశ్వకర్మకు పరమాత్మ అనియే కాక, మహాత్మ అనికూడ పేరున్నదని గ్రహింపవలెను. ఇట్లు సర్వభూతాంతరాత్ముడు విశ్వకర్మయేఅనిచెప్పి ఆతని నెఱింగిన ప్రాణులు అమృతులగుదురని శ్వేతాశ్వరోపనిషత్తు అన్నది. పురుష సూక్తముకూడ, "త మేవం విద్వా నమృత ఇహ భవతి" అన్నది కదా! పురుష సూక్తములోని "బ్రాహ్మణోస్య" అనువాక్యములను ఆధారము చేసికొనియే భగవద్గీతలోని "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" అన్న శ్లోకము బయలుదేరినది. ఇందు గుణకర్మ విభాగమనునది వర్ణములకు లక్షణ వాక్యమువంటిది. అందు గుణ విభాగమిట్లుండును.

సత్వము, రజస్సు, తమస్సు అనునవే త్రిగుణములు. సత్వము ప్రధానముగా ఉండి, రజోగుణము అప్రధానముగా కలవాడు బ్రాహ్మణుడు. రజస్సు ప్రధానమై, సత్వగుణము అప్రధానముగా కలవాడు క్షత్రియుడు. రజస్సు ప్రధానమై తమోగుణము అప్రధానముగా కలవాడు వైశ్యుడు. తమోగుణము ప్రధానమై రజస్సు అప్రధానముగా కలవాడు శూద్రుడు. ఇది సామాన్యమైన లక్షణము. వీటిలోకూడ అనేక తారతమ్యములు సాంకర్యములు ఉదాహరణముల యందు ఉండవచ్చును. ఇట్టి లక్షణము కలవారిలో బ్రాహ్మణునికి శమదమాదులు కర్మలని- ఇత్యాదిగా గీత

విధించినది. ఆ విస్తరమును, భగవద్గీతాది గ్రంథముల యందు చదువగలరు.

ఈ సందర్భమున విశ్వకర్మ సూక్తము సత్వగుణ ప్రధానులైన దేవతల సృష్టిని, రజోగుణ ప్రధానులైన మానవుల సృష్టిని తమోగుణ ప్రధానులైన ప్రాణి, అప్రాణులసృష్టిని వరుసగా 1. పరమములు 2. మధ్యమములు 3. అవమములు అని పేర్కొనుట మనము దిగువ మంత్రములో గమనింపగలము.

"యా తే ధామాని పరమాణి యావమా,
యా మధ్యమా విశ్వకర్మ న్ను తేమా." 10-81-5

అంతేకాదు. ఇట్టి ప్రాణులందరిలోను "ఓ విశ్వకర్మా, అంతర్యామిగా ప్రవేశించిన నీవు మాచే సత్కర్మలను చేయించు"మనికూడ తరువాతి రెండుపాదము లనుచున్నవి.

"శిక్షా సఖిభ్యో హావిషి స్వధావః
స్వయం యజస్వ తన్వం వృధానః."

మమ్ములను నీ చెలికాండ్రనుగా నెంచి, మాలో నీవే ప్రవేశించి (ప్రేరణనిచ్చి) మా ఆహుతులచేత, (సత్కార్యములచేత) వృద్ధిపొందుచు యజింపుము- అన్నది.. ఈ మంత్రమునందలి భావము తక్కిన పురుష సూక్త పాదములలో మరొక ప్రకారముగా ఆవిష్కరింపబడుటను గమనింతము.

ముండకోపనిషత్తు చేసిన మనోహర సత్యసమ్మత వర్ణనమును పురుష సూక్తము దిగువ మంత్రములలో సూర్యచంద్రాదులు ఆ పరమ పురుషునినుండి కలిగినారు అన్నట్లు చెప్పినది-

"చంద్రమా మనసో జాతః, చక్షో సూర్యో అజాయత,
ముఖా దింద్రశ్చాగ్నిశ్చ, ప్రాణాద్వాయు రజాయత." 13
నాభ్యా ఆసీ దంతరిక్షం, శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత,
పద్భ్యాం భూమి, ర్దిశః శ్రోత్రాత్, తథా లోకా
నకల్పయత్. 14

ఈ వర్ణనము నంతటిని విశ్వకర్మసూక్తము ఆ దేవుడే ద్యావా పృథువులను సృష్టించెను, వ్యాపించెను, విస్తరించెను- అనెడి వాక్యములతో తెల్పినది. ఆ వాక్యములు ఇవి-

"సం బాహుభ్యాం ధమతి సంపతత్రైర్ద్యావా భూమీ
జనయన్ దేవ ఏకః" 10-81-3
ద్యావా పృథివీ నిష్టతక్షుః. ఋ. 10-81-4
"స్వయం యజస్వ పృథివీ ముత ద్యామ్." 10-81-6
"ద్యావా దృథివీ అప్రథేతామ్." 10-82-1

"ఆ విశ్వకర్మ బాహువులచేత దివమును, పాదముల చేత భూమిని సృష్టించెను.(ద్యావాభూములను సృష్టించెను.) ఆ భూదివములను యజింపుము. (ఆరాధింపుము) ద్యావా పృథువులను విస్తరింపచేసినాడు. విశ్వకర్మ సూక్తము చెప్పిన

నామ సృష్టియు జరిగినదని గ్రహింపవలయును. మనకు భూమియు, అందలి రూపములే అగపడునుగాని దివముగాని అందలి శక్తులుకాని అగపడవు. అగపడనట్టి ఆ స్వర్గాదుల సృష్టిని పురుష సూక్తము నామపదముచే పేర్కొన్నది అని మనము తెలియవలయును. స్వర్గాది లోకములు ఎవరికిగాని కంటి కగపడవు. వాటిని నామమాత్రముచేతనే తెలిసికొనుచున్నాము. విశ్వకర్మ సూక్తము వాటిని 'ద్యు' శబ్దముచే పేర్కొన్నది. ఇట్టి రహస్యములు, గంభీరార్థములు వేద వాక్యములకు కలవు.

ఇక పిమ్మట మఱికొన్ని రహస్యములను పరికింతము. ఋగ్వేదీయ పురుషసూక్తమునందు 16వ మంత్రము ఇది-

"యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః,
తాని ధర్మాణి ప్రథమా న్యాసన్,
తే హ నాకం మహిమానః సచంతే,
యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః." 10-90-16

టీక : దేవాః = ప్రాణాదిదేవతలు, యజ్ఞేన = ఇంత వఱకుచెప్పిన మనస్సంకల్పరూప యజ్ఞముచేత, యజ్ఞం=ఇంత వఱకు చెప్పబడిన యజ్ఞస్వరూప భగవంతుని, అయజంత= అర్చించిరి, పూజించిరి. తాని ధర్మాణి=అట్లు పూజించుట వలన ఆ పూజాధర్మములు (జగద్రూప వికారములను ధరించునట్టివి.) ప్రథమాని=ముఖ్యములు, ఆసన్=అయినవి. ఈ రెండుపాదములచేత సృష్టిని ప్రతిపాదించెడి సూక్తార్థము

సంగ్రహింపబడినది. తక్కిన రెండుపాదములచేత ఉపాసనయు, దానిఫలమును చెప్పబడుచున్నవి. యత్ర=ఇట్టి విరాట్పురుషుని పొందదగిన నాకమునందు పూర్వే సాధ్యాః= ప్రాచీనులయిన విరాట్ తత్త్వోపాసకులైన, దేవాః=దేవతలు సంతి=ఉన్నారో, అట్టి దుఃఖరహిత ప్రదేశమును (దుఃఖరహిత స్థితిని.) మహిమానః తే=మహనీయులైన ఆ విరాడుపాసకులు. సచంతే=పొందుచున్నారు.

ఈ మంత్రమున దేవతలనగా సత్వగుణముకల విశ్వోపాసకులని గ్రహింపవలసి యున్నది. నాకమనగా వారు పొందెడి దుఃఖదూర పరమానందస్థితి అని ఎన్నవలయును. అట్టి సత్వగుణులు విశ్వసృష్టికర్త - విశ్వాకారుడు అయిన, విరాట్పురుషుని భక్తి, జ్ఞాన కర్మయోగాది మార్గములచే ఉపాసించి దుఃఖరహిత అమృతత్త్వమును పొందుచున్నారని గ్రహింపవలయును. ఇందు విరాట్పురుషుని, అతనిని పొందు సాధనను యజ్ఞశబ్దముచేతనే ప్రస్తావించుట గమనింపదగినది. అనగా పొందువాడు, పొందదగినది, పొందుటకయిన సాధనము, మూడును బ్రహ్మములేఅని తేలుచున్నది. ఈ అంశమును గీత -

"బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః, బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం,
బ్రహ్మైవ తేన గంతవ్యం, బ్రహ్మకర్మ సమాధినా." (4-24)

అర్పణకర్మము,అర్పించువస్తువు, అగ్ని, అర్పించువారు- అంతయు బ్రహ్మమే. ఇట్టి కర్మచేత పొందదగినదియు

బ్రహ్మమేఅని "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనెడి వేదాంత సూక్తి ఇచ్చట నిర్వచించబడినది. ఇట్టి పురుషసూక్త మంత్రమునకు మూలమయిన యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తమునందలి "సముద్రాయవయునాయ-" అనెడి మంత్రము (చూడుము 91వ పుట) ఇట్లున్నది. దానిభావము. ప్రవహించెడి నదములకు ప్రభుడును,నదులకు తండ్రియు, చిత్స్వరూపుడును, సముద్రాకారుడును, అగు విశ్వకర్మ పరమేశ్వరునికి నమస్కారము. అట్టి విశ్వకర్మను, ఓ మానవులారా! విశ్వాహాః = ఎల్లవేళల యందును, హవిః = హవిస్సుల నిచ్చి, జుహుత=హోమముచేయుడు. ఇక్కడ హవిస్సు అనగా, నేయి మొదలయిన, హోమద్రవ్యము మాత్రమే కాదు. భగవంతు నుద్దేశించి సమర్పించు సర్వమును హవిస్సే. 108 సార్లు జపముచేసి, దానిని భగవంతుని కర్పించినను, అది కూడహవిస్సే. మనోవాక్కాయములతో భగవంతునుద్దేశించి చేసెడి సర్వకార్యములును, యజ్ఞములే. వాటియందలి అర్పణలన్నియు హవిస్సులే. హవిశ్శబ్దమునకు ఇంత విశాలార్థమును వేదమాత ఉద్దేశించినది. యజ్ఞమనగా వేదోక్తమయిన కర్మమాత్రమేగాక, సమస్త లౌకిక పారమార్థిక కర్మలుకూడ యజ్ఞములే కాగలవు. ఈ అంశమును గీతలో భగవానుడిట్లు ప్రవచించినాడు.

"ద్రవ్య యజ్ఞా స్తపో యజ్ఞా, యోగయజ్ఞా స్తథా పరే,
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞా శ్చ, యతయ స్సంశిత వ్రతాః".4.28

కొందఱు ధనముతో యజ్ఞములొనర్తురు. కొంద ఱేమో మానసిక, వాచిక, కాయికములైన తపస్సులే-కర్మలే యజ్ఞముగానెంచి చేయుదురు. ఇంకకొందఱు-అష్టాంగ, కుండలినీ యోగాదులనే యజ్ఞములనియెంచి ఆచరింతురు. కొందఱు వేదశాస్త్రాదుల పఠనమును, మఱికొందఱు జ్ఞానమును యజ్ఞముగా భావింతురు.

"ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా, నేవం జ్ఞాత్వా
విమోక్ష్యసే." - 4 32

ఇట్టివన్నియు కర్మప్రధానయజములేఅనిగ్రహింపుము. అట్టిజ్ఞానమే నీకుముక్తిహేతువు. కాని వీటన్నింటి కంటెను మేలయినది జ్ఞానయజ్ఞమనిగీత-

"శ్రేయాన్ ద్రవ్యమయా ద్యగ్నాత్, జ్ఞానయజ్ఞః పరంతప
సర్వం కర్మాఖిలం పార్థజ్ఞానే పరిసమాప్యతే." 4.33

ద్రవ్యమయ యజ్ఞమునకంటెను, జ్ఞానమయ యజము శుభప్రదమును, శ్రేష్ఠమును. ఈ కర్మలన్నియును జ్ఞానమునందే పరిసమాప్తిని పొందుచున్నవి. జ్ఞానోదయమయినంతనే కామ్యాదికర్మలు శమించునని సారాంశము.

ఈ విధముగా "నదీనాం సర్వాసాం పిత్రే జుహుతా విశ్వకర్మణే విశ్వాహా మర్త్యగిం హవిః" అనెడివాక్యమునందు ఇంతటి గంభీరార్థమును వేదపురుషుడు ఇమిడ్చిపెట్టినాడు. దానిని పురుషసూక్తమును, భగవద్గీతయు వివరించి,

విస్తరముగా చెప్పినవి. ఇట్టి రహస్యముల కెన్నింటికీ విశ్వకర్మ సూక్తము మూలమని జిజ్ఞాసచేత తెలిసికొనగలము. విశ్వ+అహః = విశ్వాహః = ఎల్లవేళలయందును జగత్కారణుడైన విశ్వకర్మకు విశ్వ (నానా) రూపములతో ఉన్న హావిస్సుల నర్పింపుడు, అన్నందువలన భగవత్సేవకు, భగవదారాధనకు, ఉదయము, సాయంకాలము, రాత్రి, పగలు, శుచి, అశుచి- ఇత్యాదిభేదము లేవియు లేవని తెలియవలయును. జాగ్రత్ స్వప్న, సుషుప్త్యాది సర్వావస్థలయందును ఇట్టి యజ్ఞములద్వారా భగవదారాధనముచేసి ముక్తులు కావచ్చునని తేలుచున్నది. విశ్వకర్మ సూక్తములో "సముద్రాయ వయునాయ" అనునది చివరి మంత్రము కాగా, పురుషసూక్తమునందు "యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః" అనునదికూడ చివరి మంత్రమే అగుచున్నది. ఈ రెంటియందును యజ్ఞ ప్రశంస చేయబడి యుండుట వాటి సాదృశ్యమునకు గొప్ప నిదర్శనము.

ఋగ్వేదీయ పురుష సూక్తమున 16 మంత్రములు, 64 పాదములుండగా, యజురారణ్యక పురుషసూక్తమున 77+22 = 99 పాదములున్నవి. ఇప్పుడు యజురారణ్యక పురుష సూక్తమునందు తక్కిన మంత్రములను విశ్వకర్మ సూక్త మంత్రములలో పోల్చిచూతము. ఋగ్వేదీయ పురుష సూక్తమున 64 పాదముల వఱకును, యజురారణ్యక సూక్త

మున 72 పాదములవరకును సాధారణమయిన పురుషశబ్దమే వాడబడినది. అనగా సూక్తమున ఉద్దేశింపబడిన జగత్కారణ పరమాత్మను పురుషుడని మాత్రమే మంత్రములు పేర్కొన్నవి. 73వ పాదమునుండి ఆ పురుషుడు విశ్వకర్మ అనియు, త్వష్ట ఆయన ప్రతిరూపమే, లేక తనయుడే అనియు చెప్పబడుచున్నది.

"అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ, విశ్వకర్మణ స్సమవ ర్తతాధి, తస్య త్వష్టా విదధ ద్రూప మేతి".

ఈ విరాట్ స్వరూపుడు విశ్వకర్మయనెడి నిమిత్త కారణమునుండి నీరు, భూసారము (పంచభూతములు) ఉపాదాన కారణముగ కలిగినాడు. ఆతని యొక్క ప్రతిరూపమే త్వష్టృదేవుడు (బ్రహ్మ). అనగా ప్రకృతి పురుషుల కలయిక వలన విరాట్పురుషుడు ఉదయింపగా ప్రపంచ మేర్పడినదని రహస్యార్థము. ఇప్పుడు దానిని సృష్టించిన దెవరన, త్వష్ట అని మంత్రము చెప్పినది. ఈ విషయమును యజుర్వేదీయ విశ్వకర్మసూక్తములో కాంచుచున్నాము—

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆది
ద్గంధర్వో అభవ ద్ద్వితీయః,
తృతీయః పితా జనితౌషధీనాం
అపాంగ గర్భం వ్యదధాత్ పురుత్రా." -8

తా॥ జగత్కారణ విశ్వకర్మ మొదట త్వష్టృదేవుడై నాడు. ఈ త్వష్టను సాయణులు "సత్యలోకవాసీచతుర్ముఖః"

అన్నారని చెప్పికొనియే యున్నాము. త్వష్టకును, బ్రహ్మకును అభేదమును వైదిక వాఙ్మయము చెప్పుచునే యున్నది. విశ్వకర్మ సూక్తమీ విషయమును దేవశబ్దముతో మాత్రమే సూచింపగా, పురుష సూక్తమా దేవుడు, త్వష్టయని స్పష్టము చేసినది. ఇక విశ్వకర్మసూక్తము త్వష్టతో తృప్తిపడక లోక ప్రవర్తకులైన సూర్యచంద్రుల సృష్టినికూడ పై మంత్రమున పేర్కొన్నది. విశ్వకర్మ మొదట బ్రహ్మదేవుడు (త్వష్ట) అయి, ఆవల సూర్యచంద్రులయినా డన్నది. "గంధర్వో అభవ ద్వితీయః" గంధర్వుడనగా సూర్యుడని యజుర్వేద ప్రమాణము గలదు. గోవులనగా కిరణములు. వాటిని తాల్చువాడు గంధర్వుడు సూర్యుడని భావము. గామ్=వేదలక్షణం "ధరతీతి గంధర్వః" వేదస్వరూపుడు కాన సూర్యునికి గంధర్వుడను పేరు తగును. ఆతడు త్రయీమయుడుకదా! ఇక చంద్రసృష్టి-"తృతీయః పితా జనితౌషధీనామ్" మూడవవాడుగా ఓషధులకు తండ్రియగు చంద్రుడైనాడు. ఈ విషయములను పురుష సూక్తము "చంద్రమా మనసో జాతః, చక్షో సూర్యో అజాయత" విశ్వకర్మ మనస్సునుండి చంద్రుడు, కంటినుండి సూర్యుడు కలిగెనని చెప్పినది. ఈ రెంటను వర్ణనలో భేదమేకాని, వస్తుస్థితిలో భేదము లేదు. సూర్యచంద్రు లిరువురును భగవద్రూపులే అనునదే సారాంశము. తరువాతి మంత్రమున ఇట్టి పురుషుని నే నెఱుంగుదునని ఒక సిద్ధుడు పలుకుచున్నాడు.

"వేదాహ మేతం పురుషం మహాంతం,
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్,
త మేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథా విద్య తేఽయనాయ."

తా॥ అట్టి జగత్కారణుడైన విశ్వకర్మనామక పరమ పురుషుని నేనెఱుంగుదును. ఆతడెట్టివాడను కొనుచున్నారో వినుడు. ఆతడు ఆదిత్యుని (సూర్యుని)వంటి కాంతికలవాడు. అనగా చిత్తు- జ్ఞానమే- తెలివియే (Conscousness) స్వరూపముగా కలిగినవాడు. సూర్యుని తేజము భూత సంబంధమైనది. పరమాత్ముని తేజము అతి భౌతికమయిన జ్ఞానరూపము. అది దేనినిగాని కాల్పదు. ప్రకాశింపచేయును మాత్రమే. అది అద్దమువలె సర్వవస్తువులను, భావములను తనలో ప్రతిబింబింపచేసికొనును. అందుకే దానిని "సత్యం జ్ఞాన మనంతం." అన్నది తైత్తిరీయోపనిషత్తు. అంతేకాదు, అది తమసః పరస్తాత్=పెంజీకటి కవ్వల వెలుంగునది. చీకటి కవ్వల ఏమిటి ? చీకట్లను తినివేసి, తానే వెలుగునది. ఇక్కడ ఈ పరమ రహస్యములను భావింపవలయును. ఈ తమస్సు ఏదో ఎక్కడదో కాదు. నాసదీయ సూక్తము చెప్పిన "తమ ఆ సీత్తమసా గూఢ మగ్రే" అన్నమాట లోనిదే. ఇది మొదట లేదు. సదసదతీత ఆదిమ వస్తువునుండి సృష్టికోసమై బయలుదేరినట్టిది. ఇంకొక భావము. తమస్సనగా తమోగుణము. అనగా అవిద్య.అది తమోగుణకార్యమే. బ్రహ్మాండ

మంతయును లోకమంతయును అవిద్యా విజృంభణమే. అట్టి దాని కవ్వల నుండునదీ, దాని సంపర్గము లేనిదీ కదా తత్త్వము. అవిద్యను, దానికార్యములను అంటక, సచ్చిదానంద ఘనమై ప్రకాశించునదే ఆ తత్త్వము, ఆ పురుషుడు ఆ విశ్వకర్మ అన్నమాట !

అయినను, అట్టి పురుషుని ఎఱుగకున్న నేమి అందు రేమో- "త మేవం విద్వా నమృత ఇహ భవతి" = ఆతని నెఱింగిన వాడే మృత్యువునుదాటి అమృతుడు కాగలడు. గమ్యమును చేరుట కింతకంటెను వేఱుమార్గమేమియును లేదు- అనికూడ మంత్రపుటుత్తరార్థము విశదముచేసి పరమే శ్వరతత్త్వదర్శన మెందుకవసరమో చెప్పినది. విశ్వకర్మ సూక్తము "న తం విధాథ య ఇమా జజాన" జగములను సృష్టించిన మీ తండ్రిని మీ రెఱుంగరని అనగా, ఈ పురుష సూక్తము ఆతని నెఱుంగుదుమని ఇట్లు పలికినది. విశ్వకర్మ సూక్త విచారమునకు ఇది చక్కని సమాధానము. ఇంతవఱకు పురుషుడు, విశ్వకర్మ అని పేర్కొనబడిన తత్త్వ మును, ప్రజాపతి శబ్దముచేత తరువాతి మంత్రమున పురుష సూక్తము పేర్కొనుచున్నది.

"ప్రజాపతి శ్చరతి గర్భే అంతః,
అజాయమానో బహుధా విజాయతే,
తస్య ధీరాః పరిజానంతి యోనిమ్,
మరీచీనాం పద మిచ్ఛంతి వేధసః."

ఇది ఎంతో ప్రాముఖ్యముగల మంత్రము. అనేక మహా రహస్యములు ఇందు దాగియున్నవి. ఈ మంత్రమున పురుష సూక్తాధిదైవతమయిన విశ్వకర్మ,ప్రజాపతిఅనెడి పదముచేత పేర్కొనబడినాడు. ఇందుకు "ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వ స్తస్య ఋక్సామా న్యప్సరసో వహ్నయః" మొదలయిన యజుర్వాక్యములు ప్రమాణము. ప్రజాపతి, విశ్వకర్మ, పరమేష్ఠి అనెడి పదములు పర్యాయ వాచకములని యజుర్వేద దర్శనమున చదివియున్నాము. అట్టి విశ్వకర్మ ప్రజాపతి బ్రహ్మాండ గర్భమునను, జీవుల హృదయములందునను చరించుచున్నాడు. భగవంతుడు సర్వజీవుల హృదయములందు జీవరూపుడయి తానే ఉన్నాడనుటకు విశ్వకర్మ సూక్తములోని "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛద వరా ఆవివేశ" అన్న వాక్యమును "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః" అనెడి శ్వేతాశ్వతరోప నిషద్. వచనమును "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" "క్షేత్ర జ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు" అనెడి భగవద్గీతా వాక్యములుకూడ ప్రమాణములే. గీత విశ్వకర్మ పురుష సూక్తములను అనుసరించినదన్న విషయమును మనము గ్రహించుచునే యున్నాము.

ఆ భగవంతుడు తాను స్వయముగా పుట్టకున్నను అనేకరూపములుగా విశేషములతో కాగలడు. జగత్కారణ

వస్తువు పుట్టుటలేదు, గిట్టుటలేదు. అది చావుపుట్టుకలులేని నిర్గుణ నిరుపాధిక నిరాకారమైనట్టిది. అందుకనియే దానిని సదసద్విలక్షణమని నాసదీయసూక్తము చెప్పినది. "సదసద్వరేణ్యాం" సదసత్తులకన్న గొప్పది. వాటిని తననుండి వెలువరించునది, అని ఉపనిషత్తన్నది. "సదసత్పరం యత్" అని గీత అన్నది. అది జన్మ, వృద్ధి, క్షయ, పరిణామ, వినాశములు లేనిదైనను, ఎన్నో రూపములను, (బహుధా) తాల్పగలదు. తాల్చి ఎన్నో విశేషములను పొందగలదు. విశేషములనే కాదు. విజాయతే=విపరీత, విభిన్నరూపములనుకూడ పొందగలదు. అనగాఅది పుట్టకున్నను, పుట్టినట్లును, పెరుగకున్నను పెరిగినట్లును, తరుగకున్నను, తరిగినట్లును, మారకున్నను, మారినట్లును, నశింపకున్నను, నశించినట్లును-ఎన్నోలీలలను చూపగలదు. అన్యోన్యవిరుద్ధములైన ధర్మములను ఆ వస్తువు చూపి, లీలలనునెఱపి, చివరికా ధర్మములను తనలోనే లీనముచేసికొనగలదు. విశ్వనాటకమునకు నాందియు, భరతవాక్యమును అదియే.విశ్వకర్మసూక్త మీవిషయమును విశదపఱచినది. ఈవిషయమునే ఈ మంత్రము "విజాయతే" అన్నమాటచేత బహుళార్థములువచ్చునట్లును, అనేకవిశేషములు తెలియదగినట్లును ప్రయోగించినది.ఆప్రయోగమును "బహుధా" అన్న క్రియావిశేషణము ఎన్నోరీతుల విశేషింపచేసినది. ఎన్నెన్నో క్రియలను దానియందు వ్యక్తమగునట్లు చేసినది. ఆ క్రియలే, అది విశ్వకర్మఅని చెప్పబడుటకు కారణ

ములు. అందుకే అది ఆలోచింపవీలుకాని విచిత్రదివ్యశక్తి అయినది. అందుకే దానినిగూర్చి "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అన్నారు. తనయందు విశ్వవిశ్వములను, అది చూప గలుగుచున్నది అట్టిశక్తిచేతనే. మఱల లీనమొనర్చుకొనుచున్నదియు అట్టిశక్తిచేతనే. కనుకనే విశ్వకర్మసూక్తము ఆతత్త్వమును,

> "విశ్వకర్మా విమనా ఆద్విహాయా
> ధాతా విధాతా పరమోత సందృన్." - 10.82.2

విమనస్సు=విశేషమనస్సు - విగతమనస్సు కలదనియు, విహాయా=సంహర్త అనియు, ధాతా=పుట్టించునదనియు, విధాతా=పోషించునదనియు, ("యో నః పితా, జనితా, యో విధాతా")తండ్రిఅనియు, పోషకుడనియు,శ్రేష్ఠమనియు, సర్వద్రష్టఅనియు, నానావిధములుగా వర్ణించినది. ఇట్టివిశేషముల నన్నింటిని "ప్రజాపతి శ్చరతి" అన్నమంత్రము "బహుధా విజాయతే." అన్నమాటలోనే ఇమిడ్చిచెప్పినది. పదసదతీతమునందు-తమస్సు, మనస్సు, రేతస్సు, కామము - ఇత్యాదులుపుట్టుట, లేక తోచుట. ఇట్టిదంతయు ఈ "విజాయతే" అన్నమాటలోగలదు. ఇంతటి విచిత్రవిశ్వమును కనినను, అది అజాయమానమే. అనగా తానై స్వయముగా పుట్టనిదే. అది అన్నీ అయ్యును, ఏదీ కానిదే, ఎంతవిచిత్రము పారమేశ్వరలీల! అందుకే అది విశ్వకర్మఅయినది. సమస్త పుర (శరీర)ములయందును శయనించు పురుషుడైనది.

ధరించుధాత, పోషించెడి విధాతఅయినది. దానికన్నియును తెలియునుకాన, అది "సందృక్", ద్రష్ట, ఋషి-అయినది. ఆధ్యాత్మికసాధకులకు అది గమ్యమయినందున వారిసాధనను ప్రోత్సహించెడి సాధుకర్మములుకలదికూడ అయినది. ఐహికాముష్మిక, పారమార్థిక సౌఖ్యానందముల నొడగూర్చునది కావున, విశ్వశంభువు అయినది. అదికానిదేదియునులేదు. కావుననే దానినుద్దేశించి దానినిపొందుటకై చేయు ప్రతి కర్మమును యజమే అన్నది సూక్తము. ఈ రహస్యమును భగవద్గీత ఇట్లు స్తోత్రము చేసినది.

"త్వ మాదిదేవః పురుషః పురాణః,
త్వ మస్య విశ్వస్య పరం నిధానం,
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ,
త్వయా తతం విశ్వ మనంతరూప." **11-38**

తా॥ నీవు మొట్టమొదటి దేవుడవు. పురాణపురుషుడవు. ఈ విశ్వమునకు నిధివంటివాడవు. నిధినుండి ధనమును తీసికొనుచువేయుచుఉన్నట్లు జగములు నీనుండియే వెలుపలికి వచ్చుచు నీలోనే లీనమగుచుండునని ఇందలి నిధానశబ్దముచే తెలియుచున్నది. అన్నింటిని ఎఱుగువాడవును, అందఱిచే ఎఱుగదగినవాడవును, పరంధాముడువును నీవే. అనంతుడవగు నీచేతనే ఈ విశ్వమంతయు నిండియున్నది. ఈ గీతాశ్లోకమునకు "అజాయమానో బహుధా విజాయతే" అనెడి

మంత్రవాక్యము మూలమని తేలికగానే తెలిసికొనవచ్చును. "వేత్తాసి, వేద్యంచ" అన్నందువలన దృక్కు, దృశ్యము రెండూ నీ స్వరూపములే, నీవే - అనికూడ అద్వైతము తోచుచున్నది.

"వాయు ర్యమోఽగ్ని ర్వరుణః శశాంకః,
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ." 11.39

నీవే గాలివి, (విశ్వమునకు ప్రాణమవు) యముడవు, అగ్నివి,వరుణుడవు, చంద్రుడవు, ప్రజాపతివి, ప్రపితామహు డవుగూడ. ఈ శ్లోకమునకు "యో దేవానాం నామధా ఏక ఏవ" సర్వదేవతల నామరూపములను ధరించునది ఒక్క విశ్వకర్మయే - అనెడి వేదవాక్యము మూలమని తెలియు చున్నది గదా.

"పితాసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్,
న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽ న్యో
లోకత్రయేఽ ప్యప్రతిమ ప్రభావ." 11-48 (గీత)

ఓ దేవా, చరాచరాత్మకమైన ఈ లోకమునకు నీవే తండ్రివి, గురుడవు, గురువులకుగూడ గురుడవు. నీతో సమానుడే లేడు, ఇక అధికుడెక్కడనుండును! ముల్లోకముల యందును నీవు సాటిలేని మహిమ కలవాడవు. ఇందలి పితాసి అన్నమాటకు "యో నః పితా జనితా" అన్న విశ్వకర్మసూక్త మంత్రము మూలము. స్వయంభు బ్రహ్మ

(విశ్వకర్మ) జగద్గురువనెడి బృహదారణ్యక ప్రమాణమును బట్టియే ఇందలి గురుః, గరీయాన్-అనుమాటలు వెలువడి నవి. కనుకనే "విశ్వకర్మా జగద్గురుః." "కృష్ణం వందే జగద్గురుమ్." అనెడివాక్యములు వాఙ్మయమున ప్రచారము నకు వచ్చినవి.

"పశ్యాదిత్యాన్, వసూన్, రుద్రా, నశ్వినౌ, మరుత, స్తథా,
బహూ న్యదృష్టపూర్వాణి, పశ్యాశ్చర్యాణి భారత."
(11-6)

ఇది భగవంతునిమాట. నాయందు వసురుద్రాదిత్యా దులను, ఇంతవఱకుచూడని ఆశ్చర్యములను చూడుమని దీని భావము. ఈ మాటకు విశ్వకర్మనుండియే వసు, రుద్రా దిత్యాదులు కలిగినారనెడి కృష్ణయజుర్వేద (కాండం 7 ప్రపా1. అను-5)మంత్రము మూలమని గ్రహింపవలయును. దీనినిబట్టి భగవంతుని నుండి వసురుద్రాదిత్యులు కలిగినార నుటచేత ఆ భగవంతుడు విష్ణు, విశ్వకర్మ నామములతో పేర్కొనబడి నాడనియు, వారిరువురు ఏకరూపులే అనియు స్పష్టమగుచున్నదిగదా!

"త్వ మక్షరం పరమం వేదితవ్యం,
త్వ మస్య విశ్వస్య పరం నిధానం,
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా,
సనాతన స్త్వం పురుషో మతో మే." 11-18

ఇందలి నీవు సనాతన పురుషుడవు. అనుమాటకు పురుషసూక్తమంతయు మూలమైనట్టిదే.

"ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశ శ్చ సర్వాః" 11 20.

నీవుద్యావాపృథువులయందు వ్యాపించి ఉన్నావు.దీని కేమో "ద్యావా పృథివీ అత్ర తామ్" అనెడి విశ్వకర్మ సూక్తమంత్రము మూలమగుచున్నది.

"ఇహైకస్థం జగత్ కృత్స్నం
పశ్యాద్య సచరాచరం,
మమ దేహే గుడాకేశ!" (11.7 గీత)

ఈ నాశరీరమునందు చరాచరాత్మక విశ్వమును, ఒకే ఒకభాగము నందున్న దానినిగా చూడుము. అనగా ఈ జగమును మించి నేను వెలుగుచున్నానని భావము. దీని కేమో "పాదోస్య విశ్వా భూతాని, త్రిపా దస్యా మృతం దివి" అను మంత్రము మూలము.

"త్వ మక్షరం సదస త్తత్పరం యత్." 11 37 (గీత)

నీవు అక్షరుడవు. సదసత్తులకు పరమైనవాడవు. ఈ భావమునకు నాసదీయసూక్తములోని "నాసదాసీన్నో సదాసీత్ తదానీం" అనెడిమంత్రము మూలమని స్పష్టముగానే తెలియుచున్నది. ఈ రీతిగా భగవద్గీతయందలి అనేకముఖ్య భావములకు నాసదీయ, విశ్వకర్మ, పురుష, హిరణ్యగర్భ,

మోక్ష సూక్తాదులు మూలములని గాఢపరిశీలనముచేసినను తెలిసికొనగలము. పరమేశ్వరుడు ఇన్నివిధముల ప్రకాశించినను, ఆయన అజాయమానుడే. అనగా పుట్టనివాడే. ఆతనియొక్క ప్రతిభాసమే (ప్రతిబింబమే) ఇన్ని రీతులుగా, మనకు తోచుచున్నది.ఆ ఆదిమూలమును, సాక్షాత్కరించుకొన్నచో, ఈ ప్రతిభాసములయొక్క తత్త్వము మనకు బోధపడి, మనము భయ, శోక, సందేహదూరులమై అమృతులము కాగలము. ఇట్టి జగత్కారణునియొక్క యోనిని (తత్త్వమును) సర్వకారణత్వమును ధీరులుమాత్రమే ఎఱుంగుదురట. బ్రహ్మవఱకుగల సాధకకోటి ఆయనయొక్క ఇట్టి జ్ఞానస్వరూపమునే ఎఱుగగోరుచున్నారట. "మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః" ఇట్టితత్త్వము బ్రహ్మాదులకును,అగమ్యము. కావుననే "ఆ జిజ్ఞాసా పథమందు మూఢులుగదా చింతింప బ్రహ్మాదిదైవజ్ఞుల్, తత్పరమాత్ము విష్ణునితరుల్ భావింపగా నేర్తురే" అన్నది భాగవతము.

## అజాతవాదము

వేదాంతమున అజాతవాదమని ఒకసిద్ధాంతముకలదు. దానిని తన యోగ, జ్ఞాన, వాసిష్ఠములలో వసిష్ఠమహర్షి విస్తరింపచేసినాడు. అజాతవాదమనగా ఈ జగమనునది ఎప్పుడు కాని పుట్టనేలేదని చెప్పెడు సిద్ధాంతము. గౌడపాదుడుకూడ ఈ సిద్ధాంతమునే మాండుక్యోపనిషత్తు మూలమున అవలంబించి మాండూక్యకారికలను రచించినాడు. అందు ఆయన-

"న నిరోధో, న చోత్పత్తి, ర్న బద్ధో, న చ సాధకః,
న ముముక్షు, ర్న వై ముక్త, ఇత్యేషా పరమార్థతా."

ఉత్పత్తి, వినాశములుగాని, బద్ధుడు, ముక్తుడు, ముముక్షువు, సాధకుడు అనికాని, ఏదీలేదు - ఇదియే పరమార్థమనినాడు. అనగా జగము పుట్టనూలేదు - పెరుగనూలేదు మడియనూలేదు-అనిభావము. ఇట్టి అజాతవాదమునకు ఈ పురుషసూక్తమునందలి "అజాయమానో బహుధా విజాయతే" అనెడివాక్యమే మూలముగా కనబడుచున్నది. జగత్తుకాని మతేభావములుకాని పుట్టకుండగనే పుట్టినట్లు, పెరిగినట్లు, నశించినట్లు తోచుచున్నవన్నమాట. బంగారము నగలుగా రూపొందినట్లు, పరమాత్మతత్త్వమే స్వతః, వస్తుతః, ఏమార్పునూపొందకుండ జగత్తుగా ప్రతిభాసించుచున్నదనుటయే పరమ సిద్ధాంతము. దీనిని అవస్థాత్రయానుభవము చేత పరికించిచూతము.

సర్వప్రాణులు అనుభవించెడి అవస్థలు - జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి - అనిమూడు. వీటిలో జాగ్రద్దశయందు జీవులు భౌతికజగమును ఇంద్రియములతో అనుభవించుచుందురు. సుఖదుఃఖాది వికారములను పొందుచుందురు. ఇక్కడ అనుభవించువాడు, అనుభవింపబడు పదార్థములు, అనుభవము అనెడి త్రిపుటి (మూడును) ఉండును. ఇక రెండవదైన స్వప్నావస్థలో స్థూలదేహముకాని, బాహ్యజగమునునదికాని ఉండవు. ఆజగముయొక్క స్మృతి (జ్ఞాపకము)

వలన మనస్సే దాని అనుభవములను సూక్ష్మముగా పొందుచుండును. ఇక్కడకూడ మనస్సు ఒక్కటే అయినను దాని కల్పనఅయిన త్రిపుటి మాత్రము మానసికముగా లేకపోలేదు. అందుకే స్వప్న జగమంతయు,మిథ్యా భూతమనియు, సంకల్ప మాత్రమనియు అందఱికిని తెలియును. ఇక మూడవదే సుషుప్తి. దీనిని గాఢనిద్ర అందురు. అప్పుడు ఏ అనుభవము ఉండదు. బాహ్య జగముతోడి పొత్తు మానసికముగాకూడ ఉండనే ఉండదు. ఏమియు తెలియని అజ్ఞానమే అప్పుడు తోచునది. నిద్రనుండి లేచినవానిని ఎట్లున్నదని అడిగినచో నాకు ఏమియు తెలియలేదు, హాయిగా నిద్రించితిని- అని చెప్పుచున్నాడు. కనుక సుషుప్తిలో అజ్ఞాన మొకటి, ఆనంద మొకటి- రెండేఉన్నవి కాని, బాహ్యజగముకాని, దాని ప్రతిభాసముకాని, ఏదీలేదు. సుషుప్తిలో జగమంతయు మాయమైపోవుచున్నది. జాగ్రత్తులోని జగము మాత్రము ఆదియందును, అంతమునందును లేకున్నను, మధ్యకాలమున మాత్రము గోచరించుచున్నది. కావున, “ఆదావంతే చ యన్నాస్తి, వర్తమానే ఽపి తత్తథా” అన్న హేతువుననుసరించి, ఏ వస్తువు ఆద్యంతములందు ఉండదో అది నడిమికాలమునను లేనట్లే-అని దానిని లేనట్లే లెక్కగట్టినారు. కాని ఈ త్రికాలములందును, ఒక వస్తువు మాత్రము శాశ్వతముగా ఉండియే యున్నది.

జాగ్రత్తునందలి జగమును చూచి అనుభవించెడి జీవుడొకడు ఉన్నాడని మనము ఒప్పుకొనక తప్పదు. అట్లే

స్వప్న జగమునుకూడ అనుభవించువాడుఉండితీరవలయును. ఆతడే స్వప్నానుభవములను ఇతరులకు నోరార చెప్పు చున్నాడు. ఈ అనుభవములనుబట్టి సుషుప్తిలో కూడ అజ్ఞానమును, ఆనందమును గుర్తించి అనుభవించెడి సాక్షి ఒకడున్నాడని ఒప్పుకొనకతీరదు. అప్పు డెవ్వ డు కా ని లేకున్నచో, అప్పటి ఆనందమును,అజ్ఞానమునుగూర్చి మనకు చెప్పువాడెవ్వడు ! కనుక అజ్ఞానానందములను అనుభవించిన జీవుడు- సాక్షియు, స్వప్నజాగరములను అనుభవించిన సాక్షియు ఒక్కడే అని మనము సులభముగా తెలిసికొన వచ్చును. ఆతడు మూడవస్థలయందును, ఆ మూడు జగము లకు వేఱై మిగిలియుండి ఆ జగత్తుల ననుభవించుచున్నాడు. అట్టి జ్ఞానవస్తువునందే ఈ జాగ్రత్, స్వప్న, సుషుప్తులు క్రీడించుచున్నవి. వాడేలేనిచో, ఈ జగల్లీలను గమనించి అనుభవించెడివాడే లేకపోవలయును. వాడు శరీరమునుండి తొలగిననాడు శరీరమునకు జాగ్రదాదుల అనుభవమే లేదు కదా ! కనుక ఈ శరీరములున్నను, లేకపోయినను ఆతడు మాత్రముఉండియే యుండును. వాడే ఆత్మ. ఆ ఆత్మయే శాశ్వతము. దాని నాధారము చేసికొనియే స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు ఆటలాడుచున్నవి. అవి ఆ ఆత్మయొక్క ప్రతిభాసములే కాని భిన్నములు కావు. అనగా అవి దాని మీద పుట్టినట్లు పెరిగినట్లు సమసినట్లు కనపడుచున్నవి. కనుక ఆ శరీరములుకాని, వాటి అవస్థలుకాని, ఆ జగములు కాని నిక్కములు కావు. వాటిని దర్శించు ద్రష్టయే సాక్షియే

ఆత్మయే నిక్కము. అట్టివాడే "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అని ఉపనిషత్తులయందు కీర్తింపబడినాడు. ఈతడే భూత, భవిష్యద్వర్తమాన కాలములందు బాధింపబడని (నశింపని) శాశ్వతుడు. విశ్వకర్మ పురుషసూక్తములలో ప్రస్తుతింపబడిన జగత్కారణము వాడే- వాడే "ఏకం సత్" "సత్యం జ్ఞానమనంతం." ఆతనికి చావు పుట్టుకలు లేవు. జగద్భానమంతయు అతని మీదనే. అతని కే చలనమును లేదు. "అచలోఽయం సనాతనః" వాడే "ద్యావా పృథివీ అప్రథేతామ్" ద్యావా పృధువులను కల్పించి వాటియందు వ్యాపించి విశ్వలీలలు నడుపుచున్నట్లు కన్పట్టుచున్నాడు. "పురుష ఏవేదగ్ం సర్వం" ఈ విశ్వలీల అంతయు ఆ పురుషుడే. కావున విశ్వము ఆతని ప్రతిభాసమే కాని, ఆతనివలె సత్యముకాదని అజాతవాద సిద్ధాంతము.

దీనికి తోడుగా ఇంకొక అనుభవాంశముకూడ కలదు. మూడవదైన సుషుప్తికి పిదప సమాధి అనెడి నాల్గవదశ ఒకటి కలదు. దానిని తురీయమనికూడ అందురు. ఆ సమాధిలో జగమనునది కాని, జగత్కారణమైన మూలాజ్ఞానము (తమస్సు) గాని ఏమీ మిగులదు. అప్పుడుండు వస్తువు ఒక్కటే. అదే సత్తు, చిత్తు, ఆనందము. ఈజగల్లక్షణము లేమియులేని అతీతస్థితి. దానిని కడకు - తురీయాతీత దశయందు సత్తు అనికాని, అసత్తు అనికాని చెప్పవీలుకాదు.

ఏకం అనికాని, అనేకం అనికాని చెప్పవీలుకాదు. అది అనిర్వచనీయము, అతిమానసము, అమనస్కము. అంతే కాదు, అతిబాద్ధము కూడ. అక్కడ మనకు బాహ్యముగా గోచరించు ఆకాశాది తత్త్వములుకాని, వాటి వికారములు కాని, వాటి ఫలములైన సుఖదుఃఖాది ద్వంద్వములుకాని ఏమీ ఉండవు. దేవమానవాది సర్వప్రాణులు చిట్టచివఱకు పొందవలసిన పరమ గమ్యమది. ఆద్యమయిన స్థితి అదియే. దీనినే నాసదీయ సూక్తము "నాసదాసీన్ నో సదాసీత్" ఇత్యాదిగా వచించినది. "న సత్తన్నాసదుచ్యతే" "సదసత్తత్పరం యత్" అనియు గీత అన్నది. "న తం విదాథ" అని విశ్వకర్మ సూక్తమన్నది. "తమేవం విద్వాన మృత ఇహ భవతి" అని పురుష సూక్తమన్నది. "న విజానామి యది వేద మస్మి" అనియు "యదా మాగన్ ప్రథమజా ఋతస్యాది ద్వాచో అశ్నువే భాగ మస్యాః" అని మోక్షసూక్తమన్నది. ఇదియే సర్వులకు ప్రాప్యమన్న మాట. జ్ఞేయమన్నమాట!

కారణరూపమయిన ఈజ్ఞేయము మాత్రమే సత్యము, ఋతము. (ఋతం సత్యం పరం బ్రహ్మ) ఆ సత్యముయొక్క మహిమయే జగము, లేక బ్రహ్మాండము. (ఏతావా నస్య మహిమా) అయిన, ఆ సత్యమునకు స్వరూప లక్షణము లేమో తెలియవలయును. "త్రికాలా బాధ్యత్వం సత్యత్వం" భూత భవిష్యద్వర్తమానము లనెడి మూడు కాలముల యందును బాధింపబడక శాశ్వతమయి ఉండుస్థితిని సత్యత్వ

మన్నారు. ఈ స్థితి జగత్కారణములో ఉన్నదికాని, జగ ద్రూప కార్యములో లేదు. బంగారమే ఎల్లప్పుడు శాశ్వత ముగా నుండునది దానినుండి నగలు తయారై కొంతకాల ముండి నశించుచున్నవి. నాశమందునవి నగలేకాని, బంగారము గాదు. నగలు బంగారములోనే కలసి బంగారమే అయిపోవు చున్నవి. అట్లే జగముకూడ భగవంతుని (పరమాత్మ) నుండియే నగలవలె రూపొంది (ప్రతిభాసించి) చివరకందే కలసిపోవుచున్నది. అందుకనియే, ఛాందోగ్యము "వాచా రంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" అని మట్టి శాశ్వత మనియు, దానినుండి ఏర్పడిన కుండలు మొదలగునవి అశాశ్వతములనియు అన్నది. ఆ అశాశ్వ తత్వమునే మిథ్యాశబ్దముచేత పేర్కొన్నారు. మిథ్య అనగా బొత్తిగా లేకపోవుట, శూన్యము అని అర్థముకాదు. ఒకప్పుడుండి, ఒకప్పుడు లేకపోవుట అనియే భావము.

కావున జగత్తులకు, ఈశ్వరునకు గల సంబంధము మట్టికి దాని వికారములకు, బంగారమునకు, నగలకు గల సంబంధమువంటిదన్నమాట. బంగారు నగలుగా మారినను, ఆ నగల సృష్టి, స్థితి లయములు బంగారము నందుండియే కదా! అట్లే జగముల ప్రతిభాసాదులును, పరమేశ్వరుని నుండియే. ఈ శాస్త్రీయ సత్యమునే వేదోపనిషత్తులు నానా విధములుగా శాఖోపశాఖలుగా చిలువలు పలువలతో వర్ణించి చెప్పినవి. ధీరులగువారు సత్యబుద్ధి కౌశలముచేత ఈ రహస్యముల నెఱింగి అమృతులు కావలసియున్నది.

ఈ స్థితిని సాధించిన సాధ్యులు (సాధకులు) ధన్యులు' వారికి ఈ జగము జగమే కాదు. బ్రహ్మమే. కార్యకారణ భేదమును వారు పాటింపరు. కారణమునందే వారి దృష్టి. ఆ కారణరూపులే వారు. వారి విలాసమే దృశ్యమాన (అగపడునది) మంతయు. దృశ్యమెప్పుడును దృక్కును వీడి ఉండదు. దృక్కునుండియే దాని ఉదయాస్తమయములు. అందే దాని యునికి. కావున పుట్టుటలేదు, గిట్టుటలేదు. తోచునదంతయు ఒకేఒక ఏకముయొక్క అనేక ప్రతిభాసము-లీల! "దేవస్యైషస్వభావోఽయ మాప్తకామస్య కా స్పృహా" అన్నారు కొందఱు

## శూన్యవాదము

ఇట్టిదానిని శూన్యమని కొందఱర్థము చేసికొన్నారు. అట్టివారిలో బుద్ధుడు అగ్రేసరుడు. అతని శూన్యము మన మనుకొను శూన్యమువంటిది కాదు. అతనిది అద్వయవాదము, అజాతవాదము. అందుకే ఆయనను అద్వయవాది అన్నారు కూడ. అతని శూన్యము చతుష్కోటినుండి విడివడినట్టిది. దానికి నాసదీయ సూక్తము, విశ్వకర్మసూక్తములే ప్రేరణ నిచ్చినవని సులభముగానే గ్రహింపగలము. బుద్ధుడు వేదోపనిష దాదులను క్షుణ్ణముగా చదివిన పండితుడు ఎన్నో తాత్త్విక సాధనలను గాఢముగా ఆచరించిన సిద్ధపురుషుడు. బాహ్య ములు, స్థూలములు అయిన వాదములకు సిద్ధాంతములకు లోబడక లోతుగాను, ఉన్నతముగాను, విశాలముగాను,

తత్త్వమును గూర్చి ఆలోచించి తారక మార్గమును కనిపెట్టిన ధీశాలి ఆతడు. అనగా ధీరుడన్నమాట. (కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్).

ఆయన వేదములోని పురుష, విశ్వకర్మ, హిరణ్యగర్భ, నాసదీయాది సూక్తములను చదివి, మననము చేసి, ఒక నిర్ణయమునకు వచ్చినట్లు తోచును. అందును ముఖ్యాతి ముఖ్యముగా నాసదీయ సూక్తము నాతడు లెస్సగా వెదకి నాడని మనము భావింప వచ్చును.

నాసదీయ సూక్తము జగత్తులకు మూలమయిన తత్త్వమును, సత్త (అస్తి)ని కాని, అసత్త (నాస్తి)ని కాని చెప్ప వీలుకాని ఒకానొక అతీతశక్తి అన్నది. అనగా అది సదసత్తులను తననుండి ఆవిష్కరింపజాలు శక్తి కలదని భావము. బుద్ధు డంతటితో తృప్తిపడలేదు. దానిని చతుష్కోటి వినిర్ముక్తమయిన శూన్యమనినాడు. శూన్యమనగా ఏమీ లేదని మనము భావింతుము. అది బుద్ధుని దృష్టికాదు. ఉన్నవీ, ఉండుటకు వీలైనవీ నాలుగు భావములు మాత్రమే. అవి 1. అస్తి. అనగా సత్తన్నమాట. రెండవది నాస్తి. అనగా లేకపోవుట, లేమి. ఈ రెంటినే కాక రెంటినీ కలిపి ఒకటిగా బుద్ధుడు భావించినాడు. దానిని సదసత్తుల (అస్తినాస్తుల) జంటగా నెంచి, ఉభయము అన్నాడు. అనగా సదసత్తులని తాత్పర్యము. అంతేకాక ఆ రెంటియొక్క అభావమును కూడ బుద్ధుడు భావించి చూచినాడు. అదే నాల్గవది. దానిని

అనుభయమనినాడు. అనగా తేలిన దేమనిన- 1. అస్తి 2. నాస్తి 3. ఉభయము (అస్తినాస్తులు). 4. అనుభయము (అస్తినాస్తుల అభావము) అనువాటిని నాలుగింటిని నాలుగు కోటులు (కోణములు) గా భావించి, ఆతడు జగత్కారణ తత్త్వము అనునది చతుష్కోటి వినిర్ముక్తమనినాడు. అట్టి దానికే శూన్యమని పేరుపెట్టినాడు. ఉండుట, లేకపోవుట, మనకు పరిచితములే. మూడవదైన ఉభయము, అనగా ఉండుట, లేమి గూడ మనకు తెలిసిన అంశమే. ఇక పోగా ఆ రెండూ లేకపోవుట-లేకపోవుటయొక్క లేమి-అనునది కలిగియుండుట అను విషయము మనకు అపరిచితము. ఒక వస్తువును ఉన్నదని చెప్పనూ వీలుకాదు, లేదని చెప్పనూ వీలుకాదు. ఉన్నదీ లేదూ అని చెప్పనూ వీలుకాదు. ఆ రెండూ కూడ లేవు అని చెప్పనూ వీలుకాదు. ఇట్టి విరుద్ధ ధర్మములు, శక్తులు కలిగినట్టిదే శూన్యమనగా- అని బౌద్ధుల శూన్యవాదము చెప్పచున్నది. ఈ శూన్యవాదమునకు జైనుల స్యాద్వాదము మొదలైనవి మూలములని కొందఱందరు. దాని విస్తరము నిచ్చుట ప్రస్తావింపదలంపలేదు బుద్ధుడు చెప్పిన పంచస్కంధములు, వేదాంతము చెప్పెడు పంచ కోశములనుండి పుట్టిన బిడ్డలే కాని వేఱుకాదు. కాగా, బుద్ధుడు చేసిన పని- వేద, వేదాంత దర్శనాదులను తన కాలమున ఉన్నంతవఱకు గల విజ్ఞానమును జీర్ణింప చేసికొని అందలి గుణదోషముల నెఱింగి ఆ పైని తన ఆలోచనను కొనసాగించుట.

ఏది ఏమయినను బుద్ధుని శూన్యము, ఈనాటి వారను కొనెడి సర్వశూన్యము ఎంత మాత్రమును కాదు. దాని లక్షణము మనము చెప్పికొన్న చతుష్కోటి వినిర్ముక్తమై ఉండుట. కాగా దీనినిబట్టి ఏమి తేలినట్లు ? మూలతత్త్వము ఊహాలకు, హేతువులకు అందని అనిర్వచనీయము, అనూహ్యము, అతి మానసము, అతిబౌద్ధము అనియే కదా! ఈ వాదము నాసదీయ సూక్తము చెప్పిన జగత్కారణ తత్త్వమునకు దగ్గఱగా లేదా ! కనుక ఈ దృష్టితో చూడబడినచో బుద్ధుడు వేదవిరోధికాడని మనకు తోచును. ఆతనికి నానా దేవతలను గూర్చియు, హింసాత్మక యజ్ఞముల గూర్చియు భిన్నాభిప్రాయము లున్నవే కాని, మూలతత్త్వమునుగూర్చి నాసదీయాది సూక్తములు చెప్పిన రహస్యములమీద విపరీత బుద్ధి లేదు. వేదములోని తాత్త్విక సిద్ధాంతములమీద ద్వేషము లేకపోగా పై పెచ్చు, గౌరవమే ఆతనికి కలదని ఆతని వాఙ్మయ పరిశీలనవలన మనము గ్రహింపవచ్చును.

ఒక గ్రంథమున కొంతప్రమాణము, మఱికొంత అప్రమాణము అనుటను వేదభక్తులు సహింపరు. ఈ దృష్టితోను "నాస్తికో వేద నిందకః" అను మనుస్మృతి మాటతోను ఆతనిని నాస్తికునిగా లెక్కకట్టినారేగాని, నిజమున కాతడు నాస్తికుడుగాడు. ఆతనిదృష్టిలో నాస్తికుడనగా కర్మలకు ఫలము లేదనువాడును, పూర్వాపరజన్మలు లేవను వాడుమాత్రమే. అందుకే మిత్రసాహస్రిలో ఇట్లు వ్రాయుట అయినది.

గీ॥ కర్మములు ఫలంబు కల్పింపక నశించు
నంచు జెప్పువాని నాస్తికుడని
ఎన్నె బుద్ధదేవు డేనాడో నిజమది,
విశ్వహిత చరిత్ర వినరమిత్ర !"

బుద్ధుని గ్రంథములయందు ఈ శూన్యవాదము పూర్ణముగా మనకు కన్పట్టదు. ఇది నాగార్జునాచార్యుని నాటికి ఈ రూపముగా వికసించినది. ఆయన మూలమధ్యమ కారికలు, మాధ్యమకవాదము మొదలగువాటియందిది విస్తరముగా వివరింపబడినది. అందుకే శూన్య, మాధ్యమక వాదప్రవక్త, ప్రచారకుడు, నాగార్జునాచార్యుడే అను చుందురు. బౌద్ధమునకాతడు చేసినసంస్కరణలు అనేకములు. నాసదీయముచెప్పిన దానినిబట్టి జగత్కారణము సదసద తీతము-అనిర్వచనీయము అని తేలినదికదా. ఉపనిషత్తులం చెప్పినతత్త్వము అనిర్వచనీయమేకదా. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వా న్నబిభేతి కుత శ్చనేతి." అని తైత్తిరీయోపనిషత్తు పలికినదికదా. అనగానేమి ? "దానినిగూర్చి మనస్సుచింతింప లేదు. అట్టిదానిని ఇక వాక్కులెట్లు నిర్వచించగలవు. తర్కాదులెట్లు దానిని నిర్వచించును ?" అనియేకదాభావము. అందుకే బుద్ధికి, విజ్ఞానమునకు దానినిగూర్చి ప్రసరించు యోగ్యతలేదని వ్రాయటమైనది. అది కేవలము అను భవముచే తెలియదగినదేకాని, బుద్ధిచే ఇదమిత్థమని, నిర్ణ యింపదగినది కాదు.

"బుద్ధివిలసనములె పో, వాదధోరణు
లున్నతత్త్వముండు నున్నయట్లె, !
గోచరించు యోగ మాచరించినవద్ది
విశ్వహిత చరిత్ర వినర, మిత్ర !"

అన్నాము. ఉపనిషత్తుకూడ దానిని బ్రహ్మానందమనియు, దానిననుభవించినచో దేనినుండి భయాదులు కలుగవనియు పలికినది. ఈ అంశమును మదీయ మిత్రసాహిస్రిలో ఇట్లు చెప్పబడినది - భయసందేహరహిత నిర్వికల్పానందమే తత్త్వముకాని, మోక్షముకాని. "సందియములు లేని సర్వ విజ్ఞానంబు భయములేని సర్వభద్ర పదము క్లేశకర్మబంధ నాశకాత్మస్థితి నందుకొనుటె మోక్షమగునుమిత్ర! అని.

ఈ విధముగా ఆలోచించినచో బౌద్ధము చెప్పిన చతుష్కోటివినిర్ముక్తస్థితి తత్త్వమునందు కలదని గ్రహింప గలము. అది తైత్తిరీయము చెప్పినదేకదా ! మఱి బౌద్ధము నాస్తికమెట్లు కాగలదు.

ఇట్టి శూన్యవాదము నవతరింపజేసిన నాగార్జునుడు వెందోటలో జన్మించిన గొప్ప విశ్వబ్రాహ్మణుడు, శిల్పాచార్యుడు అగుట ఆంధ్రులమయిన మనకు గర్వకారణము. ఆతడు రెండవబుద్ధుడో అనునట్లు తననాటికి చేజిక్కిన వేదాది వాఙ్మయమును లెస్సగా చదివితత్త్వచింతన చేసినవాడు. భారతదేశపు నలుమూలలా పర్యటించి, పండితులతో

వాదములొనర్చి గెలిచినవాడు. మహామేధావి. విశ్వశ్రేయో విధాత. శిల్పోద్ధారకుడు. శూన్యవాదమును పురస్కరించుకొనియే మాయావాదము బయలుదేరినదనియు, గౌడపాదుని మాండూక్యకారికలు శూన్యవాదమునుండియే తలయెత్తినవనియు,శంకరులు ప్రచారముచేసినజగన్మిథ్యావాదమునకు బౌద్ధమే మూలమనియు, తరువాతివారు నిందించినారు. ఇందుకే పద్మపురాణములోని దిగువశ్లోకము నిదర్శనము.

"మాయావాద మసచ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధమేవతత్
మయైవ కథితం దేవి, కలౌ బ్రాహ్మణ రూపిణా."

శంకరుని మాయావాదము ప్రచ్ఛన్నబౌద్ధమనియు, అది అసచ్ఛాస్త్రమనియు, శివుడు శంకరరూపమున అవతరించి ఈ వాదమును ప్రచారము చేసినాడనియు లోకుల భావము.మనవారు తమకిష్టములేని విషయలను ఈ విధముగా నిందించుచూ ప్రచారముచేయుటకు అలవాటుపడినారని మన మెఱుంగవలసియున్న దేకాని, శంకరాద్వైతము అసచ్ఛాస్త్రమనుటకు ఎంతమాత్రమును వీలులేదు. అది నాసదీయ, విశ్వకర్మసూక్తములలో ప్రారంభమయిన విశ్వాతారక పూర్ణవాదమే. ఇక ప్రకృత విషయమునకు వత్తము.

"అజాయమానో బహుధా విజాయతే" అనెడి మంత్రవాక్యము అజాతవాద శూన్యవాదములోనికిదింపి మనలనింతదూరము రప్పించినది. వేదసూక్తములందును, మంత్రములందును ఇట్టి రహస్యములెన్నియో ఇమిడియున్నవి.

అట్టివి ఎన్నియో ఆవిష్కరింపబడలేదు. కొన్నిమాత్రమే కొందఱు మహనీయులచే వివరింపబడినవి. ఇట్టివాటిలోనిదే అచలపరిపూర్ణ సిద్ధాంతముకూడ.

## అచల పరిపూర్ణ తత్త్వము

శూన్యవాదానంతరము అచల పరిపూర్ణ సిద్ధాంత మొకటి తలయెత్తినది. ఇది-

"అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ,
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః." 2-24. గీత.

అనెడి భగవద్గీతా శ్లోకానుసారము వెలువడెనని తోచును. కొన్ని ఉపనిషత్తులనుండి అచలపరిపూర్ణవాదులు కొన్ని ప్రమాణశ్లోకములను ఉదాహరించుచుందురు. వారు కైవల్యాది శరీరములు కలవనిచెప్పుదురు. కాని స్థూల, సూక్ష్మ, కారణ,మహాకారణ శరీరములుమాత్రమే అద్వైతాదివేదాంతులచే చెప్పబడుచున్నవి. అచల తత్త్వవాదులు కైవల్య శరీరమునొకదానిని అధికముగా చెప్పినారు. శరీరము ఉన్నప్పుడు దానికొక అనుభవదశ ఉండవలయును. స్థూలాదులైన నాల్గు దేహములకును జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, సమాధి-అనెడి నాలుగుదశలుకలవు. కైవల్య శరీరదశఏదో ఆలోచింపవలసియున్నది.

ఈ అచలపరిపూర్ణ సిద్ధాంతులకు ద్వాదశాక్షరి, పంచదశాక్షరి, షోడశాక్షరి - అని మూడు మంత్రములుకూడ కలవు. అవి ఇవి -

1. "అయం వ్యర్థో బాహ్యః కోఽపి న భవతి"
2. స్వప్నే ప్రతీయమానాని శరీరాణి యథా తథా"
3. మూలాభావ మిదం జ్ఞానం శరీరం కిము నాస్తి హి"

1. ఈఉత్తబట్టబయలు ఏమీా లేదు.
2. కలలో దోచెడి దేహములెలాగో అలాగే.
3. మూలములేని ఈగుర్తైఋగేదేహ మేమీా లేదు.

ఇంతకుముందు మనము ప్రస్తావించుకొన్న అజాత వాదముకాని, శూన్యవాదముకాని, ఈ అచలవాదముకాని "ప్రజాపతి శ్చరతి గర్భే అంతః" అనెడి మంత్రములోని "అజాయమాన, మహుధా విజాయతే" అనెడి వాక్యము నుండి పుట్టినవిగానే తోచుచున్నవి. ఇంకను ఆలోచించి చూడగా ఈ మూడుసిద్ధాంతములును "నాస దాసీ న్నోస దాసీత్" అనెడిమాటలలోనే అంతర్భవించును. సదసత్తులని చెప్పుటకు వీలుకానిది తత్త్వమన్నప్పుడు చతుష్కోటి వినిర్ముక్తముకూడ అయినట్లేలెక్క. సదసత్తులు రెండూ కాని స్థితీ, రెండూకాకపోవుట లేని కాని స్థితీ, అన్నవి శబ్ద చమత్కారములేకాని, వస్తుస్థితి నాలోచించినచో, సదసదతీతస్థితి వంటివే అనవచ్చును. లేదా వేదవాక్యముయొక్క వ్యాఖ్యాన ఫలములే అనిహైనను చెప్పవచ్చును. సదసదతీతమును వ్యాఖ్యానించినచో, అందు అవికూడ అంతర్భూతములే కాగలవు. అట్టి వ్యాఖ్యానమే బౌద్ధసిద్ధాంతములోని శూన్యవాదము.

వచ్చును. దానిని ఇంకొకడు ఖండించి క్రొత్తదానిని స్థాపించ వచ్చును. ఇట్లు మానవులలో మేధాశక్తి (బుద్ధివైభవము) పెరిగిన కొలదిని వాదములును, సిద్ధాంతములును పెరుగుచునే యుండును. కాని ఇవి ఎంతగా పెరిగినను ఉన్నట్టితత్త్వములో మాత్రము ఏ మార్పునురాదు. అది ఎట్లుండిన అట్లే ఎల్ల కాలములందును ప్రకాశించుచుండును. సాంఖ్యులు, వైశేషికులు, తార్కికులు, మీమాంసకులు, వేదాంతులు, తదితర దర్శనకారులు భిన్నవిభిన్న మార్గములతో తత్త్వమునుగూర్చి వ్యాఖ్యానించిరి. అయినను మూలతత్త్వములో ఎట్టి మార్పును రాలేదు. అది యెట్లుండునో, ఎట్లు ఆయా సృష్ట్యాది కార్యములను చేయునో వాటియందెట్టి మార్పును వీరి వ్యాఖ్యానములవలన ఘటిల్లలేదు. వస్తువులకు, భావములకు సృష్టి స్థితిలయాదులు యథాప్రకారము జరుగుచునే యున్నవి. సిద్ధాంతము లనునవి తత్త్వచింతకుల దృష్టి విశేషములేకాని, వేఱుకాదు. వీటికన్నింటికిని సత్యమును సాక్షాత్కరింపజేసెడి స్వానుభవ మొక్కటే పరిష్కారము. అందుకే ఒక్కొకమతమువారు తమతమ సిద్ధాంతములే ప్రమాణములని తృప్తిపడుచుందురు. ఆ నమ్మకముతోనే స్వమతానుయాయులను శాసించుచుందురు. అట్లే వైదికులు కూడ వేదానుసారము ప్రవర్తించమని వేదాభిమానులను శాసించినారు. అట్టి వేద రహస్యములనే మనమిప్పుడు యథాశక్తి తెలిసికొనుచున్నాము.

విశ్వకర్మసూక్తానుసారము అద్వైత సిద్ధాంతము వెలువడినది. నాసదీయ సూక్తానుసారము జగత్కారణ మూలతత్త్వము సదసదతీతమని తేలినది. పురుష సూక్తానుసారము జగత్కారణ తత్త్వజ్ఞానమే మోక్షహేతువనీ, అమృతస్థితి అనీ స్పష్టమైనది. మూలతత్త్వమొక్కటే నానా విధములుగా తోచినను, దానికి చావు పుట్టుకలు లేవనికూడ "అజాయమానో బహుధా విజాయతే" అను మంత్రము తెలిపినది. ఇంతటి భిన్నత్వము కన్పట్టుచున్నను, ఇంత వైవిధ్యము, ఇందఱు దేవతలు తోచుచున్నను, ఇది అంతయు "ఏకంసత్" ఒకటే తత్త్వమని, మోక్ష సూక్తమంత్రము పలికినది. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని ఉపనిషత్తు చెప్పినది. "సత్యం జ్ఞానమానన్తం" అనీ, తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనెడి సిద్ధాంతములు వేదము నుండి బయలుదేరినవి. ఇట్టి రహస్యములను గురుశాస్త్ర విశ్వాసములతో ఎఱింగి, స్వానుభవముతో తత్త్వసాక్షాత్కారమును పడసి ధన్యుడగుట మానవుని కర్తవ్యము. అందుకే మనవారు-

"ఉత్తమం తత్త్వచిన్తాచ, మధ్యమం శాస్త్రచిన్తనం,
అధమం మంత్రచింతాచ, తీర్థభ్రాంత్య ధమాధమమ్".

తత్త్వచింత ఉత్తమమనియు, శాస్త్రచింత మధ్యమమనియు, మంత్రజపాదులు అధమములనియు, తీర్థయాత్ర, విగ్రహారాధనాదులు అధమాధమము లనియు అన్నారు.

మందబుద్ధులైన మానవులు తత్త్వచింతన జోలికిపోలేక, కడకు మంత్రజపాదులకు గూడ చాలనివారై తీర్థయాత్రాపరులు, విగ్రహారాధకులు అయినారు. కావున మానవుల మానసిక స్థాయి ఎదుగవలసియున్నది. అప్పుడే వారు బ్రహ్మవిదులు కాగలరు. వేదార్థ విచారణ పరులయిననేకాని బ్రహ్మజ్ఞానము కలుగదు.

### నాసదీయ మంత్ర ప్రాప్య సిద్ధి

నాసదీయ సూక్తమునుబట్టి సృష్టికార్యము బోధపడుటయేకాక, ఆ సృష్టిలోని మానవుడు ప్రకృతి బంధముల నుండి ముక్తిపొందెడి విధానముకూడ అందు సూచింపబడియున్నది. ఎట్లో పరిశీలింతము. భగవంతుడు తానే ప్రకృతిని సృష్టించినాడు. కావున, దానికాతడే తండ్రి. మఱల ఆ ప్రకృతిలో దాని మూలముననే, తానే అభివ్యక్తుడైనాడు కాన, దానికి తానే పుత్రుడుకూడ. మనకు గోచరించెడి నామ రూపములు పదార్థముల యొక్క గుర్తులు, స్వరూపములు. పదార్థమనగా- అవ్యక్త, మహ, దహంకారములు మూడు, పంచభూతములును, వాటి వికారములును. ఇవియే నామ రూపముల లక్ష్యము లనబడుచున్నవి. పదార్థమునకు మూలమయినది సచ్చిదానంద స్వరూప పరమాత్మ. దానికి నామ రూపములుండవు. కనుక నామరూపములను తొలగించినచో మిగులునది ఏకైక సద్వస్తువే! నీ స్వరూపమైనను, జగత్కారణమైనను అదియే. కావున జగములకు ఆధారమైన

వస్తువేదో, అదియే ముఖ్యముకాని, జగములు ముఖ్యము కావు. జగములను చూచునప్పుడు నీకు నిజముగా తోచవలసినది నామరూపముల లోపల, వెలుపలా నిండియున్న సచ్చిదానంద పరమాత్మయేకాని, నామరూపక్రియలు కావు. ఈ రహస్యమునే గీత-

"యో మాం పశ్యతి సర్వత్ర, సర్వం చ మయి పశ్యతి," అనియు, "సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని" అనియు అన్నది. అనగా, మానవుడు పొందవలసినది సచ్చిదానంద ఆత్మయేకాని, నామరూపములుకావని సారాంశము. నామరూపములు దుస్తులవంటివికాగా, ఆత్మ వాటిలోని దేహము వంటిది. అదే ఆరాధింపదగిన-పొందదగినలక్ష్యము! నామరూపములు సాధనములుకాగా, వాటిలోపలి తత్త్వముసాధ్యము,ప్రాప్యము, గమ్యము, లక్ష్యము.

మానవుడు పొందవలసినది నాసదీయసూక్త ప్రథమమంత్ర ప్రథమపాదముచెప్పిన సదసదతీతమైన అనిర్వచనీయస్థితి. దానిని ఎట్లుప్రారంభించి, సాధనచేసి పొందవలయునో ఆ సూక్తమునందలి ఏడు మంత్రములును చక్కగా వివరించుచున్నవి. కాని ఈ రహస్యమును, ఆ మంత్రములుకాని, వ్యాఖ్యాతలుకాని తమమాటలలో సూచించలేదు. సాధకులైన వారికిగాని, సాధనచేసెడివారికిగాని, ఆ రహస్యమార్గము బోధపడదు. "ఈ సృష్టియేమి? అది ఎటనుండి కలుగు

చున్నది-అనునవి సాధకుడు మొదట ప్రశ్నించుకొని, సమాధానమునందవలసిన ప్రశ్నములు. అట్లే దీనికధిపతి, సృష్టికర్త ఎవరు ? అనునది మఱియొక ప్రశ్న. సృష్టికర్తను గూర్చి విచారించుటకు పూనుకొన్నప్పుడు, సదసదతీతమైన (సర్వశూన్యమైన) దానినుండి ఒకానొక తమస్సు (ప్రకృతి) కలిగినదనియు, దానినుండియే ఆకాశాదిభూత సృష్టియు, వాటినుండి మనోబుద్ధ్యహంకారములుకలిగి, క్రమముగా మనమనుభవింపదగిన ఓషధులు మొదలగునవి కలిగినట్లు గ్రహింపగలము. దీనితో భోగ్యవస్తువులు సిద్ధమైనవన్నమాట. అటుపిమ్మటనే వాటిననుభవించు భోక్తలైనజీవులు వ్యక్తమైనారు. పిమ్మట ఈ సృష్టికర్తను, ఆతని సృష్టినిగూర్చి విశ్వకర్మసూక్తము సవిస్తరముగనేవాకొన్నది. నాసదీయసూక్తము చెప్పెడి అనుభవమును, సూక్ష్మబుద్ధులగు సాధకులు లెస్సగానే అనుభవింపగలరు. దీనినీ దిగువ దృష్టాంతముతో గ్రహింపవచ్చును.

కేవలతమము (అజ్ఞానము) మాత్రమేకల సుషుప్తి ఎల్లరూ అనుభవించుదశయేకదా ! దానినుండి జాగ్రద్దశకు వచ్చునప్పుడు అంతఃకరణముమేలుకొని సంకల్పము చేయుచున్నది. ఆ సంకల్పమునకు పిమ్మటనే బాహ్యమైన జగత్కార్యములను నిర్వహించుటకు ప్రతివాడును పూనుకొనుచున్నాడు.ఆ పూనికఅంతయు సృష్టి, స్థితుల జంజాటమే కాని ఇంకొకటికాదుగదా ! అవ్వలిదైన జాగ్రద్దశ అంతయు సంసారమేఅని మనమెఱింగిన విషయమే. ఈ సుఖ

ద్ఃఖాది ద్వంద్వరూప సంసారమునుండి ముక్తి (వీడ్పాటు) కావలెనన్నచో, జీవుడు ఊర్ధ్వగమన మొనర్చవలసియున్నది. అట్టి ఊర్ధ్వగమనమే నాల్గవదశఅయిన సమాధిలోనికి పోవునట్టి సాధకుడు చేసెడిపని.

పంచభూతములలోను పృథివినుండి, జలాదులక్రమమున ఆరోహణమును, ఆకాశమునుండి, వాయువు-మున్నగు వాటిక్రమమున అవరోహణమును జరుగుచున్నవికదా! సమాధి దశకేగెడి సాధకుడు పృథివి, జల, అగ్ని, వాయు, ఆకాశములనుదాటి, వాటికిహేతువైన అహంకారమును, మహత్తును (బుద్ధితత్త్వము) అవ్యక్తమును, (మూలప్రకృతిని) దాటి ప్రాకృతబంధముల నన్నింటిని వదలించుకొనుచున్నాడు. ఆదశలో అతనికి అవ్యక్తమహదహంకారములు (కారణదేహము) దృశ్యములు కాగలవు. అవిదృశ్యములైనప్పుడు వాటినిచూచు ద్రష్ట ఒకడు ఉండకతప్పదుకదా! అట్టి ద్రష్టయే జీవాత్మ, లేక ఆత్మ. అట్టి జీవాత్మయొక్క ఊర్ధ్వభాగమే పరమాత్మ. జీవాత్మ తన జీవలక్షణములను వదలి పరమాత్మ లక్షణములను పొందుటయే సన్మాత్రస్థితి. అయిననూ అదికూడ పరమ ప్రాప్యము అనజాలము - అది ప్రాప్యముమాత్రమే. పరమప్రాప్యమనగా, లేక పరమస్థితి అనగా, సదసదతీతమైన ఉత్తమోత్తమదశ - ప్రాథమికస్థితి. దీనినే నాసదీయసూక్త ప్రథమమంత్ర ప్రథమపాదము "నాసదాసీ న్నో సదాసీత్" అని చెప్పినది. ఈ స్థితి

కేవల సహస్రారమునమాత్రమే సాధ్యమగునట్టిది. సహస్రార విద్య జీవులను ఈ స్థితికి చేర్చుటకే వెలసినది. సాధకుడు చిత్తవృత్తి నిరోధముతో యోగమునారంభించి, వృత్తులను దాటి, కడకు వృత్తులన్నిటికిని, మూలమైన చిత్తము (తమస్సు)ను కూడాదాటి, లేదా దానిని బ్రహ్మమునందు లయమొనర్చి, అమనస్కస్థితిని సంపాదింపవలసియున్నది. ఆ అమనస్కస్థితిలో సత్తు ఉండకపోదు. దానిని, నిర్వికల్ప సమాధిఅని, అనవచ్చును. సత్తునుకూడాదాటి పోయెడి అతీత పూర్ణస్థితి, లేదా అచలస్థితి కలిగిననేకాని నాసదీయసూక్తము పేర్కొన్నదశకు సాధకుడు చేరుకొన్నట్లుకాదు. అందుకనియే నాసదీయసూక్తము అవరోహణ క్రమమునసృష్టి క్రమమును వర్ణించినది.సర్వోన్నతస్థానమునుండిఅనగాసహస్రారమునుండి పృథివివఱకు అవతరించిన మానవుడు మఱల సొంతసాధన చేత, పృథివినుండి జాలాదులద్వారా ఊర్ధ్వప్రయాణముచేసి సర్వోన్నతము, సదసదతీతము అయిన సహస్రారమునకేగ వలసియున్నాడు. కాగా నాసదీయసూక్తము సహస్రారాది పదములను మంత్రములలో వాడలేదు. అది సదసదతీతము అనుపదముతో మొదలిడి, తమస్సు, కామము, రేతస్సు, స్వధ-ఇత్యాది పదములనువాడి సృష్టివిధానమును నిగూఢముగాను, గంభీరముగాను, వ్యాఖ్యానాపేక్షముగాను, సూచించినది. అందుకే మనకు తైత్తిరీయోపనిషత్తు చెప్పిన రీతిగా ఆత్మనుండి ఆకాశాదులద్వారా పృథివివఱకు పంచ

భూతావతరణ ప్రకారము వివరింపబడినది. ఈ క్రమమే కుండలినీయోగ మార్గమున జీవస్థానము, అవ్యక్తస్థానము అయిన (ఆత్మ) భ్రూమధ్యము, లేక ఆజ్ఞాచక్రమునుండి ప్రాణ నివాసమును, వాయుస్థానమ్మునైన అనాహతము, పిమ్మట అగ్ని స్థానమైన మణిపూరము, ఆవల, జలస్థానమైన స్వాధిష్ఠము, తరువాత పృథివికి నిలయమ్మైన ఆధారము వినబడుచున్నవి. పృథివి, పరమాత్మకు పాదమన్నమాట. అందుకే విశ్వాత్ముని వర్ణించునప్పుడు "పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంత రాత్మా" అని ముండకోపనిషత్తు అన్నది.

ఈ విచారణనుబట్టి అవరోహణము, సృష్టిస్థితి ప్రళయ ములు కాగా, ఆరోహణము అమృతస్థితి, లేక ప్రకృతి బంధ ములనుండి మోక్షము అగుచున్నది. ఇదంతయు బ్రహ్మాం డమునందు ఎక్కడనో జరుగుట మాత్రమేకాదు. మన శరీర మైన పిండాండమునందే ఈ తాత్త్వికచర్య అంతయు జరుగుచున్నది.-ఈ సమస్తజ్ఞానమును నాసదీయ సూక్తము అతి గంభీరముగను, నిగూఢముగను, సాధక జనానుకూలము గను, తాత్త్వికానుభవానుసారముగను వివరించుచున్నది.

సహస్రారమునుండి-ఆజ్ఞ, విశుద్ధము, అనాహతము, మణిపూరము, స్వాధిష్ఠము, ఆధారము- అను సప్తలోకము లందును సృష్ట్యాదులు జరుగుచుండగా, మరల ఆరోహణ క్రమమున, జీవుడు లేదా కుండలినీ శక్తి భూమినుండి బయలు దేరి స్వాధిష్ఠానాది చక్రములను ఛేదించుకొనుచూ ఆజ్ఞా

చక్రమున కేగి, పృథివి మొదలుకొని అవ్యక్తము వఱకుగల అష్టప్రకృతులను తనలో లీనము చేసికొని, సహస్రారమున కేగి పరమసిద్ధినొందవలసి యున్నది. అచ్చటనే మనకు సత్తుగాని, అసత్తుగాని గోచరింపని అచలము, పరిపూర్ణము, శూన్యము అయిన స్థితి సంభవించుచున్నది. ఇంతటి మహా రహస్యమును నాసదీయ సూక్తములో సాధకులు పరిశీలించి ఆచరణకు తెచ్చుకొని ధన్యులు కావలసియున్నది.

ఈ సందర్భమున ఏకమునుండి అనేకము తోచుటను గూర్చి కొంత చర్చించుట యుక్తముగా నుండును. సదసదతీతమైన తత్త్వము- అచలము, పరిపూర్ణము శూన్యము, అజాతము, అస్పందము అని మనకు వేదము చెప్పుటయే కాక, మనయొక్క సమాధి సమయమునందలి అనుభవము కూడ చాటుచున్నది కదా! అచలము లేనిది చలనము కలుగుటకు వీలులేదు. అట్లే అస్పందమునుండియే స్పందమును కలుగవలసియున్నది. ఒక వస్తువు పరిపూర్ణమై యున్ననేకాని దానినుండి అపరిపూర్ణము వెలువడజాలదు. ఒక బృహత్పదార్థమునుండి, చిన్నిచిన్ని తునుకలు రాగలవు కాని, తునుకలనుండి పరిపూర్ణము ఏర్పడదు. అందుకనియే జగత్కారణ వస్తువును "బృంహతీతి, బృంహాయతీతి బ్రహ్మ" అనినారు. అది మాటలకు మనస్సుకు అందనంతటి పెద్దదన్న మాట. ఇట్లు చెప్పుకొనుటకూడ వ్యావహారికమే. అసలది నో బుద్ధులకు అందనంతటి అచింత్యము. అయినను

సదసదతీత పరమార్థమునుండియే దానికన్న అభిన్నమైన అవ్యక్త, మహదహంకార,ఆకాశాదులును, వాటి వికారములును వెలువడుచుండుననని మనము తెలియవలయును.

ఈ అంశములనే నాసదీయ సూక్తము సుస్పష్టముగాను, విస్పష్టముగాను వచించినది. మూల స్తంభాదులు దాని అర్థమునే వివరించినవి. మూల వస్తువును సత్తుగాని, అసత్తుగాని కాదని చెప్పుటలో ఆ సూక్తము ప్రోక్కిన ప్రోవ శాస్త్రీయమైనదే కాని, మూఢవిశ్వాసముతో గూడినది కాదు. ఆ మూలవస్తువు మీ మనోవాగ్బుద్ధులకూ, వాటి వికల్పములకు అందనంతటి గహనము, అచింత్యము, అవాచ్యము, అగమ్యము సుమా, అని చెప్పినది కదా. దానినే తరువాతి వాఙ్మయము పరిపూర్ణము, అచలము, శూన్యము సత్తు, చిత్తు, ఆనందము, బ్రహ్మము, ఆత్మ, పరమాత్మ ఇత్యాది పదములతో పేర్కొన్నది. ఆవల విశ్వకర్మ, పురుషుడు, హిరణ్యగర్భుడు, రుద్రుడు, విష్ణువు, త్వష్ట, ఇంద్రుడు ఇత్యాది పదములతో అది వచింపబడినది. అటుపై ఆ ఏకైక సత్పదార్థమునే బహునామములతో విజ్ఞులు పేర్కొన్నారనికూడ చెప్పి మన భేద దృష్టిని వేదము తొలగించి ఐక్య మార్గమును వక్కాణించినది.

కాన అచలము లేనిదీ చలనము కలుగదు. పరిపూర్ణము లేనిదీ అపూర్ణము వెలువడదు. ఆనందము లేనిదీ దుఃఖముతోచదు. ఈ విధముననే ఏకమునుండి ద్వంద్వ

ప్రపంచము తోచినది. ఆవల త్రిపుటి కలిగినది. కర్త, కర్మ, కార్యము అనెడి త్రిపుటిలేనిదీ జగము సాగదుకదా! కాన ద్వంద్వాత్మక త్రిపుటి సహిత జగమునకు మూలము పరమాద్వైతవస్తువే. అట్లే దేవుడులేనిదీ జీవుడురాడు. ఆ జీవుడు చివరకు దేవుడై మిగులక తప్పనూ తప్పదు. ఇట్టి నానాత్వమునే నాసదీయ మంత్రములు -తమస్సు రేతస్సు, కామము, స్వధ- ఇత్యాది పదములతో అతి గంభీరముగాను నిగూఢముగాను సూచించినవి. కాన ఏకమునుండి అనేకము యొక్క ప్రాదుర్భావము, మఱల ఆ అనేకము నర్థము చేసికొని ఏకరూపుడగుట ఇదియే సంసార స్వరూపము. సంసారమునుండి ముక్తి!

## విశ్వకర్మ సూక్త లక్ష్య యోగము

ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున విష్ణు మంత్రములలో కుండలినీ యోగము కలదనియు, అదియే ఆ మంత్రముల ప్రధాన లక్ష్యార్థమనియు చెప్పబడినది. అట్లే "త్ర్యంబకం యజామహే"అను మంత్రమున గూడ అందలి త్రిశబ్దముచేత ఇడా, పింగళా, సుషుమ్నలు సూచించబడి కుండలినీ యోగ ప్రస్తావన ఉన్నదని చెప్పికొన్నాము. అట్లే విశ్వకర్మసూక్తములు రెంటనుగూడ మహాగంభీరముగా కుండలినీయోగము ప్రస్తావింప బడినదని ఇప్పుడు తెలిసికొందుము.

ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తములు రెంటిలోను ఏడేసి చొప్పున మొత్తము 14 మంత్రములున్నవనియు, యజుర్వేదీయ విశ్వకర్మసూక్తమున 16 మంత్రము లున్నవనియు, అట్లుండుటకు గల కారణములను, రహస్యములను గూడ తెలిసికొందుము. యజుర్వేదీయ ప్రథమ విశ్వకర్మ సూక్తము నందలి "విశ్వకర్మా వ్యజనిష్ట దేవః" (చూడు 162 పుట) అను మంత్రమున విశ్వకర్మ నామముచే పేర్కొనబడిన జగత్కారణ పరమాత్మయే సృష్టికర్తయైన త్వష్ట, లేక బ్రహ్మ అయినాడనియు, ఆవల ఆయన సూర్యచంద్రులుగా రూపొందినాడనియు యజుర్వేద దర్శనమున చదివి యున్నాము. ఆ సందర్భమున బ్రహ్మయు, సూర్యచంద్రులును, విశ్వకర్మనుండియే, పుట్టినారని కూడ భావింపబడినది. అది బ్రహ్మాండపరమైన - జగత్పరమైన అర్థము. ఇప్పుడు, పిండాండ పరముగా అర్థము నాలోచించి చూతము. జగత్తులను, తనలో లీనము చేసికొనిన విశ్వకర్మయే జీవుల కర్మానుసారము పునస్సృష్టికి పూనుకొని దేవ,మనుష్య, తిర్యగాదుల ఉపాధులను సృష్టించి అందు ప్రవేశించినాడని విశ్వకర్మ సూక్త ప్రథమ మంత్రము వాకొన్నది. ("య ఇమా ........ ఆవివేశ")- అనగా పిండాండమునందు జీవరూపుడై వెలసిన వాడు విశ్వకర్మయే అని అద్వైతభావమును నిస్సందేహముగా ఆ మంత్రము చెప్పినదన్నమాట. ఇకపోగా, ఆ జీవాత్మ స్థూలశరీరమునందు కొంతకాలముండుటకు తగిన

లెస్సగా యెఱింగినట్టిదే. కనుక విశ్వకర్మనుండి మొట్ట మొదట తోచినవాడు - క్షేత్రజ్ఞుడైన జీవాత్ముడుకాగా, ఆవలివారు సూర్యచంద్రులు. అనగా ఇడా, పింగళానాడులు. సుషుమ్నానాడి జీవసంచార క్షేత్రమేకావున, పైమంత్ర ములో ప్రత్యేకించి చెప్పబడలేదు. అయినను ఉదాహరింప బోవుమంత్రమునందు దానిని పాఠకులు గమనింపగలరు.

ప్రాణశక్తి శరీరమునందున్నంత వఱకే, జీవుడు స్థూలమునందుండును. ఆప్రాణములు పోవునప్పుడు, వాటితో బాటు, జీవుడునూ లేచిపోవునని మనకు వేదాంతశాస్త్రమును, మహనీయుల అనుభవములును చాటుచునే ఉన్నవి. అందుకే యోగులగువారు ప్రాణాయామాది యోగాంగములను సాధించి, ఆ యోగము పరిపక్వస్థితికివచ్చునప్పటికి సుషు మ్నానాళమునందు, ప్రాణశక్తిని నడుపనేర్చి సుఖదుఃఖ సంకులమయిన సంసారమునుదాటి అమృతులగుచున్నారు.

ఈ విధముగా యజుర్వేదీయ విశ్వకర్మసూక్తము నందలి శివ మంత్రము పిండాండమున (శరీరమున)గల ఇడా, పింగళా, సుషుమ్నా నాళములను సూచించి ఆ మార్గమున కుండలినిని నడిపిధన్యులుకండని సాధకులకు అతిరహస్యముగా సూచించుచున్నది. అయితే, ఇంతటి మహత్తరార్థములు వేదమంత్రములందుకలవా, అని మీాకొకసందేహము కలుగ వచ్చును. అది అవిశ్వాసమూలకము. అజ్ఞానమువల్లకలిగి నదేకాని ఇతరముకాదు. మంత్ర, మంత్రార్థ, రహాస్యము

లను గాఢముగా భావించి, వేదపురుష హృదయమును తెలిసికొనగోరు వారికి ఇట్టి గంభీరార్థములే స్ఫురించు చుండును. వేదమిట్టి విశేషార్థములను చెప్పలేకున్నచో, అది కూడ సామాన్యవాఙ్మయమువలె ఉబుసుపోకకు చదువ వలసినదే కావలసివచ్చును. వేయేల? ఇట్టి పరమ సత్యార్థ ములను బోధింపలేకున్నచో, వేదమనుపేరే దానికి చెల్లదు. "విదజ్ఞానే" అనెడి ధాతువులౌకిక, పారమార్థికములైన సర్వా ర్థములను బోధించునట్టిదేకాని, ఏవోకొన్ని విషయములను బోధించి, కొన్నింటిని విడిచిపెట్టునట్టిదికాదు. అందునూ సృష్టి సూక్త, మోక్ష, పురుష, విశ్వకర్మ సూక్తాదులు ఇట్టి మహోత్కృష్టార్థములను బోధించుటకే వెలసినవని మనము చెప్పికొనుచునే యున్నాము. విష్ణు మంత్రములందును, త్ర్యంబకమంత్రమందును, కుండలినీయోగము, నిగూఢముగా ప్రస్తావింపబడగా, సృష్టిరహస్యములను బోధించెడి విశ్వకర్మ సూక్తమున ఆ యర్థము చెప్పబడక ఏలఉండును? ఇంకను వివరింపబోవు మంత్రములను బట్టియు, విశ్వకర్మసూక్త లక్ష్యార్థము కుండలినీయోగమని గ్రహింపగలము.

అసలు విశ్వకర్మసూక్త ప్రథమమంత్రమే, "ప్రథ మచ్ఛత్, అవరాన్, ఆవివేశ" అన్నదికదా! సమస్తమునకు పరుడైన—సర్వశ్రేష్ఠుడైన పరమాత్మ మొదట అవరము లైన (అల్పములైన) ఉపాధులలో ప్రవేశించినాడనికదా! ఆ వాక్యమునకు భావము. అనగా స్థూల, సూక్ష్మ, కారణ

రూపములైన ఉపాధులలో ప్రవేశించి జీవుడైనాడని భావము. అట్టిజీవునియొక్క నివాసస్థానములైన ప్రాణములు కూడ ఆతనికంటె అవరములే - తక్కువలేకదా! ఆ తక్కువవాటి యందు బంధింపబడి తత్త్వమును విచారించి తెలిసికొని సాధనచేసి, ముక్తుడగుటయే జీవుని లక్ష్యము. అనగా ఏ ప్రాణాదులు తన్నుబంధించినవో, వాటిమూలముననే - వాటిని సాధనములుగాచేసికొనియే తాను ముక్తుడుకావలసి యున్నది. అందుకే ఈ 8వ మంత్రమున-దేవ, గంధర్వ, చంద్ర శబ్దములచేత జీవ, సూర్య, చంద్రనాడులు సూచింపబడినవి. ఇంకను పరిశీలించి చూతము! ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తములోని రెండవ మంత్రము.

"యతో భూమిం జనయన్ విశ్వకర్మా,
వి ద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షాః."

అన్నది. అనగా ఆ విశ్వకర్మభూమిని సృష్టించెననియు, దివమువఱకు వ్యాపించెననియు భావము. ఇందలి భూమి అనుపదముచేత ఆధారచక్రము నందలి కుండలినీశక్తి సూచింపబడుచున్నది. ఆధారము పృథివీ భూతప్రధానమని మనమెఱింగిన విషయమే. సహస్రారమునందలి పరమాత్మ భూమిని-అనగా అందలి కుండలినిని సృష్టించినాడని భావము. ఇక తరువాతి వాక్యము -

"ద్యాం, మహినా, ఔర్ణోత్" అనునది. అనగా ఆ పరమాత్మ కుండలినిసృష్టించి, దానితోపాటు తక్కినలోకాలను, చక్రాలను సృజించి వీటన్నింటియందును తాను

వ్యాపించినాడని భావము. మంత్రమునందలి భూమి, దుశ్శబ్ద ములచేత ఆధారమునుండి సహస్రారమువఱకుగల సప్త చక్రములు చెప్పబడినవి. మంత్రమున ఆధారమొక్కటి మాత్రమే చెప్పబడినను దానినుండి పాదములవఱకుగల శరీరమంతయు పేర్కొనబడినట్లెక్క. ఎట్లన! ముండక శ్రుతి "పద్భ్యాం భూమిః" అన్నందున పృథివీశబ్దము పాదములవఱకుగల పిండాండమును చెప్పునట్టిదని ఎన్నవలసి యున్నది. విశ్వకర్మసూక్తమున "యతో భూమిం జనయన్ విశ్వకర్మా" అని ఒకచోటభూమిని, "ద్యావా భూమీ జన యన్ దేవ ఏకః" అని ఇంకొకచోట ద్యావా భూములను చెప్పుటచేతను ఆరోహణ, అవరోహణ క్రమములు ప్రస్తా వింపబడినవి. భూమి ప్రస్తావన కుండలినీ సృష్టిని, జగత్ సృష్టిని తెలుపుచు-ఆ జగము, అనగా అందలిజీవులు ఆరో హణక్రమమున ద్యులోకమునకు చేరవలసియున్నదనిసూచన. "ద్యావాభూమీజనయన్" అన్నప్పుడు "ఆత్మన ఆకాశ స్సంభూతః" అన్నట్లు అవ్యక్త మహదహంకార పంచతన్మా త్రల సృష్టిజరిగిదనిసూచన. ఈ రహస్యమునకు వ్యాఖ్యాన ములే ఉపనిషత్తులలోని సృష్టి కథావిధాన వర్ణనలు.

ఈ భావమునే "ద్యావా భూమీజనయన్ దేవఏకః" (3) "ద్యావాపృథివీ నిష్టతక్షుః" (4) "ద్యావాపృథివీ అ ప్రథేతామ్" (సూక్తము 82-1) అనెడి విశ్వకర్మ సూక్త మంత్రములుకూడ బ్రహ్మాండమునందలి ద్యావాపృథువుల

సృష్టినేగాక పిండాండమునందలి ఆధారమునుండి సహస్రారమువఱకుగల సప్తచక్రములసృష్టినిసైతము వర్ణించుచున్నవి. అయినను, ద్యావా పృథివీ శబ్దములచేత ఆధార, సహస్రారముల సృష్టిమాత్రమే చెప్పబడినదికదా! సప్తచక్రములని ఎట్లుభావింతుము, అని సందేహింతురా? దానికిదిగో సమాధానము.

"తేషా మిష్టాని సమిషా మదంతి
యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః."
(సూక్తం. 82-2)

ఇందలి సప్తఋషులు బ్రహ్మాండపక్షమున వసిష్ఠాదులుకాగా, పిండాండపక్షమున ఆధారాది సప్తచక్రములే. ఈ సప్తశబ్దము భూర్భువరాది సప్తలోకములకుగూడ సంకేతమని మనము మన వేదదర్శనములందు చదివియేఉన్నాము. సప్తఋషులనేగాక పంచభూత, పంచక్రియల సంకేతములయిన పంచఋషులనుకూడ విశ్వకర్మసూక్తము పేర్కొనకపోలేదని మఱువరాదు. చూడుడు -

"త ఆయజంత ద్రవిణం సమస్మా
ఋషయః పూర్వే జరితారో న భూనా." (సూ. 82-4)

ఇందుపేర్కొనబడిన పూర్వఋషులే సృష్ట్యాదికారకులైన సానగ సనాతనాహభూన ప్రత్న సుపర్ణులనెడి ఋషిపంచకము. ఈ విధముగా ఎన్నియో కుండలినీ యోగ

రహస్యములను విశ్వకర్మ సూక్తములు రెండును వెలువరించుచున్నవి.

"యా తే ధామాని పరమాణి యావమా
యా మధ్యమా విశ్వకర్మన్నుతే మా." (10-81.5)

ఈ మంత్రమున పేర్కొనబడిన-అవమ, మధ్యమ, పరమ ధామములకు, దేవ, మానవ, తిర్యగాదులు ఉపాధులని ప్రాచీనవ్యాఖ్యాతలు వ్రాసినారు. అది బ్రహ్మాండ పక్షార్థము. పిండాండపక్షమున జీవాత్మపొందిన - స్థూల, సూక్ష్మ, కారణ దేహములని మనము వ్రాసినాము. కుండలినీయోగ పక్షమున ఆ మూడుధామములు (నివాసములు) ఇడా, పింగళా, సుషుమ్నానాళములు. వీటిలో సుషుమ్న పరమ ధామము. కుండలినీశక్తిని ఆనాళముద్వారా, సహస్రారమునకు చేర్చునది-సుషుమ్నానాళమేకదా. అందుచేతనే అది పరమధామమగుచున్నది. ఇడాపింగళలలో కొంతకాలము ప్రాణాయామాది సాధనలు చేసిననేకాని, ఆవల ప్రాణవాయువు, లేదా ప్రాణశక్తి సుషుమ్నయందు ప్రవేశించి సహస్రారమునందలి పరమాత్మయొక్క సాన్నిధ్యము నందకొనలేదు. ఆత్మపరమాత్మల పరిజ్ఞానము కలుగుటకు ఈ మార్గమే ప్రముఖమైనది. తరువాత ఈ మంత్రముయొక్క ఉత్తరార్థ మేమనుచున్నదో చూతము.

"శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః
స్వయం యజస్వ తన్వం వృధానః." (81-5)

ఓ విశ్వకర్మ పరమాత్మా! నీకు మిత్రులవంటివారైన మమ్ము, ("సయుజా సఖాయా" నీ స్వరూపమే అయిన జీవాత్ములను) కుండలినీయోగసిద్ధులమగునట్లు చేయుదువు గాక. అంతేకాదు. తన్వం=మాశరీరమున, వృధానః=వృద్ధి పొందుచున్నాడవై (పరమాత్మ శరీరమున వృద్ధిపొందుట యనగా సాధకులకుపరమాత్మజ్ఞానాభివృద్ధికలుగుటయేకదా.) యజస్వ = కుండలినీయోగరూప యజ్ఞమును చేయుము, అనగా కుండలినీశక్తిని ఉద్దీపింపచేసి మమ్ము నీవంటివాని నొనర్పుమని సారాంశము. విశ్వకర్మసూక్త సర్వస్వమునకు సాధకులు సాధింపవలసిన లక్ష్యార్థము ఇదియే! వాచ్యార్థము ఐహికముకాగా, ఈలక్ష్యార్థము పారమార్థికమైనట్టిది. మన లను అమృతులను చేయునదికూడ. సూక్తము 81 లోని 6వ మంత్రముచేతకూడ తన కుండలినీయోగము ఫలింపవలెనని యోగి విశ్వకర్మనిట్లు ప్రార్థించుచున్నాడు–

"విశ్వకర్మన్ హవిషా వావృధానః,
స్వయం యజస్వ పృథివీ ముత ద్యామ్." 8

ఓ విశ్వకర్మా! నేను చేసెడి యోగవిధానముచేత నీవు నాలో ఆవరణభంగము కలిగించి వికాసముపొందిన వాడవై ఆధారమునుండి సహస్రారమువఱకుగల చక్రముల ద్వారా నాకు సాక్షాత్కారముకమ్ము అని భావము.

81వ సూక్తపు 3వ మంత్రములో ఆ జగత్కారణ విశ్వకర్మతత్త్వముయొక్క మహిమ యెట్టిదో వేదపురుషుడు "విశ్వతశ్చక్షురుత"-అనుమంత్రమున విశదీకరించినాడు. ఇందు విశ్వకర్మ అంతటా కన్నులు, ముఖములు, కాలు సేతులు కలవాడని ఆయన సర్వాత్మభావము ప్రశంసింపబడినది. ఈ మంత్రమే పురుషసూక్త, మంత్ర పుష్పాదులకు మూలమైన దని మనము చదివియేఉన్నాము. ఇంకను విశ్వకర్మతత్త్వమునుగూర్చి అది సర్వోత్కృష్టమనియు, సర్వాతీతమనియు "పరో దివా పరఏనా పృథివ్యాః....." అను మంత్రమున చదివియే యున్నాము. (చూడు 141వ పుట)

"మంచువంటి మీ అజ్ఞానమును పోగొట్టుకొని, ఇడా, పింగళా, సుషుమ్నానాళముల ద్వారా యోగసాధనచేసి, సహస్రారమునందలి పరమాత్మనేగాక, విశ్వాంతర్గతుడైన విశ్వబ్రహ్మను, విశ్వాతీత పరబ్రహ్మమునుకూడ ఎఱింగి జన్మ సార్థక్యమును సంపాదింపు"మని శ్రుతిమాత ప్రేరేపించుచున్నది. కనుక విష్ణు, రుద్ర, సవితృ, విశ్వకర్మాది మంత్రములద్వారా శ్రుతిమాత తనబిడ్డలను కుండలినీయోగోన్ముఖులను చేయుటకే యత్నించినదనుటలో ఎట్టిసందేహము లేదు.

వేదఋషులకు కుండలినీయోగమును గూర్చి తెలియునా అనికాని, అట్లు తెలిసినచో వారెచ్చటకాని, ఆపదమును ప్రయోగింపలేదేమి, అనికాని పాఠకులకు సందేహములు కలుగవచ్చును. వేదకాలపు ఋషులకు యోగమును

గూర్చి లెస్సగానే తెలియుననుటకు అనేకాధారములున్నవి. వారు యోగమును, కేవలము ప్రాణశబ్దముతోనే పేర్కొని నారు. దీనికితగినట్లే అథర్వవేదమున ప్రాణసూక్తమను పేర ఒకసూక్తమే బయలుదేరినది. "అన్నం, ప్రాణ, శ్చక్షుః, శ్రోత్రం, మనో, వాక్త్వక్" ఇత్యాది వేదవాక్యములు వారికి అన్నము, ప్రాణము, మనస్సు, మున్నగువాటిని గూర్చి బాగుగా తెలియుననియు, వారి పరిశోధనమంతయు వాటి మీదనే అనియు, మనము వేదముల గాఢపరిశీలనముచే తెలియజాలుదుము. మనస్సుయొక్క ప్రాముఖ్యమును, వేద ఋషులు, ఎంతోలోతుగానే గ్రహించినారు. అందుకనియే ఈ సూక్తమున "విశ్వకర్మా మనసా యద్విహాయా" "విశ్వకర్మా విమనా" ఇత్యాదిగా భగవద్విషయకమైన మనశ్శక్తిని గూడ వారు భావించినారు. సాధకులు సమనస్కులు, అమనస్కులుకూడ కావచ్చునని ఇందలిసూచన.

అసలు ప్రకృతి పరిణామములోనే పదార్థము (Matter) ప్రాణము (Life) మనస్సు (Mind) విజ్ఞానము (Knowledge) అనునవి ఒకదానికంటెను ఒకటి ప్రాముఖ్యము కలిగినట్టివి. వీటిపరిణామచరిత్ర నేటిసైంటిస్టులకును ఇంకనూ ఆలోచించి తెలియదగినదిగానే యున్నది. ప్రాచీనఋషులుకూడ విశేషముగా పదార్థ పరిశీలనముచేసినట్లే ప్రాణ, మనో, విజ్ఞానములను గూర్చియు పరిశోధనలుచేయకపోలేదు. అంతేకాదు. వాటికి విశేషశక్తినిచేకూర్చి పరిపక్వము చేసినారు, ఫలిత

ములనందినారనియే మావంటివారి విశ్వాసము. అయితే ఆనాడు గ్రంథములు వ్రాయుటకు తగిన సాధనలు లేనందున ఆ యా విశేషములను వారు సూత్రప్రాయముగామాత్రమే మంత్రములలో సూచించినారని మనమర్థము చేసికొనవలసి యున్నది. వారికి ప్రాణాయామాదులనెడి మాటకూడ తెలియకపోవచ్చును. అయిననువారు దానినిఆచరించి ఫలితముల నందలేదనుకొనుట సాహసము. నిరంతరము ముక్కునందు సంచరించు ప్రాణవాయువును బంధించినచో, ఏమగునోఅని సామాన్యమానవునకే ప్రేరణకలుగుచుండును. ఆతడు ఆ పనిచేసి దానిఫలితమును పసికట్టుచునే యుండును. అట్టిపని యొక్క పరిణామములే ప్రాణాయామ, ధ్యాన, సమాధి, సంయమాదులు. కావున యోగ, కుండలినీయోగ, పదముల ప్రయోగము మంత్రములలో కానరానందున వారికి వాటి పరిజ్ఞానములేదనుకొటయు, ఆనాడవి లేవేమో అనుకొనుటయు మన అజ్ఞానమునకు గుఱుతేకాని, ఇంకొకటికాదు. అసలు దురదృష్టమేమన, వేదమంత్రములనుగూర్చి మనకు అపార్థములు, అనర్థములు, తోచినంతగా- సదర్థములు,సమ్యగర్థములు, సంపూర్ణార్థములు తోచకపోవుటయే. దీనికంతటికిని కారణము- మనలో జిజ్ఞాస, ఆలోచన, విచారణ, ఏకాగ్రత, పరిశీలన, తపస్సు, అన్వేషణ, క్రొత్తవిషయములను కనిపెట్టవలయునను కోరిక - మొదలైనవి లోపించుటయే. అందుకే వేదము "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అన్నది.

కనుక ఆ మార్గమున పయనించినచో మనము "తమసో మా జ్యోతి ర్గమయ" అన్నస్థితికి చేరుకొనగలము. అందుకు నిరంతర సాధన అవసరము.

## మంత్ర సంఖ్యా రహస్యము

ఈ సందర్భమున ఇంకొక రహస్యము చెప్పవలసినది కలదు. నాసదీయ సూక్తములో సృష్టి కారణము సృష్టి స్వరూపము ఏడు మంత్రములలో మాత్రమే వర్ణింపబడినది. ఆ సృష్టిని తరువాత విస్తరించునట్టివి విశ్వకర్మ సూక్తములు. ఇవి రెండు. ఒక్కొక్క సూక్తమున ఏడేసి మంత్రములు మాత్రమే ఇందులో కూర్పబడినవి. ఈ ఏడు మంత్రముల సంఖ్య మనకు సృష్టి రహస్యమునే చెప్పుచున్నది కదా! వేదములో సప్తలోకములు,సప్త వ్యాహృతులు, సప్తచ్ఛందములు, సప్తార్చులు- మొదలైన సప్తకములు ప్రసిద్ధములు. పిండాండమున గూడ ఆధారము మొదలుకొని సహస్రారము వరకు సప్తచక్రములే కలవనుట యోగశాస్త్ర ప్రసిద్ధ విషయము. ఈ పిండబ్రహ్మాండముల తత్త్వమును కూడ విశ్వోత్పత్తిసూక్తములయిన నాసదీయ,విశ్వకర్మసూక్తములు అంతరర్థముతోనే కాక, శ్లోకసంఖ్యారూప బాహ్య స్వరూపముతోగూడ ప్రవచించినవన్నమాట. ఈ రహస్యమును స్థూలముగాగూడ సూచించవలెననెడి ఉద్దేశ్యము వేదపురుషునికి లేనిచో నాసదీయ, విశ్వకర్మ సూక్తములు మూడింటను ఏడేసి మంత్రములే ఉండుటకు కారణమేముండును? పంచ సంఖ్యా ప్రాధాన్యమును సూచించుటకు

మన కాలు సేతుల వ్రేళ్ళను అయిదేసి మాత్రమే నిర్మించినట్లు, సూక్తముల మంత్రసంఖ్యకూడ ఏడేసి చేయబడినది. ఇట్టి స్థూల, సూక్ష్మాంశములను పెక్కింటిని మనము తపోనిశితము, ఆలోచనా దివ్యము అయిన దృష్టితో పరికించి గంభీర పరమ సత్యములను అవగాహన చేసికొనవలసి యున్నది.

ఇంకొక పరమ రహస్యము. ఋగ్వేదీయ పురుష సూక్తములలో 14 మంత్రములు కలవు. అట్లే యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తములందు ఒక్కొక్కదానిలో ఎనిమిదేసి మంత్రములు కలవు. వాటిలో 16 ఆహుతులు సమర్పింప వలయుననుట యజ్ఞకర్మ రహస్యము. ఆవల "సముద్రాయ వయునాయ" అనెడి 17వ మంత్రముతో జలములయందు హావిస్సు నర్పింపవలసి యున్నది. ఈ సందర్భమున పురుష సూక్తమంత్ర సంఖ్యకును (16) యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తముల మంత్ర సంఖ్యకును పోలిక సరిపడుచున్నది కదా! ఈ పురుష, విశ్వకర్మ సూక్తములు రెండునూ విశ్వ సృష్టి ప్రకారమును వివరించునట్టివే అనుట సుస్పష్టము. సృష్టిలో షోడశవికారములను మనము గమనింతుము. ఆ వికారములను దాటిననే నిర్వికారమైన చిన్మయస్థితి సాధకు లకు కలుగునది. వేదమాత ఎంతటి కారుణ్యముతో ఇట్టి రహస్యములను బాహ్య స్వరూపముతోను, అంతఃస్వరూ పముతోను ప్రవచించినదో గ్రహించి మనము కృతార్థుల మగుటకు యత్నింపవలసియున్నది.

## పృథివి, అన్తరిక్షము, దివము

విశ్వకర్మ సూక్తములు పలుచోట్ల ద్యావా పృథువుల సృష్టిని, అందు పరమాత్మ తత్త్వ వ్యాప్తినిగూర్చి ప్రస్తావించినవి. ఈ ప్రస్తావనను ఆధారము చేసికొని తైత్తిరీయోపనిషత్తు ఎంతగానో తత్త్వమును విస్తరించి చెప్పినది. విశ్వకర్మ సూక్తము వ్యాఖ్యాతలకు వదలివేసిన అంతరిక్షమును కూడ తైత్తిరీయము వ్యాఖ్యానించి, తన విశ్వకర్మ సూక్తానుసరణమును సూచించినది. ఎట్లో చూతము.

"పృథి వ్యన్తరిక్షం ద్యౌర్దిశో౽వాన్తరదిశాః,
అగ్ని ర్వాయు రాదిత్య శ్చంద్రమా నక్షత్రా
ణ్యాప ఓషధయో వనస్పతయ ఆకాశ ఆత్మా
ఇత్యధిభూతమ్"— శీక్షావల్లి-7

ఈ మంత్రమున- పృథివి, (భూమి, భూలోకము) అన్తరిక్షము (ఆకాశము) దివము మొదటగా పేర్కొన బడినవి. తరువాత వాటికి అధిపతులుగాగాని, వాటియందు సంచరించువారుగాగాని, అగ్నిని, వాయువును, ఆదిత్యుని పేర్కొన్నారు. పృథివీ శబ్దముచేత ఆధారమును, అన్తరిక్ష శబ్దముచేత అనాహతమును, ద్యుశబ్దముచేత సహస్రారమును మనము గ్రహింపవలయును. ఏలయన! వీ టి యం దు సంచరించువారు వరుసగా- అగ్ని, వాయు (ప్రాణము), సవిత (పరమాత్మ)లే. బ్రహ్మాండపక్షమున గల పృథివ్యన్తరిక్ష దివములను పిండాండ పక్షమున ఆధార, అనాహత,

సహస్రారములనుగా భావింపవలసియున్నది. ద్యుశబ్దముచే చెప్పబడిన సహస్రారమునందుండువాడుసూర్యుడేఅని ఋగ్వేదమునందలి 160వ సూక్తమునందలి 5 మంత్రములు స్పష్టము చేయుచున్నవి.

"తే హి ద్యావాపృథివీ విశ్వశంభువ
ఋతావరీ రజసో ధారయత్కవీ,
సుజన్మనీ ధిషణే అంతరీయతే
దేవో దేవో ధర్మణా సూర్యః శుచిః." 1-60-1

ఇందు విశ్వక్షేమంకరములైన ద్యావా పృథువులను దేవునిగానూ, దేవతగానూ పేర్కొని వాటిలో ద్యులోకముననుండువాడు పరమాత్మ స్వరూపసూర్యుడే అని చెప్పబడినది. ఆ సూర్యునే ద్యావా పృథువులకు పుత్రునిగాను, వాటికి సృష్టికర్తగాను సైతము తరువాతి మంత్రములే వర్ణించినవి. "స వహ్నిః పుత్రః పిత్రో పవిత్రవా న్పునాతి ధీరో భువనాని మాయయా" (3). 2వ మంత్రమున "పితా మాతాచ భువనాని రక్షతః" అన్నది. ఇక 4వ మంత్రము "అయం దేవానా మపసా మపస్తమో, యో జజాన రోదసీ విశ్వశంభువా" సృష్టికర్తలలో గొప్ప సృష్టికారుడైన ఆ సూర్యుడే ద్యావా పృథువులచే లక్షింపదగిన జగములను కల్పించినాడన్నది. ఈ ద్యావా పృథువులను కన్నది విశ్వకర్మఅని 10-81, 82 సూక్తములు చెప్పగా, ఈ సూక్తము

ఆతనిని సూర్యుడన్నది. కావున సూర్యవిశ్వకర్మలకు అభేదమే.

పృథివీ శబ్దముచేత ఆధార, స్వాధిష్ఠాన, మణిపూర ములవఱకుగల చక్రములకు గ్రహణము. అట్లే అన్తరిక్ష పదముచేత అనాహత, విశుద్ధ చక్రములను గ్రహింపవలెను. ద్యుశబ్దముచేత ఆజ్ఞా సహస్రారములను గ్రహింపవలెను. అట్లయిననేకాని - అగ్ని, వాయు, ఆదిత్యులకు అవి విహార స్థానములుకావు. కుండలినీశక్తి తేజోరూపమేకావున దానిని అగ్నిఅనుటలో విరోధమేమియులేదు. ప్రాణము హృదయము ననే సంచరించునుగాన అన్తరిక్షము వాయు భూతస్థానమగు చున్నది. ఇక ఆదిత్యుని విహారము ఆకాశమునకునుపైనున్న దివమునసేకాన దానిచేత సహస్రారము, అందలి పరమాత్మ లక్షింపబడుచున్నారు. విశ్వకర్మ చేసిన పిండాండసృష్టిలో ఆధారమునుండి సహస్రారము వఱకుగల మూడుతావుల యందును అగ్ని కుండలినీరూపమునను, వాయువు ప్రాణ రూపమునను, ఆదిత్యుడు పరమాత్మరూపమునను వరుసగా పృథివ్యన్తరిక్షద్యుపదములచే లక్షింపబడిన ఆధార, అనాహత, సహస్రారములయందు ఉన్నారని తైత్తిరీయము వ్యాఖ్యానించినదన్నమాట. ఈ అంశమును పంచాధికరణ ములయందుకూడ తైత్తిరీయము స్పష్టము చేసినది. ఎట్లన.

"పృథివీ పూర్వరూపం, ద్యౌ రుత్తరరూపం, ఆకాశ స్సంధిః, వాయు స్సంధానమ్, ఇత్యధిలోకమ్."

ఈ మంత్రమున పృథివిని (ఆధారచక్రమును) పూర్వ రూపముగాను, దివమును (సహస్రారమును) ఉత్తరరూపము గాను, ఆకాశమును సంధిగాను, వాయువును సంధానము గాను చెప్పుట గమనింపదగినది. దీనినిబట్టి పృథివీశబ్దముచే తెలియదగిన ఆధారమునుండి ద్యుశబ్దముచే నెఱుగదగిన సహస్రారమునకుచేరుటకు-ఆకాశ, వాయువులు సంధి, సంధానములని చెప్పబడినవికదా. అనగా ఆధారమునందలి కుండలిని వాయువనెడి ప్రాణవాయుసాధనచేత సుషుమ్నా నాళము నందలి ఆకాశముద్వారా దివమునకు (సహస్రారమునకు)చేరి అందలి ఆదిత్యునిలో ఐక్యముకావలెననుట పరమార్థము. కావున విశ్వకర్మసూక్తము పేర్కొన్న ద్యావాపృథువులలో ఇంతటి గంభీరార్థము ఇమిడియుండి సాధకులను మేల్కొలుపు చున్నదన్నమాట. ప్రాణమనునది హృదయమున సంచరించుచు, సాధనచేయువారిపాలిట పరమగురువై కుండలినీ ప్రబోధమును కలిగించి, దానితోపాటు జీవాత్మను సహస్రారమునచేర్చి అమృతస్థితిని చేకూర్చుచున్నది. అందుకే తైత్తిరీయోపనిషత్తు ప్రాణప్రాధాన్యమును ఇంకనుఇట్లు వర్ణించినది.

"ప్రాణం దేవా అనుప్రాణన్తి - మనుష్యాః
పశవశ్చ యే - ప్రాణో హి భూతానామాయుః.
తస్మాత్సర్వాయుష ముచ్యతే. సర్వమేవ త
ఆయు ర్యన్తి-యే ప్రాణం బ్రహ్మోపాసతే."

- బ్రహ్మానందవల్లి 3.

ప్రాణముననుసరించియే దేహమునందు సర్వేంద్రియములు పనిచేయుచున్నవి. ప్రాణములులేనినాడు అవిపని చేయకపోగా, వాటితోపాటే తామును ప్రయాణించి పోవును. మనుష్యాదులైన సర్వప్రాణులును ప్రాణాధారమునసే నడయాడుచున్నారు. అందువలన సర్వభూతములకు ప్రాణమే ఆయువని చెప్పవలసియున్నది. ప్రాణమును బ్రహ్మముగా ఆరాధించువారందఱు ఆయుస్సౌభాగ్యముకలవారై ఒప్పుదురు. ఈ తైత్తిరీయవాక్యములు జీవితమునందు అనాహతచక్రమున వెలయుప్రాణమునకు ఎట్టిమహిమకలదో వక్కాణించుచున్నవికదా. అనేక మంత్రములు ప్రాణాయామాదులయు, కుండలినీయోగాదులయు ప్రాధాన్యమును వక్కాణింపగా, ఈ తైత్తిరీయము ఇట్లు ప్రాణశక్తిప్రభావమును కొనియాడినది. కావున పృథివ్యన్తరిక్షద్యులోకములనగా, ఆధార, అనాహత, సహస్రారములని మనము భావింపవలసియున్నది. అసలు కుండలినీయోగము చెప్పు రహస్యమేమన ! నీకంటెవెలుపలఉన్న పంచభూతములతో పాటు నీలోనే చక్రస్వరూపములైయున్న పంచభూతములను ఉపయోగించుకొని ధన్యుడవుకమ్మనెడి విషయమే. ఇక్కడ నీవనగా ఆత్మయే అని పాఠకులు మఱువరాదు. ఇందును గూర్చి ముండకశ్రుతి ఇట్లనుచున్నది.

“యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్ష మోతం మనః
సహ ప్రాణైశ్చ సర్వైః, తమేవైకం జానథ ఆత్మాన.
మన్యావాచో విముంచథామృతస్యైష సేతుః.” 2-2.5.

దేనియందు పృథివ్యన్తరిక్షద్యులోకములు, అనగా ఆధార, అనాహత, సహస్రారములును, మనఃప్రాణాదులును ఆధారపడియున్నవో, దానినే ఆత్మనుగా ఎఱుంగుడు. ఇతర మేమియు పట్టించుకొనవలదు. మీరు అమృతులగుటకు అది ఒక్కటే త్రోవ. అనగా సమస్తమునుభరించెడి ఆజ్ఞాచక్రస్థ ఆత్మయందును, సహస్రారస్థ పరమాత్మయందును ఆసక్తులై తత్సాక్షాత్కారమునకు పూనుడని ముండకశ్రుతి హెచ్చరించు చున్నది. ఈ ద్యావాపృథువులు జీవులకు మాతాపితృల వంటివారని మోక్షసూక్తమంత్ర మొకటి అనుచున్నది.

"ద్యౌర్మే పితా, జనితా నాభిరత్ర, బంధుర్మే మాతా పృథివీ మహీయమ్." 1-164-33.

ఇందలి ద్యావా పృథువులను సహస్రార, ఆధార చక్రములని యెంచవలయును. సహస్రారస్థ పరమాత్మ సృష్టికర్తకాగా, ఆధారస్థ కుండలిని ఆయన ప్రతిబింబమగు చున్నది. 10-81 వ సూక్తమేమో "యోనః పితా జనితా యో విధాతా" అన్నది. కాన ద్యుశబ్దము ఈశ్వర వాచకముకూడ.

## త్రి, సప్త-చక్ర రహస్యము

ఈ సందర్భమున సప్తచక్రములను గూర్చిన అపూర్వ రహస్యము నొకదానిని మనము గ్రహింపవలసి యున్నది. సప్తచక్రములు భూర్భువరాది సప్తలోకములకు సంకేతములు.

1. భూః=భూలోకము. ఇది ఆధారస్థానము. పృథివీ భూతమునకు నెలవు. 2.భువః=భువర్లోకము, ఇది స్వాధిష్ఠానము.నీటికి నెలవు.3. సువః=ఇదిసువర్లోకము. మణిపూరస్థానము. అగ్నికి (జఠరాగ్నికి) నెలవు. 4. మహః=మహర్లోకము. ఇది అనాహత స్థానము. వాయువునకు, లేక ప్రాణమునకు నెలవు. 5. జనః=ఇది విశుద్ధ స్థానము. ఆకాశమునకు నెలవు. ఇక్కడికి పంచభూత మయ చక్రములు ముగిసినవి. ఆఱవది-తపః=తపోలోకము-ఆజ్ఞాచక్రము. అవ్యక్తమహాదహంకారస్వరూప ప్రకృతికి (మాయకు) నెలవు. ఇదే సర్వకారణము. ఈ కారణశరీరమునందే_అవిద్యోపాధియందే సహస్రారస్థ పరమాత్మ ప్రతిబింబించి జీవుడను మాటచేత చెప్పబడుచున్నాడు. జరుగవలసిన తాత్త్విక తపస్సంతయు జరుగవలసినది ఇచ్చటనే కాన, దీనిని తపోలోకమన్నారు. ఇక ఏడవదే సత్యం=సత్యలోకము- సహస్రారము. అదియే పరమాత్మ స్థానము, పరమాత్మ స్వరూపము. ఆజ్ఞాచక్రస్థ జీవాత్మ ఈ పరమాత్మతో ఐక్యమగుటయే ముక్తి కాని, మోక్షము కాని. పిండాండమునగల భూమ్యాది సప్తలోకములు ఇవియే. కుండలినీ శక్తిని విష్ణునిగా భావించినప్పుడు ఆ విష్ణువు మెట్టెడి సప్తలోకములు ఇవియే. ఈ అంశమునే దిగువ మంత్రము- అతో దేవా అవన్తునః" అన్నమంత్రము చెప్పినది (చూడు 53వ పుట)

ఇక్కడ దేవతలనగా కుండలినీ ప్రయాణ సమయమున సాధకునకు కలిగెడి శక్తులే అన్నమాట. మంత్రములో

పృథివ్యా స్సప్తధామభిః' అని ధామశబ్దమును వాడుట గమనింపదగియున్నది. విశ్వకర్మసూక్తముకూడ "యా తే ధామాని పరమాణి యావమాయా మధ్యమా" అని ధామ శబ్దమునే వాడినది.

"ఇదం విష్ణుర్విచక్రమే" అన్న మంత్రమేమో విష్ణువు ఆధారమునుండి మూడు స్థానములయందు పాదన్యాసము చేసినాడన్నది. ఆధారముతో మూడు కావచ్చును. దానిని వదలి మూడు కావచ్చును. ఇంకొక మంత్రమేమో-

"త్రీణి పదా విచక్రమే, విష్ణుర్గోపా అదాభ్యః" 18 అన్నది. 8.12-27వ మంత్రముకూడ "యదా తే విష్ణురోజసా, త్రీణి పదా విచక్రమే" అన్నది. ఇంకొకటి "త్రీణ్యేక ఉరుగాయో విచక్రమే, యత్ర దేవాసో మదన్తి" (8.30-7) ఇంకొకటి "యస్యత్రీ పూర్ణా మధునా పదా" (1-154-4) అన్నది. సప్తస్థానములు, (లోకములు) అన్నప్పుడు మనకు సందేహము రాదుకాని, మూడు అన్నప్పుడే శంకకలుగును. ఒక పక్షమున స్వర్గమర్త్యపాతాళములని చెప్పికొనవచ్చును. ఇంకొక పక్షమున భూర్భువస్సువర్లోకములని చెప్పికొనవచ్చును. ఉపనిషత్తు "భూర్భువ, స్సువ రిత్యేతా స్తిస్రో వ్యాహృతీయః" అన్నది. దానినిబట్టి భూర్భువ స్సువర్లోకములా అనియు శంక రాగలదు. కాగా దీనిని గూర్చి గాఢముగా విచారింపవలసియున్నది. విష్ణువు మెట్టినది బాహ్యములైన త్రిలోకములు అన్నప్పుడు ఇబ్బందిలేదుకాని,

ధామములన్నప్పుడు ఈ ఏడింటిలో ఏవి త్రిధామములో విచారింపవలసియున్నది. ఈ సందర్భమున కొన్ని త్రికములు మన ఎదుట నిలుచుచున్నవి.

ఆధారము మొదటిదీ, కుండలినికి నెలవు కాన అది మొదటి ధామమే. ఆవల ప్రాణస్థానమైన రెండవ ధామమును చెప్పికొనవలయును. ప్రాణాయామముతోగాని కుండలిని మేల్కొనదు కాన, దానిని చెప్పికొనక తప్పదు. ఇక మూడవ దానినిగా ఆజ్ఞను గ్రహింపవలసి యున్నది. అది తపోలోకము కావునను, ధ్యాన సమాధులు మొదలైన తపస్సులు అక్కడే నెఱవేఱవలసి యున్నందునను దానిని గ్రహింపక తీరదు. ఆ పక్షమున- ఆధారము, అనాహతము, ఆజ్ఞ- అను త్రిచక్రములను గ్రహించుట సమంజసము. ఇక ఆధారము కుండలినికి నెలవే కనుక, దానినే మేల్కొలుప వలసి యున్నది కాన, దానిని వదలి, అనాహత, ఆజ్ఞా సహస్రారములను గ్రహించుట ఇంకొక పక్షము. మొదటి దైన ఆధారమును వదలినట్లే, గమ్యమైన సహస్రారమును కూడ వీడి, మణిపూరమును కలుపుకొని 1. మణిపూర, 2. అనాహత, 3. ఆజ్ఞలను చెప్పికొనుట ఇంకొక పక్షము. సాధకుడు కుండలినీ ప్రబోధానంతరము మణిపూరానాహత ఆజ్ఞలయందు చేయవలసిన సాధన కొంత కొంత యున్నది. మణిపూరము జఠరాగ్నికి నివాసము కాన, ప్రాణస్థానమైన నాహతమునందువలెనే దానియందును కొంత సాధన చేయ

వలెననుట కుండలినీయోగులెఱింగిన రహస్యమే. కావున త్రిస్థానములను చెప్పికొనవలసివచ్చినప్పుడు భిన్నాభిప్రాయములను వెలిపుచ్చక తప్పలేదు. ఋగ్వేద దిగ్దర్శములయందు కొందఱీ సందేహము వెలిపుచ్చినందున దానినిక్కడ వివరింపవలసి వచ్చినది. "పృథి, వ్యన్తరిక్షం, ద్యౌః" అనెడి తైత్తిరీయ వచన ప్రకారమయితే- ఆధార, అనాహత, సహస్రారములను గ్రహింపవలసి యున్నది. ఆ పక్షమున పృథివి అన్నప్పుడు స్వాధిష్ఠ మణిపూరములకును, అన్తరిక్షమన్నప్పుడు అనాహత విశుద్ధములకును గ్రహణము. ఇక ద్యుశబ్దముచేత సహస్రారముతోగూడ ఆజ్ఞను సైతము గ్రహింపవలసియున్నది. ఏలయన, సహస్రారముసిద్ధిస్థానమే కాని, సాధనస్థానము కాదు. అందు సాధకుడనుభవించునది మోక్షానందస్వరూప, బ్రహ్మైకైక్య సంసిద్ధినేకాని, సాధనాదికమును చేయుటకాదు. అయినను కడపటి గమ్యము అదియేకాన మంత్రములు దానిని పేర్కొనుటలో అర్థము లేకపోలేదు.

అంతేకాదు. సహస్రారమనెడి సర్వకారణస్థానము లేనిచో ఆజ్ఞాదులకు జన్మమే యుండదు. సహస్రారమునుండి కలిగినట్టిదే మాయాశక్తి. దీనినే నాసదీయసూక్తము తమస్సనియు, విశ్వకర్మసూక్తము నీహారమనియు, సాంఖ్యము ప్రకృతి అనియు పేర్కొన్నవి. మాయాప్రతిబింబమైన జీవా

త్మయే సాధకుడుగదా. ఆతడే తన్ను ఆవరించిన అవిద్యావరణమును యోగసాధనద్వారా తొలగించుకొని ముక్తుడు కావలసియున్నాడు. కాన, అజ్ఞను చెప్పకొననిచో అసలు కథయే కొనసాగవీలులేదు. కావున పృథివీశబ్దముచేత ఆధారస్వాధిష్ఠమణిపూరములను, అన్తరిక్షశబ్దముచేత అనాహతవిశుద్ధములను, ద్యుశబ్దముచేత ఆజ్ఞా సహస్రారములను గ్రహించుట పరిష్కారము కాగలదు.

ఇక పురుషసూక్తముచెప్పిన చతుష్పాదముల ప్రకారము సమన్వయమును ఆలోచించిచూతము. పురుషసూక్తము పురుషుని నాలుగుపాదములలో ఒకటి (చివరిది) సమస్త భూతప్రపంచము అని చెప్పినది - "పాదోఽస్య విశ్వా భూతాని" అని. దీనిచేత మనము పృథివీనివాసమైన ఆధారమును గ్రహింపవలయును. అటుపిమ్మట "త్రిపాదస్యామృతం దివి" అన్నది. అనగా తక్కిన త్రిపాదములు దివము, అమృతమును అన్నమాట. ఈ త్రిపాదములను భగవంతుని త్రిధామములుగా చెప్పకొన్నచో, మనకుపరిష్కారము సులభము కాగలదు. ఆ త్రిధామములే మణిపూర, అనాహత, ఆజ్ఞా చక్రములు కాగలవు. అప్పడు కుండలినీస్థానమైన ఆధారమును, గమ్యమైన సహస్రారమును వదలి లెక్కగట్టినామన్నమాట. ఇక్కడకూడ ఆజ్ఞతోపాటు సహస్రారమునుకూడ కలుపుకొన్నను, ఎట్టిఅనుపత్తియు ఉండదు. ఇంతకూ వేదవాక్యములు భిన్నభిన్నార్థప్రతిపాదకములుగా ఉండునుకాన

వాటిని సముచితముగా సమన్వయించుకొని సాధనకు పూన వలసిన బాధ్యత మనపైనున్నది. డా॥ P. S. శాస్త్రిగారు ఋగ్వేదదిగ్దర్శన ఆంగ్లపీఠికలో, నేనువ్రాసిన భిన్నాభిప్రాయములను ఎత్తిచూపగా, అట్టిసందేహము పాఠకులకును కలుగునుగాన ఈవిస్తరమును, ఇందలి రహస్యములను ఇక్కడ వివరింపవలసి వచ్చినది. అన్యప్రదేశములందును ఇట్టిలఘుసందేహములు పాఠకులకు కలిగినచో వాటికితగిన కారణములుండునని గ్రహింపగోరుచున్నాను.

## సూర్య, చంద్రాగ్నులు

ప్రకృతిలోకాని, జగత్తులోకాని సూర్య చంద్రాగ్నులది గొప్పస్థానము. సూర్యచంద్రులు లేకున్నచో దివారాత్రులే ఏర్పడుటకు వీలులేదు. దివారాత్రులులేకున్న కాలమే కొనసాగదు. ప్రాణులకు పనిచేసికొనుటకు గాని, నిద్రించుటకు(విశ్రాంతికి)గాని ఒకవిభాగముననదే ఏర్పడదు. అందుకే దివారాత్రులు, వాటి అధిపతులుఅయిన సూర్య చంద్రులు పరమప్రాధాన్యము నందుచున్నారు. వీరిరువురి తరువాత పేర్కొనదగినది అగ్నిభూతము. అగ్నిలేనిదీ లోకమున పనులుసాగకపోగా, ప్రాణులరక్షణకే వీలుండదు. రాత్రివేళలయందు వెలుగును అగ్నిచే కలిగినదీపాదులవల్లనే పొందుచున్నాము. విద్యుత్తుగూడ అగ్నివికారమేకదా. గర్భమునందు జఠరాగ్నియున్ననేకాని ప్రాణులుతినెడి ఆహా

రము జీర్ణముకాదు. అందుకే గీతలో భగవానుడు "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్" నేనుజఠరాగ్ని రూపుడనై జీవులుతిన్న భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య రూపములైన చతుర్విధాన్నములను జీర్ణింపజేయుచున్నాను అన్నాడు. కాన అగ్ని అన్నము పచన మగుటకును, తిన్న ఆహారము జీర్ణమగుటకును ముఖ్యమే. లోకమున ఈ విధముగా జనోపకారులైన సూర్యచంద్రాగ్నులు వేదమున కూడ ప్రముఖస్థానమునే ఆక్రమించియున్నారు. ఋగ్వేదము మొదట "అగ్నిమీళే పురోహితమ్" అనెడి అగ్నిసూక్తము తోనే ప్రారంభమగుచున్నది. అంతేకాదు. పదిమండలములు కల ఋగ్వేదములోని ప్రతిమండలమును అగ్ని స్తోత్రము (సూక్తము)తోనే ప్రారంభమగుటను మనము కాంచగల్గుదుము. అంతియేకాదు. ఏ వైదికకర్మలోనైనను దేవతల కర్పించు ఆహుతులు అగ్నిద్వారానే వారి వారికి చేరుచున్నవి.

ఇక ఈ అగ్ని భూతాగ్ని, విద్యుదగ్ని, జఠరాగ్ని-అని మూడువిధములుగానున్నది. భూతాగ్ని స్థూలమైన పంచ భూతములలో ఒకటి. విద్యుదగ్ని మెఱుపురూపముగానుండు నది. జఠరాగ్ని గర్భములోనుండునదని చెప్పుకొనియే యున్నాము. ఈ అగ్ని, దేవుడుగాను, భూతముగాను పేర్కొన బడుటయేకాక, పరమాత్మరూపముగాగూడ వర్ణింపబడినాడు.

"అగ్నిః శుచివ్రతతమః శుచి ర్విప్రశ్శుచిః,
కవిః, శుచిరోచత ఆహుతః." ఋ. 8-44-21.

ఇందలి శుచివ్రతతమః అనుపదమునకు పవిత్రములైన సృష్ట్యాదికర్మలు కలవాడని భావము. అనగా సాక్షాత్తు పరమాత్మ అనియేకదా సారాంశము. ఇన్నిరీతుల జనులకు అగ్ని ఆరాధ్యుడు. అంతేకాదు. పరమాత్ముని యొక్క సంతానమనికూడ అగ్ని, వేదములందు పేర్కొనబడినాడు. "మహి త్వాష్ట్రి మూర్జయంతీ రజుర్యం" (ఋ.3-7-4) 'త్వాష్ట్రిం' అనగా త్వష్టయొక్క కుమారుడని (త్వాష్ట్రిం=త్వష్టుస్సుతం) సాయణులు భాష్యము వ్రాసినారు. త్వష్ట విశ్వకర్మ కుమారుడని మనకు పురుషసూక్తము చెప్పుచునే యున్నదికదా. (విశ్వకర్మణ స్సమవ ర్తతాధితస్య త్వష్టా విదధద్రూప మేతి) ఇట్లు అగ్నియొక్క ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక రూపములు స్పష్టమగుచున్నవి.

ఇక సోముని చూతము. సోముడనగా చంద్రుడనియు, సోమలతయనియు రెండర్థములు. చంద్రుడు మింటవెలుగువాడు. లతయేమో, యజ్ఞాదులయందు త్రాగెడి సోమరసము నొసగునది. ఈ సోమమునకే అమృతమనికూడ పేరు కలదు. ఇట్టి సోముని, సోమలతను గూర్చి ఋగ్వేదనవమమండలములోని 113 సూక్తములు, తక్కిన మండలములలోని కొన్ని సూక్తములు పరిపరి విధముల స్తుతించినవి. ఋగ్వేద దిగ్దర్శనము 3వ భాగమునసోమదేవతను గూర్చి (194 నుండి 205)

చర్చించినాము. ఆ మంత్రములలో చంద్రుడు. నిశాకరుడు గానే కాక, సోమరస స్వరూపుడు, పరమాత్మస్వరూపుడు, మోక్షదాత- ఇత్యాదిగా ఎన్నబడినట్లు గ్రహించియున్నాము. కనుక అగ్నికివలె సోమునికిగూడ వేదములందు గొప్ప స్థానమే కలదు.

ఇక సవిత : సవిత అనగా సూర్యుడని స్థూలముగా మనకు తెలిసిన విషయమే. సూర్యుడు దివాకరుడై పగటికి నాయకుడగుచున్నాడు. అది ఆయన ఆధిభౌతికరూపము. ఇదికాక, దేవుడుగా సూర్యునికి ఆధిదైవికరూపమును కలదు. ఈ సూర్యుడు 12 రూపములు (భాగములు) కలవాడు. అందుకే "ద్వాదశాత్మా దివాకరః" అన్నారు. ద్వాదశ మాసాకారుడైన సూర్యుడు కాలస్వరూపుడని ఋగ్దర్శన తృతీయభాగమున చదివినాము.ఇట్టి సవిత పరమాత్మ స్వరూపుడు అనికూడ మన గాయత్రీ మంత్రము స్పష్టము చేయు చున్నది.సహస్రార పద్మవాసియైన జగత్కారణమీసవితయే అని మనము మన దర్శనములలో చదివియే యున్నాము. ఇక పోగా ఈ సూర్యచంద్రాగ్నులను గూర్చి విశ్వకర్మ సూక్త మేమి చెప్పుచున్నదో చూతము.

"విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవ ఆది
ద్గంధర్వో అభవ ద్వితీయః,
తృతీయః పితా జనితౌషధీనాం."

(యజర్వేదీయ విశ్వకర్మ సూక్తము)

విశ్వకర్మ మొదట దేవుడు (త్వష్ట, లేక బ్రహ్మ)గా రూపొందినాడనియు, ఆవల రెండవవాడుగా గంధర్వుడు-సూర్యుడు అయినాడనియు, పిమ్మట మూడవ వాడుగా ఓషధీశుడయిన చంద్రుడయినాడనియు ఆ మంత్రముయొక్క భావము. ఈ మంత్రముయొక్క నిగూఢార్థము విస్తరముగా "యజుర్వేద దర్శనమున" వివరించినాము. విశేషములనందు చూడవచ్చును. ఈ మంత్రమున పేర్కొనబడిన బ్రహ్మ, లేక త్వష్ట విశ్వసృష్టికర్తకాగా, సూర్యచంద్రులు కాలస్రష్టలయినారు. చంద్రుడు సోముడేకాన, ఆతడు అమృత స్వరూపుడు కూడ అగుచున్నాడు. ఇట్లే ఇరువురు సృష్టికర్తతో గూడ విశ్వకర్మకు తనయులై జగద్వ్యవహారము జరుగుటకు కారకులగుచున్నారు. ఇక అగ్నికూడ త్వష్ట్రదేవుని పుత్రుడే అని ఇంతకు ముందే చదివి యున్నాము. కాగా బ్రహ్మాండ చక్రము తిరుగుటకును, జనజీవనము సాగుటకును సూర్య చంద్రాగ్నులు పరమ కారణులగుచున్నారు. ఇక పిండాండమైన శరీరమున వీరి ప్రాధాన్యమును, ఉపయోగమును, మోక్షప్రదత్వమును విచారించి చూతము.

సూర్యచంద్రాగ్నులు మానవ శరీరముననే ఉన్నారు. అగ్ని జఠరమునందుండి జఠరాగ్ని అని పిలువబడుచు మనము తిన్న ఆహారమును జీర్ణింపజేయుచున్నాడని చెప్పుకొనియే యున్నాముకదా. ఇక సూర్యచంద్రులకు ఇడా పింగళలనెడి కుడి, ఎడమ నాసికానాడులని పేర్లు. ఆ ఇడాపింగళలనెడి

నాళములకు అధిదేవతలు సూర్యచంద్రులే. ఇడా నాడి సూర్యదైవతముకాగా, పింగళానాడి చంద్రదైవతమగుచున్నది. ఈ నాళములయందే ప్రాణవాయువు సంచరించుచు జీవులను బ్రతికించుచున్నది. కనుక ప్రాణవాయు సంచారమునకు సూర్యచంద్రులు ఆధారభూతులగుచున్నారన్నమాట. ఈ ఇడా పింగళలను గూర్చి, అందలి వాయు సంచారమును గూర్చి చెప్పెడి శాస్త్రమును మనము స్వర శాస్త్రమని పిలుచుచుందుము. అనేకులు స్వరమునుబట్టియే మనుష్యులకు శుభాశుభ ఫలములను చెప్పుచుందురు. ఈనాడులకు ఇడా పింగళలనియే కాక, సూర్యచంద్రనాడులని కూడ పేరు కలదు. ఈ రెండు నాడులకు మధ్యనుండు సూక్ష్మనాళమునే సుషుమ్నానాడి అని అనుచుందురు. ఇడా పింగళలు సూర్యచంద్రులు అధిదైవతములుగా గలవి అగుచుండగా సుషుమ్నానాళము అగ్ని అధిదేవతగా గలదగుచున్నది. ఈమాటికి- గంగా,యమునా, సరస్వతులనికూడ సంకేతము. ప్రయాగ క్షేత్రమునగల గంగా యమునలు తెల్లగాను, నల్లగాను పైకి అగపడుచుండగా, సరస్వతి అంతర్వాహినియై లోపలనే యుండి పైకి కనబడదు. అట్లే శరీరమునందును ఇడా పింగళలు పైకి అగపడుచుండగా, సుషుమ్న లోపలనే యుండి మనకగపడదు. అందుకే దానిని అంతర్నాడి అని కూడ అన్నారు. బ్రహ్మనాడి అనుట కూడ కలదు. జీవుడా నాడీద్వారమున ఊర్ధ్వ ప్రయాణమునేసి సద్గతిని పొందునని శాస్త్రములును, యోగుల అనుభవములును చాటుచున్నవి.

ఈ గంగా యమునా సరస్వతులను గూర్చియే బ్రహ్మము గారు "మూడు కాల్వలు దాటలేరన్నా. ఈ మూఢజనులు- మూఢు కాల్వలు దాటలేరన్నా" అన్నారు. ఈ వాక్యము కుండలినీయోగము కష్టమని తెలుపుచున్నది కదా! సుషుమ్నకు అగ్నియు, బ్రహ్మమును అధిదైవతములని చెప్పి నందున దాని ప్రాముఖ్యమును, యోగమున దానికి గల ప్రాధాన్యమును గ్రహింపగలము. శరీరమున సూర్య చంద్రాగ్నులుండి ప్రాణ సంచారమునకు వీలు కల్పించి దానిని నడుపుచున్నారనగా ఇదియే.

ఇక వీటిమూలమున చేయు యోగప్రక్రియను పరిశీ లింతము. శరీరమున జీవుడు నిలుచుటకు ప్రాణములు ముఖ్య ములు. ఇవి ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము- అని అయిదు విధములు. హృదయ ప్రదేశమున ప్రాణమును, గుదస్థానమున అపానమును, నాభి (బొడ్డు) దేశమున సమానమును, కంఠమునందు ఉదానమును, శరీరమునందెల్లెడల వ్యానవాయువును ఉండి తమ తమ ధర్మములను నిర్వర్తించుచుండును. ఈ అయిదింటిలోను హృదయమునగల ప్రాణవాయువునకే ముఖ్యప్రాణమని పేరు. యోగులు చేయు ప్రాణాయామ ప్రక్రియలో ఈ ప్రాణ వాయువునకే పని. ముక్కురంధ్రములందు సంచరించు ఈ ప్రాణమును వెలుపలికి విడుచుట, లోపలికి పీల్చుట, లోపల

నిలుపుట మూలమున చేసెడి పనినే ప్రాణాయామమని యందురు. ఈ మూడు పనులకు వరుసగా- రేచక, పూరక, కుంభకములని పేరు. ఈ రేచక, పూరక, కుంభకముల ద్వారా యోగులు వాయు జయమును సాధించి శరీరారోగ్య మును కాపాడుకొనుటయేగాక, జరామరణ వ్యాధులను గూడ గెలిచి చిరకాలము జీవించుచున్నారు. బ్రహ్మము గారును, ఆయన శిష్యులును అట్టివారే. మన పురాణము లందు వర్ణింపబడిన పరమశివుడు మహాయోగీశ్వరుడని వర్ణనలు కలవు. ఈ ప్రక్రియ మదీయ యోగదర్శన గ్రంథమునందు వివరింపబడినది. ప్రాణాయామము తర్వాత ప్రత్యాహార, ధ్యాన, ధారణా, సమాధులు కలవు. ఈ ఎనిమిదింటి సమూహామునకే అష్టాంగ యోగమని పేరు. బ్రహ్మంగారి శిష్యులందరు అష్టాంగ యోగాభ్యాసపరులే. ఈ యోగముచేత యోగులకు అణిమాదులైన అష్టసిద్ధులే కాక, మనోజయము, ఇంకా ఎన్నెన్నో మహిమలు, పూర్వో త్తర జన్మల జ్ఞానము, నిగ్రహానుగ్రహ సామర్థ్యము మొద లగు సిద్ధులు కలుగగలవు. బ్రహ్మంగారు మొదలగు మహాత్ములిట్టి సిద్ధులను సంపాదించిన సిద్ధపురుషులే. స్వచ్ఛంద మరణము, కోరుకొన్న ఉత్తమోత్తమ జన్మాదులు కూడ యోగశక్తిచే లభింపగలవు. అందుకే గీత-

"తపస్విభ్యో ఽధికో యోగీ జ్ఞానిభ్యో ఽపిమతో ఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీభవార్జున!"

-గీత-6.46.

అని కర్మలోనర్చువారికంటెను, తాపసులకంటెను, జ్ఞానుల కంటెను యోగి గొప్పవాడని ప్రశంసించినది.

## కుండలినీ యోగము

అష్టాంగ యోగమేకాక కుండలినీ యోగమని ఇంకొకటి కలదు. మానవ దేహమున సూర్యచంద్రాగ్ను లున్నారని చెప్పికొన్నాము కదా! సూర్యచంద్రనాడుల యందు ప్రాణవాయువు సంచరించుచుండును. అట్టి ప్రాణ వాయువును వశపఱచుకొని దానిని సుషుమ్నయందు సంచ రింపజేయగలిగినచో, తద్ద్వారా కుండలిని మేల్కొని సుషుమ్నా మూలమున బ్రహ్మరంధ్రమున కెగబ్రాకి బ్రహ్మ ప్రాప్తికి హేతువు కాగలదు. అగ్నికి వాయు సఖుడని పేరు. అనగా వాయువు స్నేహితుడుగా కలవాడన్నమాట. కావుననే వాయుసంయోగమున అగ్ని వెంపొందుచున్నది. ప్రాణాయామ ప్రక్రియలోకూడ ఇడా పింగళలయందలి ప్రాణవాయువుయొక్క సంచారరూపమైన ప్రాణాయామము చేత అగ్నిదైవతమైన సుషుమ్న ప్రజ్వరిల్లి విప్పారి (కుండలిని మేల్కొని అన్నమాట) సహస్రారమువఱకు వ్యాపించి బ్రహ్మప్రాప్తిని, బ్రహ్మసాక్షాత్కారమును, బ్రహ్మానుభూతిని కలిగించునన్నమాట. అందుకే గాలి అగ్నికి మిత్రుడు!

ఇంకొక రహస్యమును యజుర్బ్రాహ్మణ ప్రథమాష్టక మంత్రము అత్యపూర్వముగాను, సత్యానుభవ సమ్మతము గాను చాటుచున్నది. అందు పేర్కొనబడిన విశ్వకర్మాది

పంచాచార్యులు ఎంతగా ఆరాధనీయులో పరిశీలింపుడు-

"స ప్రథమ స్సంకృతి ర్విశ్వకర్మా,
స ప్రథమో మిత్రో వరుణోఽగ్నిః,
స ప్రథమో బృహస్పతి శ్చికిత్వాన్."
—యజుర్బ్రాహ్మణ ప్రథమాష్టకమ్.

కృతిఅనగా కర్మ,సమీచీనము అనగా యోగ్యమైనది. అట్టి సృష్ట్యాది కర్మలు కలవాడు సంకృతి అని భావము. అనగా సృష్టికర్త, లేక శిల్పాచార్యుడు అని అర్థము. పై మంత్రము-విశ్వకర్మను, మిత్ర, వరుణ,అగ్ని, బృహస్పతులను మొట్టమొదటి సంకృతులు, అనగా సృష్టికర్తలని చెప్పు చున్నది. విశ్వకర్మ అనగా జగత్కారణ పరబ్రహ్మమని అంద తెలిసిన విషయమే. ఆతడే పిండాండమున సహస్రార స్థిత పరమాత్మ. తరువాతివారైన మిత్రావరుణులు ప్రాణా పాన స్వరూపులు. మిత్రావరుణులు ప్రాణాపానములని యజుర్వేదమన్నది. "ప్రాణోవై మిత్రో అపానో వరుణః" (5-3-17.) ఈ ప్రాణాపానములు దేహమునందుండి దానిని జీవింపజేయునట్టివని మనకెరుకయే. ఇక నాల్గవవాడు అగ్ని. అగ్ని సుషుమ్నా నాడికి సంకేతముకదా. మోక్షార్థులు సుషుమ్నానాళమున ప్రయాణము చేసీకాని ముక్తులుకారు. ఇకపోగా చివరివాడు బృహస్పతి. బృహస్పతిది గురుస్థానము కదా. అతడు సత్వగుణ సంపన్నులగు దేవతలకు గురువని మనమెఱుగుదుము. గురువనువాడు ఒకడు లభించిననేకాని,

సత్వగుణులగు శిష్యులు - జీవాత్మ, పరమాత్మల తత్త్వము నెఱింగి వారి ఐక్యముకోసమై ప్రాణాయామ, కుండలినీ యోగాది సాధనలనుచేసి తరింపజాలరు. కావున ఈ మంత్రము పరమాత్మతో సహ పంచ ఆచార్యులను పేర్కొని జీవుల మోక్షమునకు మార్గము చూపినది. ఇట్టి విశేషార్థము లనేకములు వేదములందు తేటతెల్లములు కాగలవు.

విశ్వకర్మ మిత్రావరుణాగ్ని బృహస్పతులైన అయిదు గురినిసంకృతులనిచెప్పి వేదముమనకొక గంభీరార్థమును తోప జేసినది. సంకృతిఅనగా యోగ్యకర్మచేయు సదాచార్యుడని భావము.ఈ అయిదుగురును సచ్ఛిల్పకర్తలేకాక, సద్గురువులు నయి జగన్మోక్షకారకు లగుచున్నారు. వారిని అట్లు ఉప యోగించుకొనుట మనవిధి, ధర్మము. ఇంతియేకాదు. సప్త లోకములును దేహమునకలవు. దేహమనునది బ్రహ్మాండ మునకొక చిన్నప్రతీక (గుర్తు). ఆధార కమలమే భూలో కము. స్వాధిష్ఠానమే భువర్లోకము. మణిపూరమే (బొడ్డు) సువర్లోకము (గుండె). మహర్లోకము. విశుద్ధమే (కంఠము) జనలోకము. ఆజ్ఞాచక్రమే (భ్రూమధ్యము) తపోలోకము. సహస్రారపద్మమే (మెదడుఉండుచోటు) సత్య (బ్రహ్మ) లోకము. వీటికి సప్తచక్రములనియు, సప్తకమలములనికూడ పేర్లు. సహస్రారమనునది గమ్యముకనుక తక్కిన ఆఱింటిని షట్చక్రములనికూడ అందురు. కుండలినీయోగమునకే సహస్రారవిద్య, షట్చక్రయోగము అనికూడ పేర్లు. ఆధా

రమునందు కుండలిని అను పేరుగల ఒకానొకశక్తి ఉండును. దానిని సర్పముతో పోల్చినారు. ఆశక్తి తలను క్రిందికి త్రిప్పు కొని నిద్రావస్థలోనుండును. యోగియగువాడు ప్రాణాయా మాది ప్రక్రియచేత ఆ కుండలిని మేలుకొలిపి సుషుమ్నా నాళముద్వారా షట్చక్రములను భేదించు (దాటు) కొనుచు సహస్రారమునకు ప్రయాణింపచేయుటయే కుండలినీయోగ లక్ష్యము. ఈసందర్భమున ప్రాణవాయువు సుషుమ్నానాళము ననే సంచరించు చుండును. కుండలినియు, ప్రాణశక్తియు సుషుమ్నయందు సంచారము చేయునప్పుడు మనోవృత్తు లన్నియు నిరుద్ధములై పోగా, జీవాత్మ పరమాత్మ స్వరూపుడై పొందునానందమే మోక్షానందము. దానినే అమృతత్వమని పురుషసూక్తాదులు వర్ణించినవి. (తమేవం విద్వానమృత ఇహ భవతి) ఈ యోగమును గూర్చి మదీయ మిత్రసాహస్రి ఇట్లన్నది.

"కుండలిని యటంచు కొనియాడి రాశక్తి
తలను క్రిందుచేసి వెలయు దాని
ఊర్ధ్వశీర్షకమ్ము నొనరించు సంయమి
విశ్వహిత చరిత్ర వినరమిత్ర !"

ఇచ్చట ఇంకొక రహస్యము గమనింపవలసియున్నది. కుండలిని సర్పాకారమని వర్ణనకలదు. సర్పములు నేల యొక్క బొఱియలలో ఎక్కువగా నివసించుచుండును. నేల అనగాభూమియేకదా. భూభూతమునకు ఆధారచక్రము నెలవు.

ఆధారముయొక్క అంతరమున కుండలినీసర్పము కొలువై యుండునన్నమాట. దానిలోపలనే అంతర్యామిరూపమున పరమాత్మ ప్రకాశించుచున్నాడు. ఈ రహస్యమునే మన వారు విష్ణువునకు ఆదిశేషుడు - అనగా సర్పము శయ్యఅని చెప్పినారు. పరమాత్మ కుండలిలో నిలిచియున్నాడని భావము. దీనినిబట్టికూడ కుండలినీయోగము ఎంతప్రాచీనమో తెలిసి కొనవచ్చును. కుండలినీయోగమార్గము ననుసరించియే విష్ణువు శేషశాయి అనెడి స్థూల రూపకల్పన చేయబడినది. విష్ణుమంత్రములయందలి త్రిధామములు, సప్తలోకములు ఆధారాదులకు గుర్తులని మన ఋగ్వేద దర్శనములు మొదటినుండియు తెలుపుచునే యున్నవికదా.

ఇట్టిదే మఱొకరహస్యము:- బ్రహ్మకును విశ్వకర్మకు కూడ అభేదమేఅని మనముచదివియే యున్నాము.వీరిరువురిది హంసవాహనమే. హంస అనగా జీవుడనియు, ప్రాణమనియు మనశాస్త్రములు పలుకుచున్నవి. హంస వాహనమును- అనగా ప్రాణశక్తిని అధిష్ఠించి ఉండువారు జీవ, పరమాత్మ లన్నమాట. ప్రాణముపోయినచో జీవుడు, అతనితోబాటు అంతర్యామిగా అందున్న పరమాత్మయును లేచిపోదురు. అందుకే శ్రీకోలవెన్ను పరబ్రహ్మతీర్థులవారు తానువ్రాసిన విశ్వకర్మస్తుతిలో విశ్వకర్మను "హంసధ్వజం భావయే" అన్నారు. దేవతలకు వాహనమేదియో, అదియే ధ్వజము. విష్ణువు గరుడధ్వజుడు. శివుడు వృషభధ్వజుడు. విశ్వకర్మ హంసధ్వజుడు.

మనమీప్రకరణమున సూర్య చంద్రాగ్నులను ప్రస్తా వించుకొన్నాము కదా. సూర్యచంద్రపదములచేత ఇడా పింగళా నాడులుచెప్పబడగా, అగ్ని పదముచేత సుషుమ్నా నాళము చెప్పబడినది. కాగా అగ్నినాశ్రయించి ముక్తిని సాధింపవచ్చునని భావము. ఈ అంశమును ఋగ్వేద మంత్రమిట్లు చెప్పినది.

"అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ
వయునానివిద్వాన్, యుయోధ్యస్మ జ్జుహురాణ
మేనో భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ."

ఇందు అగ్ని పరమాత్మగా భావింపబడి మోక్షము నొసంగ కోరబడుచున్నాడు. సర్వజ్ఞుడవైన ఓ అగ్ని దేవా! మమ్ము మంచిమార్గము (సుపథా) ద్వారా మోక్షరూప ధనముకోసమై నడుపుమని ఇందలి సారాంశము. అంతేకాక మాయొక్క-పాపమును-మోక్షప్రతిబంధములను నశింపజేయు మనికూడ ఉత్తరార్థము చెప్పినమస్సుతో మంత్రముముగిసినది. అనిభావము. ఇందలిఅగ్ని సుషుమ్నానాళముద్వారా పొంద దగిన ముక్తినే - పరమపదమునే చెప్పుచున్నాడు. అగ్ని తిరుగాడు సుపథము సుషుమ్నయే. ఈ అంశము ఉపనిషత్తు నందు "శతం చైకాచ హృదయస్య నాడ్యస్తాసాంమూర్ధాన మభినిస్సృతైకా, తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి" అన్నది. అనగా సుషుమ్నామార్గ సంచారము ముక్తి ప్రదమని భావము.

ఇంకొక పరమ రహస్యము

చంద్రుడు (సోముడు) నీటికి ప్రతీక. అగ్ని అగ్ని భూతమే. అది సూర్యస్వరూపమే. నీరు నిప్పును ఆర్పివేయ గలదు. నిప్పు నీటిని పీల్చివేయగలదు. ఈ రెండును వైరులు. వీటికి సమప్రాధాన్యమున్ననేకాని సృష్టిచక్రము సాగదు. పంచభూతములలో ఈ ద్వంద్వములు చిత్రప్రవృత్తి కలవి. భూ, వాయు, ఆకాశములకు విరోధమేమియు లేదు. ఈ జలాగ్నులకు సామరస్యమును గూర్చి తనలో లీనము చేసి కొనువాడు వాటిని కన్న పరబ్రహ్మమే. అందుకనియే ఆ రెంటికీ బ్రహ్మనాడిలో లీనమైపోవు స్థితి ఏర్పడినది. ఇట్టి సూర్యచంద్రాగ్నులు పిండాండ రక్షణకు, భగవత్సాక్షా త్కారమునకు పరమాధారభూతులగుచున్నారు. యోగము నందు ప్రాధాన్యము పొందిన ప్రాణాయామ ప్రక్రియలో ముఖ్యులై వెలయుచున్నారు. విష్ణువు మెట్టిన త్రిధామములు ఈ సూర్యచంద్రాగ్నినాడులు అనియు భావించి యోగ మును కొనసాగింప వచ్చును. అది యోగ విషయముకాన ఇచ్చట విస్తరింపబడుటలేదు.

సూర్యుడు పగటికి అధిపతి. అందుకే ఆయనను దివాకరుడన్నారు. పగటియందు జరిగెడిది జీవులయొక్క జాగ్రదవస్థ. ఇది సూర్యునితోకాని ప్రారంభముకాదు. ఇక రాత్రికి అధిపతి చంద్రుడు. అందుకే ఆయన నిశాధిపతి

అయినాడు. రాత్రి నిద్రాకాలము కావున చంద్రునిచేత స్వప్నావస్థ సూచించబడుచున్నది. తరువాతిది సుషుప్తిదశ కదా. దీనికి అధిపతిని అగ్నినిగా ఎన్నవలెను. మనము జాగ్రత్స్వప్నములనే ఎక్కువకాలము అనుభవింతుముకాని సుషుప్తిని దీర్ఘకాల మనుభవింపము. కాగా అగ్ని సుషుప్తికి సంకేతము. ఈ సూర్యచంద్రాగ్నులు జగద్వ్యవహారము సాగుటకు ముఖ్యులుకదా. వీరిచే సూచితములైన జాగ్రత్స్వప్నములు ఎవ్వరికిగాని మోక్షసుఖమును, అమృతత్వమును ఒసంగజాలవు. మోక్షానందమును కోరు ధీరులు, సూరులు జాగ్రత్స్వప్న సుషుప్తులను దాటి తురీయ (సమాధి) దశ కేగవలసి యున్నది. అద్వాలిదే పరమామృతమయమైన కైవల్యస్థితి. కావున జీవులెల్లరు అట్టి తురీయ, తురీయాతీతానందములకు చేరవలెననెడిదే సూర్యచంద్రాగ్నుల రహస్యము. ఈ రహస్యమునే విశ్వకర్మసూక్తము పరమ గంభీరముగా సూచించినది.

మనము చెప్పికొన్న ఈ కుండలినీ యోగమంతయు దిగువ విశ్వకర్మ సూక్తమంత్రమున ఇట్లు సూచింపబడినది–

"విశ్వకర్మన్ హవిషా వావృధానః,
స్వయంయజస్వ పృథివీ ముత ద్యామ్. 10-81-6.

ఈ మంత్రమున హవిస్సు అనుమాటచేత తానుచేసెడి యోగరూప యజ్ఞమునే గ్రహింపవలసియున్నది. మానవు లొనర్చు ప్రతికార్యమును భగవంతుని కర్పించెడి హవిస్సుతో

సమానమే- సమానమే ఏమి ? హావిస్సే అనుకొనవలయును. ఈ విషయమును విశ్వకర్మ సూక్తము "సముద్రాయ వయునాయ" అనెడి మంత్రములోని "పిత్రే జుహుతా విశ్వ కర్మణే విశ్వాహా మర్త్యగ్ంహవిః" ఓ జనులారా ! మీరు సర్వకాల సర్వావస్థలయందును విశ్వపిత అయిన విశ్వకర్మను మీ కర్మలనెడి హావిస్సులచేత ఆరాధింపుడు-అని చెప్పినది. కావున ఈ సందర్భముననేకాదు. ఏ ఘట్టమునందైననుహావి శ్శబ్దమును కర్మపరముగాను, కర్మయోగ పరముగాను అన్వ యించుకొని పరమార్థ లాభమును పడయవలసియున్నది. కర్షకుడు చేయు కృషికర్మయు, శిల్పులు చేసెడి శిల్పాదికము కూడ యజ్ఞమే అని ఋగ్వేదదిగ్దర్శన తృతీయ భాగమున పేర్కొనబడినది. కనుక మంత్ర భావమిది- ఓ విశ్వకర్మా! నీవు మేమర్పించు హావిస్సుచేత అనగా మేముచేయు కుండలినీ యోగముచేత భూమ్యాకాశము లందంతటను వృద్ధి పొంది సాక్షాత్కరించినవాడవై మాయందు నిలిచి ఈ కార్యమును నిర్వహింపుము - అని భావము. ఇక్కడ యోగపక్షమున పృథివీ ద్యుశబ్దములచేత ఆధారమునుండి సహస్రారము వఱకునుగల చక్రములను గ్రహింపవలసి యున్నది. అనగా సాధకునిలో బ్రాహ్మీశక్తి విజృంభించి ఉత్తర యోగమార్గము నకు నడుపవలసియున్నదని భావము. ఈవిధముగా సాధకునిలో పరబ్రహ్మతత్త్వప్రదీప్తి కలిగి ఉత్తరయోగమార్గము కొన సాగుననియు గ్రహింపవలసియున్నది. విశ్వకర్మ మంత్రము చెప్పిన యీ భావమునే శ్రీ శంకరులు ఆత్మపక్షమున ఇట్లు

కవిత్వపూర్ణముగా వర్ణించినారు. అదికూడ యోగసాధకులు ఆచరింపదగినదే.

"ఆత్మా త్వం, గిరిజా మతిః పరిజనాః
ప్రాణా, శ్శరీరం గృహం,
పూజా తే విషయోపభోగరచనా,
నిద్రా సమాధిస్థితిః,
సంచారః పదయోః ప్రదక్షిణ విధిః,
స్తోత్రాణి సర్వా గిరః,
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం
శంభో తవారాధనమ్."

తా. ఓ స్వామీ! నీవే నాలోని ఆత్మవు. పార్వతియే నా యందలి బుద్ధి. ప్రాణములే పరిజనులు (సేవకులు). శరీరమే గృహము. నేనొనర్చెడి ప్రపంచ విషయానుభవమే నీకు చేసెడిపూజ. నా నిద్రయే సమాధి. నా పాదములతో చేయు సంచారమే నీ కొనర్చెడి ప్రదక్షిణము. నేను మాటాడుమాటలన్నియు నీ స్తోత్రములే! ఇంతయేల శివా! నేనే కర్మను చేయుచున్నను, అది అంతయు నీయొక్క ఆరాధనమే, పూజనమే, అర్చనమే కాని ఇతరముకాదు. ఈ శ్లోకమున భక్తుడు సర్వమును భగవన్మయముగా భావించి తన అస్తిత్వముకాని, అహంకారముకాని లేశమేని లేదని చెప్పినాడు. అట్లే కుండలినీ యోగియు పై విశ్వకర్మ మంత్రమున తనయందును, బ్రహ్మాండమునందును భగ

వంతునే దర్శించి చేయవలసినదంతయు నీవే చేసికొమ్మని సర్వసమర్పణ మొనర్చినాడు. కాగా తేలినదేమన, కుండలినీ యోగి బ్రహ్మమయుడే కాని, భిన్నదర్శి కాడనియే కదా!

కుండలినీ యోగమున "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్య మిట్లు సమన్వయించుచున్నది. ఆజ్ఞాచక్ర లక్ష్య ప్రత్యగాత్మను, సహస్రార లక్ష్య పరమాత్మను ఒకటిగా అనుభూతి పొందుటయే ఇక్కడ జరుగునది. ఇది బింబ ప్రతి బింబముల ఐక్యమువంటిది. ఆవల ఆధారమునుండి సహస్రారముదాక గల తత్త్వములన్నియు ఒక్కటే- పరబ్రహ్మకు అభిన్నములే అని అనుభూతికి తెచ్చుకొనుట. ఇది "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను వాక్యమునకు ఫలితము. సహస్రార లక్ష్య పరబ్రహ్మమే ప్రత్యగాత్మాది నానారూపములతో తోచినదని యెంచుట. "బ్రహ్మైవేదం విశ్వం" అనుమాటకు నిదర్శనము. ఇట్టి అనుభూతిని ప్రతి కుండలినీ యోగియు పొంది కృతకృత్యుడు కావలసియున్నది.

సహస్రార లక్ష్య పరమాత్మ ఆజ్ఞాచక్రాది క్రమమున ఆధారము వఱకు చేయు అవరోహణమే సృష్టిక్రియా విధానము. దీనినే "అస్మాన ఆకాశ స్సంభూతః" ఇత్యాదిగా తైత్తిరీయోపనిషత్తు వర్ణించినది. జాగ్రత్తునుండి తురీయాతీతము వఱకుగల ఆరోహణమునే కుండలినీయోగము ముక్తి, మోక్షము, అమృతత్వము-ఇత్యాది పదములచే పేర్కొన్నది. ఇది నాసదీయ సూక్త ప్రోక్త విధానమేకాని, భిన్నముకాదు.

విశ్వకర్మ పురుష సూక్తములు దానిని నిగూఢముగా వివరించినవి. ఉపనిషత్తులు వ్యాఖ్యానించి విశదము చేసినవి. దీనినే "తద్వేదగుహ్యోపనిషత్సుగూఢం" అన్నది ఉపనిషత్తు. కుండలిని మేల్కొంచుట అనగా జీవుడు భౌతిక బంధముల నుండి బయటబడి పరమతత్త్వ పరిజ్ఞానమునకు యత్నించుటయే అనికూడ భావమే. కుండలిని కదలినగాని ఇట్టి కోరిక నరులకు కలుగదు.

## నీటిలో జగద్బీజము

విశ్వకర్మ సూక్తము, విశ్వకర్మ జగద్బీజమును నీటిలో ఉంచినాడని చెప్పుచున్నది. ఆ మంత్రములను చూతము-

"కిం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమపశ్యంత విశ్వే" 10.82-5
"త మిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛంత విశ్వే." 10.82-6

తా॥ ఏ విశ్వకర్మ తత్త్వము జగత్కారణమై ప్రకాశించుచున్నదో, అట్టిదానిని జగద్బీజముగా ముందు ఉదకములు తమలో ధరించినవి. ఆ ఉదకములయందే సమస్త ప్రాకృతిక, అప్రాకృతిక శక్తులు ఇమిడి యున్నవి. ఇట్లనుట చేత సమస్త విశ్వములకు బీజమును, అనిర్వచనీయమునైన ఆ శక్తి మొట్టమొదట నీళ్ళద్వారా వ్యక్తమైనదని తెలియుచున్నది. ఇది శాస్త్రానుభవములద్వారా, నిరూపితమైన సత్యమే కాని వేఱు కాదు. ఏది పుట్టవలెనన్ననూ, జలభూముల

సంయోగముచేకాని ఆ పని జరుగదు. భూమిమీద వర్షము (జలము) పడిననేకాని ఓషధివనస్పతులు మొలవవుకదా ! అట్లే ప్రాణుల పుట్టుకకుకూడా జలస్వరూపవీర్యము, అందలి జీవకణములే కావలసిఉన్నవి. కావున నీటియందు జగద్బీజ ముంచబడినదని వేదము సత్యసమ్మతముగానే పలికినది. ఈ వేదభావమును మనుస్మృతి ఇట్లు విస్తరించినది.

"అప ఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్,
తదండ మభవ ద్దైమం సహస్రాంశు సమప్రభమ్."

తా॥ భగవంతుడు ముందు నీటిని సృష్టించి ఆ నీటియందు జగద్బీజమును ఉంచినాడట. అదియేమో సూర్యునివంటి తేజస్సుగల అండమైనదట. దానినే బ్రహ్మాండమను చున్నాము. భగవంతుడు ముందు నీటినే సృష్టించినాడను అంశము విశ్వకర్మసూక్తమున ఇట్లు పేర్కొనబడినది.

"చక్షుషః పితా మనసా హి ధీరో,
ఘృత మేనే అజన న్నమ్నమానే." 82.1

విశ్వకర్మ ముందు ఘృతమ్=నీటిని, అజనత్=సృష్టించెను. ఆవల ఏనే ద్యావాపృథివీ = ఈ భూదివములను, అజనత్ = కలిగించెను. అని మంత్రభావము. ఘృతమనగా "నేయి" అని లౌకిక సంస్కృతభాషలో అర్థము. కాని వైదిక సంస్కృతమున నీరు అనికూడ అర్థమున్నది.

ఈ విశ్వకర్మ సూక్తాదుల భావములను చక్కగా

వెలుంగిన కాళిదాసుగూడ తన కుమారసంభవ ద్వితీయ సర్గమున బ్రహ్మస్తోత్రములో ఇట్లు పలికినాడు.

"య దమోఘ మపా మంత రుప్తం బీజ మజ త్వయా,
అత శ్చరాచరం విశ్వం ప్రభవ స్తస్య గీయసే." 5

ఓ పుట్టుక లేని దేవా! నీవు నీటిలో అమోఘమైన ఏ బీజమును ఉంచినావో, దానినుండియే ఈచరాచరాత్మకమైన విశ్వము పుట్టినది. నీవుదానికి కారణుడవై కీర్తింపబడు చున్నావు. వేదములపిదప వెలువడిన సంస్కృత వాఙ్మయ మంతయు, ఈ విశ్వకర్మసూక్తాను సారమే లోకసృష్టిని వర్ణించుచు పెరిగిపోయినది. ఇచ్చట ఒకవిశేషము : విశ్వకర్మ సూక్తము -

"కింస్వి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపః"
"తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపః"

అని జలములకు పర్యాయముగా ఆపశ్శబ్దమును ప్రయోగించినది. ఇంకొకచోట ఋక్కు "ఆపోహి ష్ఠా మయోభువః" అన్నది. యజురారణ్యకము సైతము "ఆపోవా ఇదగ్ం సర్వం, విశ్వా భూతా న్యాపః ప్రాణావా" అన్నది. వాటి ననుసరించియే మనుస్మృతి- "అపఏవ ససర్జాదౌ" అన్నది. ఇక కాళిదాసుసైతము "యదమోఘ మపామన్త రుప్తం బీజం" అని ఆపశ్శబ్దమునే ప్రయోగించినాడు. కాన వైదిక లౌకిక సాహిత్యనిర్మాతల కందఱికిని ఆపశ్శబ్దమే ఇష్టమైన దన్నమాట. జలములకు బీజములను ధరించి విస్తరింపచేయు

యోగ్యత (సామర్థ్యము) ఉన్నదనువిషయమును యజుర్వే దీయ విశ్వకర్మసూక్తపుచివరి మంత్రము జలములు సాక్షాత్తు పరమాత్మరూపములే-పరమాత్మయొక్క ప్రతిబింబములే అని "సముద్రాయ వయునాయ" (చూడు 91వ పుట) అను మంత్రమున స్పష్టము చేసినది.

ఈ సందర్భమున వేదమంత్రము "అపాం గర్భమ్" అని గర్భశబ్దమును వాడగా, మనుస్మృతియు కాళిదాసుడును బీజశబ్దమును వాడినారు. బీజ, గర్భశబ్దములు రెండును సమా నార్థకములే. "ఆమె గర్భము తాల్చినది" అనెడి వ్యవహార వాక్యమున, గర్భమనగా పురుషుని నుండి తనలో చేరిన బీజమును ధరించినదనియేగదా భావము. ఈ సందర్భమున ఇతరములైన వేదమంత్రములుకూడ బీజమను అర్థమున గర్భ శబ్దమును వాడుటను మనము గమనింపగలము. ఎట్లో చూడుడు.

"విష్ణుర్యోనిం కల్పయతు, త్వష్టా రూపాణి పింశతు,
ఆసించతు ప్రజాపతి, ర్ధాతా గర్భం దధాతుతే."

10-184-1.

ఇందు "గర్భందధాతు" అనగా బీజమునుంచుగాక అనియే భావము. మఱికొన్ని మంత్రములనుగూడ చూతము.

"గర్భం ధేహి సినీవాలి! గర్భం ధేహి సరస్వతి,
గర్భంతే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కరస్రజా". (2)

"యథేయం పృథివీ మహీ తిష్ఠంతీ గర్భమాదధే,
ఏవం త్వం గర్భ మాధత్స్వ, దశమే మాసి సూతవే."
10-60-9

"యథా పృథివ్యగ్ని గర్భా, ద్యౌ ర్యథేంద్రేణ గర్భిణీ,
వాయు ర్యథాదిశాం గర్భ, ఏవం గర్భం దధాతు తే."
"విష్ణో శ్రేష్ఠేణ రూపేణాస్యాం నార్యాం గవీన్యాం
పుమాంసం గర్భ మాధేహి దశమే మాసి సూతవే."
"అహం గర్భ మదధామోషధీష్వహం విశ్వేషు
భువనేష్వంతః, అహం ప్రజా అజనయం, పృథివ్యా
మహం జనిభ్యో అపరీషు పుత్రాన్." - 10-183-3.

ఇవి గర్భాధాన మంత్రములు. వీటన్నింటియందును గర్భమనగా బీజమనియే అర్థము.

కాళిదాసు అనేక విషయములందు- అనగా త్రిమూర్త్యాదుల స్తోత్రములయందేమి, తదితరాంశములయందేమి నాసదీయ, మోక్ష, పురుష, విశ్వకర్మాదుల సూక్తములను అనుసరించియే తత్త్వమును నిర్వచించుచుండుట మనము గమనించి ఆయన మార్గము ననుసరించవలసి యున్నది. ఒకే జగత్కారణ తత్త్వము (విశ్వకర్మ) బ్రహ్మ, విష్ణు, రుద్రాది రూపములను అందుననియు, అన్ని నామములు, రూపములు ఏకైక పరమేశ్వరునివే అనియు వేదము చెప్పిన - "ఏకం స ద్విప్రా బహుధా వదంతి" "యో దేవానాం నామధా ఏక ఏవ."

అనేడి ఏకేశ్వర సిద్ధాంత వాక్యములను కాళిదాసు తన శ్లోకములలో ఇట్లు వ్యక్తీకరించుచుండును.

"నమ స్త్రీమూర్తయే తుభ్యం, ప్రాక్సృష్టేః
కేవలాత్మనే, గుణత్రయ విభాగాయ, పశ్చాద్భేద
ముపేయుషే.' -కుమార సంభవము (2-4)

సృష్టికి పూర్వము కేవలాత్మ రూపుడవైననూ, సృష్టి నిమిత్తము సత్వరజస్తమోగుణముల ననుసరించి భేదమును పొందిన విష్ణు, బ్రహ్మ, రుద్రస్వరూపుడవైన నీకు నమస్కారము. అనగా ఏకైకమైన సదసదతీత విశ్వకర్మతత్త్వము సృష్టి నిమిత్తమై బ్రహ్మాదుల ఆకారమును పొందినదని భావము.

"తిసృభి స్త్వ మవస్థాభి, ర్మహిమాన ముదీరయన్,
ప్రళయ, స్థితి, సర్గాణా, మేకః కారణతాం గతః."

(6)

తా॥ ఓ భగవానుడా! వస్తుతః నీవొక్కడవే అయినను, తమస్సత్వ రజోగుణములయొక్క మూడవస్థలచేతను ప్రళయము, స్థితి, సృష్టి అనేడి క్రియలకు కారణమగుచున్నావు. అనగా మూడు పనులు చేయునపుడు మూడు మూర్తులుగా తోచుచున్నావని భావము. ఈ సందర్భమున-సృష్టి, స్థితి, లయము, తిరోధానము అనుగ్రహము అనేడి పంచావస్థలను గ్రహించినచో, పంచబ్రహ్మలు, పంచ

మూర్తులు, పంచఋషులు యెన్నబడుదురు. ఈ శ్లోకమున ఈ విశేషమున్నది : విశ్వకర్మసూక్తము విశ్వమును ప్రళయములో ఆరంభించి చెప్పుచున్నది.

> "య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషిర్హోతా
> నిషసాద పితా నః" "విశ్వకర్మా మనసా య
> ద్విహాయా ధాతా విధాతా."

అనెడి మంత్రములలో భగవంతుడు ఈ విశ్వభువనములను తనలో ఆహుతివలె వేసికొని లీనము చేసికొన్నాడని భావము. అట్లే రెండవసారి "విహాయాః అన్నది. అనగా "విశేషేణ జగతాం సంహర్తా" అని భావము కాళిదాసు గూడ తన శ్లోకములో విశ్వకర్మసూక్త మార్గమునే అనుసరించి "ప్రళయ, స్థితి, సర్గాణాం" అని ప్రళయమునే ముందు పేర్కొనినాడు. ఇది కాళిదాసుని విశ్వకర్మసూక్త పరిజ్ఞానమునకు నిదర్శనము.

స్త్రీ పురుష తత్త్వములు రెండుగా వెలుపలికి కనపడినను అవి రెండునూ ఒక్కటే అని వేదమంత్రముల భావము. ఆ భావమునే కాళిదాసు అనుసరించి, బ్రహ్మనిట్లు స్తోత్రము చేసినాడు.

> "స్త్రీ పుంసా వాత్మభాగౌ తే, భిన్నమూర్తేః
> సిసృక్షయా,
> ప్రసూతిభాజ స్సర్గస్య, తావేవ పితరౌ స్మృతౌ." (7)

జగములను సృష్టించదలచిన నీ దేహము యొక్క రెండు భాగములే స్త్రీ పురుషులనగా! సృష్టి జరిగిన తరువాత ఆ భాగములే జగత్తులకు తల్లిదండ్రులయినారు. అనగా, శివ భక్తుడైన కాళిదాసుని దృష్టిలో జగత్పితరులు పార్వతీ పరమేశ్వరులన్నమాట. స్త్రీ, పురుషునిలోని అభిన్న భాగమే అనుటలో కాళిదాసునియొక్క స్త్రీజన గౌరవము సువ్యక్తమగుచున్నది. ఇంకను ఉదాహరింపబోవు దిగువ శ్లోకములన్నియు ఆతని ఏకాత్మ భావమునకే నిదర్శనములు.

"జగద్యోని, రయోని స్త్వం, జగదంతో, నిరంతకః,
జగదాది, రనాది, స్త్వం, జగదీశో, నిరీశ్వరః." (9)

"ఆత్మాన మాత్మనా వేత్సి, సృజస్యాత్మాన మాత్మనా,
ఆత్మనా కృతినా చ త్వ, మాత్మన్యేవ ప్రలీయసే."
(10)

"ద్రవ స్సంఘాత కఠినః, స్థూల సూక్ష్మో లఘు ర్గురుః,
వ్యక్తో వ్యక్తేతరశ్చాసి, ప్రాకామ్యం తే విభూతిషు."
(11)

తా॥ ఓ భగవంతుడా! నీవు జగత్తులకు కారణమైన వాడవే కాని, నీకు మాత్రమేదియు కారణము లేదు. నీవు జగములకు అంతకుడవేగాని, నీకు మాత్రము అంతకుడు లేడు. అనగా నీవు అంతములేని అనంతుడవని భావము. నీవు జగత్తుల సృష్టికి మొదటివాడవు. నీకు మాత్రము ఏదియును ఆది లేదు. నీవు జగతులకెల్లనూ ప్రభుడవు. నీకు మాత్రము ఏ

ప్రభువునూ లేడు (9) - ఓ స్వామీ! నిన్ను నీవే నీ చేత తెలిసికొనుచున్నావు. అనగా త్రిపుటి నీ స్వరూపమే అని భావము. అట్లే నిన్ను నీవే నీచేతనే సృష్టించుకొందువు. అనగా బ్రహ్మ, విష్ణు, రుద్రేంద్ర, సూర్య చంద్రాది స్వరూపముగా నిన్ను నీవే సృష్టించుకొందువని తాత్పర్యము సర్వ శక్తుడవైన నీ చేతనే నీవు నిన్ను నీలోనే లీనము చేసికొనుచున్నావు. అనగా భగవంతుని శాసించునది, సృష్టించునది, సమయించునది ఏదీ లేదనియూ. ఆ భగవచ్ఛక్తి తన మహిమచేతనే కార్యకారణ స్వరూపములను పొందుననియు భావము (10) ద్రవము, కఠినము, స్థూలము, సూక్ష్మము, లఘువు, గురువు, వ్యక్తము, అవ్యక్తము (కార్యకారణములు) మొదలైన విశేషములన్నియు నీవే కాని, ఇతరము లేవియు కావు. ఇట్టి అణిమాది విభూతులయందు నీకు స్వేచ్ఛ, అధికారము కలదు. (12) ఈ అంశములను విశ్వకర్మ సూక్తము "విశ్వకర్మా విహాయ మార్ణో న్మహినా విశ్వచక్షుః" (10-82-1) సర్వజ్ఞుడైన విశ్వకర్మ తన మహిమచేతనే భూదివములను వ్యాపించి సృష్టిక్రియను వ్యక్తీకరించెను-అనెడి వాక్యముచేసూచించినది.

"త్వా మామనంతి, ప్రకృతిం పురుషార్థ ప్రవర్తినీం
తద్దర్శిన ముదాసీనం, త్వామేవ పురుషం విదుః."

(13)

పురుషుని (జీవుని) మోక్ష పురుషార్థమునకై ప్రవర్తింపచేసెడి ప్రకృతిని, నిన్నుగానే తత్త్వవేత్తలు వచించుచున్నారు.

ఆ ప్రకృతిని ఎట్టి సంగము (సంబంధము) లేకుండ దర్శించెడి ఉదాసీన పురుషునిగా గూడ నిన్నే తత్వజ్ఞులు వాకొను చున్నారు. అనగా ప్రకృతి పురుష స్వరూపములు రెండునూ నీవేయని సారాంశము. దీనినిబట్టి కాళిదాసు ప్రకృతిని తిరస్కరింపక అదికూడా పరమాత్మస్వరూపమే, పరమాత్మకంటెను అభిన్నముగా - బంగారునుండి నగలు వెలువడినట్లు వెలువడినదే అని భావించినట్లు మనకు సుస్పష్టమగుచున్నది. ఇది నాసదీయ, విశ్వకర్మ, పురుషసూక్తములు చెప్పిన భావములకు ఎంత మాత్రమును భిన్నముకాదు. నాసదీయము సదసదతీతమును చెప్పి, తమ ఆసీత్'' అన్నది. విశ్వకర్మ సూక్తము ఆతమస్సునే "నీ హారేణ ప్రావృతాః'' నీ హారమన్నది. ఈ మార్గమునే మహాతత్త్వవేత్త అయిన కాళిదాస మహాకవి అనుసరించినాడు. వేదము చెప్పిన గర్భమునే మనుస్మృతి "అప ఏవససర్జాదౌ తాసుబీజమవాసృజత్'' అని చెప్పినదని తెలిసికొనినాముకదా. భగవద్గీత సైతము గర్భమును బీజమనియే భావించినది. ఎట్లో చూడుడు.

"బీజం మాం సర్వ భూతానాం, విద్ధి పార్థ సనాతనమ్."
7-10

సర్వ భూతములకు జననకారణమైన సనాతన బీజమును నేనే అర్జునా, అని శ్లోక భావము. భూతములనగా ఆకాశాదులు కాని, చరాచరములు కాని-సృష్టిలోని అన్నియు కావచ్చును. బీజము కారణ రూపము, సూక్ష్మము అయినట్టిదికదా. ఆ

బీజమే శాఖాపత్ర పల్లవ పుష్ప ఫలాదులతోగూడి స్థూల వృక్షరూపమును పొందుచున్నది. ఏది పెద్దదై దృశ్య రూపమున ఇంద్రియములకు గోచరించుచున్నదో, దానికి సూక్ష్మమూ, కారణమూ అయిన బీజము నా స్వరూపమేఅని గీతలో చెప్పబడినది. ఆకాశాదులైన వేటియొక్క బీజములైనను తానే అని భగవద్వాక్యము. అట్లే శరీరముగా రూపొందుటకును స్త్రీ పురుషులలోని రక్త శుక్రములలోనున్న సూక్ష్మ బీజము కూడా తన స్వరూపమే. ఆ బీజములోనే సర్వేంద్రియములు, స్థూలమైన దేహ యంత్రము, ఆ యంత్రమునందలి పలు భాగములు ఇమిడియున్నవన్నమాట. కాగా సూక్ష్మాతి సూక్ష్మమైన బీజములో ఇంతటి స్థూల శిల్పము ఇమిడి యుండుట ఎంత ఆశ్చర్యమో పరికింపుడు. కనుక ప్రతి భౌతిక పదార్థమునకు మూల భూతమైన బీజము ఆత్మవస్తువే కాని, ఇతరము కాదు. దానిని పాంచ భౌతిక ప్రకృతి అందురు కదా- అందురేమో ! ఆ ప్రకృతి కూడా అనాదిసిద్ధ వస్తువు నుండి పుట్టినదే కాని, వేరైనది కాదు కాన, సర్వమునకు మూల కారణరూపమైనబీజమును తానే(భగవంతుడే)అనుటయైనది.

అంతేకాదు. ఈ బీజము సనాతనమైనదట కూడ. సనాతనమనగా శాశ్వతమేకాక, మొదటిదికూడ అన్నమాట. జగత్తుల సృష్టికి శాశ్వతమైన బీజము పరమాత్మయే కాని, వేరేదియు కాదని సారాంశము. ఎన్నిసృష్టులు, ప్రళయములు జరుగుచున్నను, ఆ బీజము వ్యక్త అవ్యక్తస్థితులను పొందునే

కాని, నాశము మాత్రము కాదని ఇందలి సనాతన శబ్దము చెప్పుచున్నది. దీనినిబట్టి విశ్వకర్మ సూక్త మంత్రములు చెప్పిన గర్భమును, భగవద్గీత, మనుస్మృతులు చెప్పిన జగ ద్బీజమును ఒక్కటే అనియు, ఆ విశ్వకర్మయే భగవద్గీత చెప్పిన భగవంతుడనియు మనకు సుస్పష్టమగుచున్నది కదా, కనుక భగవద్గీతకు అనేకాంశములయందు విశ్వకర్మ సూక్తమే మూలమని తెలియుచున్నది.

విష్ణు మంత్ర మధువు మధు విద్యా సారమే

ఋగ్వేద ప్రథమ మండలములోని 154వ సూక్తము నందు దిగువ మంత్రము కలదు.

"యస్య త్రీ పూర్ణా మధునా పదా
న్యక్షీయమాణా స్వధయా మదంతి,
య ఉ త్రిధాతు పృథివీ ముత ద్యా
మేకో దాధార భువనాని విశ్వా." ఋ. 1-154.4

ఈ మంత్రములు విష్ణు ప్రశంస కలిగినట్టివి. పై మంత్రము విష్ణు దేవుని పాదాక్రమణములు మధువుతో-అనగా అమృతముతో నిండినవని చెప్పుచున్నది. అందుకే విష్ణుపాదము లనుడు, అడుగులనుడు అవి లోకములు కాని, సప్తచక్రములు కాని అగుట కెట్టి అభ్యంతరమును లేదు. కాగా సప్తలోకము లందును, సప్త చక్రములందును విష్ణు రూపమధువు (అమృతము) నిండియున్నదన్నమాట. అందుకే విష్ణురూపమధువుతో

(అమృతముతో) నిండిన అడుగులు మూడును నాశములేనివి. అవి ఉపాసకులకు భౌతికాధ్యాత్మికాన్నములను భోజనము చేయుటచే కలిగెడి తృప్తిని, ఆనందమును కూర్చుచున్నవని మంత్రముయొక్క మొదటి రెండు పాదముల భావము. సహస్రార స్థితుడైన విష్ణువు ఈ మూడు ధాతువులు కలవాడై అనగా పృథివ్యంతరిక్షద్యు లోకములందు వ్యాపించి, సమస్త భువనములను ధరించుచున్నాడని తుది రెండు పాదముల భావము. "ఏకో దాధార భువనాని విశ్వా" అని ఈ విష్ణు మంత్రము చెప్పగా, ఆ భువనములను సృష్టించిన తండ్రి త్వష్ట్ర దేవుడని ఇంకొక ఋక్కు పలుకుచున్నది.

"య ఇమే ద్యావా పృథివీ జనిత్రీ
రూపై రపింశ ద్భువనాని విశ్వా,
త మద్య హోత రిషితో యజీయాన్
దేవం త్వష్టార మిహ యక్షి విద్వాన్."

ఋ. **10-110.9**

తా॥ ఏ త్వష్ట ఈ ద్యావాపృథువులను, (స్వర్గ భూలోకములను) దేవమనుష్య తిర్యక్ స్థావరాది భేదములతో నిండిన స్వర్గ మర్త్యపాతాళాదులను సృష్టించినాడో, అట్లే సమస్త భువనములను రూపము కలవానినిగా నొనర్చినాడో ఆ త్వష్టను నీ కర్మలతో ఆరాధించి పూజింపు మయ్యా విద్వాంసుడా! ఇది హోమము చేయు హోతకు సంబంధించినదయినను, ప్రతి కర్మయోగికిని అనువర్తింపగలదు. కనుక

త్వష్ట (పురాణములలోని బ్రహ్మ) సృష్టింపగా విష్ణువువాటిని ధరించు (పోషించు) చున్నాడని సిద్ధమగు చున్నది త్వష్ట్ర విష్ణువులకు అభేదము చెప్పఁగాని ఉభయులు పరమాత్మ రూపులే అనుకొనుట, ఇంకను సాధకులనుపైమెట్టుకు చేర్చును. ఇక మధు శబ్దసార్థక్యమును విచారింతము.

దీనినిబట్టి ఆధారము (పృథివి) నుండి సహస్రారము వఱకు వ్యాపించియున్నది, లేదా సహస్రారము నుండి ఆధారమువఱకు వ్యాపించియున్నది ఒక్క విష్ణునామక పరబ్రహ్మమే అనియు, ఆతడే ప్రధాన చక్రములు మూటి యందును వ్యాపించి, భువనమని చెప్పదగిన పిండ రూప శరీర మును, విశ్వదేహమును కాపాడుచున్నాడనియు రహస్యము.

"యస్య త్రీ పూర్ణా మధునా సదా" అను దానినిబట్టి సప్త చక్రములలోను మూడు ప్రధాన చక్రములను గ్రహింప వలసియున్నది. అవి ఒక పక్షమున- మణిపూర, అనాహత, ఆజ్ఞాచక్రము లనుకొనవలయును. కుండలినీ శక్తి ఆధారము నుండి బయలుదేరి మణిపూరమును చేరునప్పటికి బ్రహ్మ గ్రంథి ప్రీలిపోవును. అనగా సృష్టి సంబంధమైన బంధములు దూరమైపోవునన్న మాట. కావున సాధకునికిఅప్పటికేమధువు, అనగా అమృతస్థితి యొక్క రుచి తెలియుచుండును. పిమ్మట అనాహతము వఱకూ వచ్చునప్పటికి విష్ణుగ్రంధి ప్రీలి పోవును. కనుక అదియు అమృత పూర్ణమే. ఆవల ఆజ్ఞా చక్రమును చేరునప్పటికి రుద్రగ్రంధి కూడ ప్రీలిపోవుచున్నది.

ఆ స్థితి కలుగునప్పటికి మృత్యు భయము, మృత్యు బాధ సైతము తొలిగిపోయి సాధకుడు మృత్యుంజయ స్థితికి చేరుకొనును. కావున అదియూ అమృత పూర్ణమే. ఈ మంత్రమున, ఈ రహస్యములను దృష్టియందుంచుకొనియే వేద పురుషుడు "త్రీ పూర్ణా మధునా సదా" అని చెప్పినాడు. కనుక సాధకులీ మూడు చక్రములయందును కుండలిశక్తిని ప్రవేశపెట్టి సాధన చేయవలసియున్నది.

ఈ సందర్భమున ఇంకొక పరమ రహస్యమున్నది. మంత్రములో అమృత శబ్దమునకు బదులుగా మధు శబ్దము వాడబడినది. ఆ మధువు జగత్కారణ పరమాత్మ స్వరూపమే కాని, దేవతలు త్రాగెడి అమృతమువంటిదికాని, గీత చెప్పిన "యజ్ఞ శిష్టామృత భుజో యాంతి బ్రహ్మ సనాతనమ్" (గీత 4-31) యజ్ఞ శేషరూపమయిన అమృతము కాని కాదని మఱువరాదు. మఱేమన, అది పురుషసూక్తము చెప్పిన "త మేవం విద్వా నమృత ఇహ భవతి" అనెడి బ్రహ్మ (జ్ఞాన) స్వరూపమైనట్టిదని మఱువరాదు. ఇట్లుసమన్వయించుకొని ఆ మధువు సాక్షాత్తు పరబ్రహ్మమేయని గ్రహింపవలసియున్నది.

ఈ మంత్రమునందలి మధు శబ్దమును ఆధారము చేసికొనియే బృహదారణ్యకోపనిషత్తునందలి మధు విద్య ప్రవర్తిల్లినది. బృహదారణ్యక ద్వితీయాధ్యాయ పంచమ బ్రాహ్మణమున మధు విద్యా ప్రశంసను మనము కాంచ

గలము. అందు పృథివ్యాదులైన సమస్త భూతములు మధువులే అని చెప్పుచూ కడకు ఆ పృథి వ్యాధులయందు అంతర్వ్యాపతమైయున్న అఖండ శక్తియే అమృతమయ బ్రహ్మమని చెప్పుకొనుచూపోవును. చివరకు వీటన్నింటికినీ మూలమయిన ఆత్మవస్తువే సర్వభూతములకు మధువని చెప్పి మధు విద్యా సర్వస్వము ముగింపబడుచున్నది. దీనిని బట్టి తేలిన దేమన, మధువనగా ఆత్మ, లేక పరమాత్మ అనియే. లేదా అట్టి బ్రహ్మ జ్ఞానముచే కలిగిన అమృతత్వమనియైనను భావింపవచ్చును. కావున వేద పురుషుడు విష్ణు మంత్రములో నామ మాత్రముగా సూచించి విడిచిన మధువును ఉపనిషత్తు మధువిద్యయని పేరుపెట్టి విస్తరముగా వ్యాఖ్యానించి సాధకులకు ఉపకారమొనర్చినదన్నమాట. ఈ మధు విద్యా విస్తరమును పాఠకులు ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున 323వ పుట నుండి కాంచవచ్చును. ఈ విధముగా వేదములలోని పెక్కు రహస్యములు ఉపనిషత్తులలో విస్తరముగా వివరింబడినవి. మధువు ఇంతటి మహిమ కలది కావుననే ఋగ్వేదములోని మఱికొన్ని మంత్రములు ఈసమస్త జగమును సాధకులు మధుమయముగా చేసికొనవలయునని మనలను ప్రభోధించుచున్నవి. ఎట్లో చూతము.

"మధు వాతా ఋతాయతే,
మధు క్షరంతి సింధవః,
మాధ్వీర్నః సంత్వోషధీః." ఋ. 1-91.6

సత్కర్మలు చేయు సాధకునికి వెలుపలి వాయువులును లోపలివైన ప్రాణశక్తులును మధుమయములై మధురకర్మ ఫలముల నొసంగుగాక. అట్లే నదులు కూడా మధుమయములై మధురరసముల నొసంగి కాపాడుగాక. అట్లే భూమిపై గల సస్యములు, ఫల వృక్షములు ఓషధులు, మూలికలు మొదలైనవియుమధుమయములై వెలయుగాక. ఇంకొక మంత్రమును చూతము.

"మధుమా న్నో వనస్పతి,
ర్మధుమా నస్తు సూర్యః,
మాధ్వీ ర్గావో భవంతు నః." ఋ. 1–91.7

వనస్పతులు, (సమస్తమైన వృక్షములు) సూర్యుడు, ఆవులు కూడ మాకు మధుమయములై మధుర ఫలితములను ప్రసాదించుగాక. అనగా వాటిని మేము బ్రహ్మ స్వరూపముగానే భావించి, మాకు మధుర ఫలములనిచ్చునట్లు సద్వినియోగము చేసికొందుముగాక అని సారాంశము. అంతియే కాదు. గావః, అనుమాటకు వాక్కులు అని అర్థము చెప్పికొన్నచో, మా వాక్కులు అమృతమయములు కావలయుననియు భావము రాగలదు. యోగుల వాక్యములు అమృత తుల్యములే కదా! కనుక "మధునా పూర్ణా" అనెడి మాట యందలి మధుశబ్దముచేత వేదమునందటనట గల మధు శబ్దములలోని భావమును తన్మయముగానే సంభావించుకొని, గంభీరార్థ రహస్య లాభమును పొందవలసియున్నాము.

## శచి - ఇంద్రుడు

మనము వేదములను సూక్ష్మముగా పరిశీలించినచో అందు వర్ణింపబడిన ఇంద్రవరుణాది దేవతలందఱును జగత్తులను నిర్మించుటలో పాలుపంచుకొన్న అద్భుతశక్తి కలవారనియే కాక, గొప్ప శిల్పాచార్యులనియు తెలియగలము. విశ్వకర్మ, త్వష్ట, విష్ణువు, రుద్రుడు, సవిత, వరుణుడు, వివస్వంతుడు, అశ్వినీ దేవతలు, ఋభువులు మహాశిల్ప నిర్మాతలని చదివియేయున్నాము. ఇప్పుడు ఇంద్రుడు మహాశిల్పి అను నంశమును పరిశీలింతము. దిగువ మంత్రము ఇంద్రుని "సురూపకృత్నువు" అనుచున్నది.

"సరూపకృత్ను మూతయే
సుదుఘా మివ గోదుహే
జుహూమసి ద్యవి ద్యవి" ఋ. 1-4-1

తా॥ పాలు కావలసినవాడు మంచిపాల నిచ్చుగోవును పిలుచునట్లు, మంచి చక్కని శిల్ప కర్మలు చేయు ఇంద్రుని మా రక్షణకోసమై ప్రతిదినము పిలుచుచున్నాము. ఈ మంత్రములో ఇంద్రునికి "సురూపకృత్నువు" అను విశేషణము వాడబడినది. అనగా మంచిరూపములను సృష్టించువాడని భావము. దీనిని సాయణులిట్లు వివరించినారు. "సురూపకృత్నుం = శోభన రూపోపేతస్య కర్మణః కర్తార మింద్ర మూతస్మద్రక్షార్థంయేః" అనగా అందమైనస్వరూపముగల

కర్మలను చేయు కర్త అని భావము. అనగా రమ్యరూప నిర్మాత అయిన శిల్పి అనియేకదా తాత్పర్యము. ఇంద్రునికి శతక్రతు, వని ఇంకొక పేరు కలదు. అనగా నూరంటే నూరనియేకాక, అనేకములైన క్రతువులు కలవాడని భావము. క్రతు శబ్దమునకు యజ్ఞమను నర్థమునే పౌరాణికముగా మనము చెప్పుచుందుము. కాని అది విశేషార్థము. ప్రతి పనికినీ క్రతు శబ్దము చెల్లును. అందును లోకోపకారకములైన సత్కార్మలు, హస్తకర్మలు క్రతువులన్నమాట. ఆ పక్షమునకూడ ఇంద్రుడు శిల్పియనుటకు అభ్యంతరము లేదు. అదియునుగాక. యజ్ఞములనునవి విశేషముగా మానవులు చేయునవికాన, ఇంద్ర పక్షమున శిల్ప కర్మలను నర్థమే ఎక్కువ సమంజసముగా నుండును. అనేకములైన లోకోపకారక శిల్పాదికార్యములను చేయువాడని చెప్పికొనుటయే ప్రయోజనకరమైన అర్థమగుచున్నది.

"పురాం భిన్దు ర్యువా కవి రమితౌజా అజాయత,
ఇంద్రో విశ్వస్య కర్మణో ధర్తా వాజీ పురుష్టుతః."
ఋ. 1-11-4

ఈ మంత్రము ఇంద్రుడు "విశ్వస్య కర్మణః=సమస్తమైన కర్మలకు, ధర్తా = ధరించువాడని చెప్పినది. విశ్వకర్మలనగా ఎల్ల శిల్పకర్మలు అని కూడ భావమే. దావికి విశ్వము యొక్క సృష్ట్యాది కర్మలకు అని అర్థము చెప్పికొన్నచో ఇంద్రుడు సాక్షాత్తు విశ్వకర్మయేఅయి జగత్కారణ పర

బ్రహ్మస్థానమునే అందుకొనును. విశ్వస్య+కర్మణః - అనెడి వ్యస్త పదమును షష్ఠీవిభక్తినితీసివైచి సమస్తపదముచేసిన చో "విశ్వకర్మ" కాగలదు. అప్పుడతడు విశ్వకర్మలను చేయువాడై సాక్షాత్తు విశ్వకర్మయే కాగలడు.

అందుకే ఆయన భార్యను శచీదేవిఅని వాఙ్మయము వర్ణించినది. శచి అనగా వేదానుసారము కర్మఅని అర్థము. అందును లోకోపకారకశిల్పాది కర్మఅనికూడ భావము. ఈ అంశమును దిగువమంత్రము రూఢిపఱచుచున్నది.

"శచ్యాకర్త పితరా యువానా
శచ్యాకర్త చమసం దేవపానం,
శచ్యా హరీ ధనుతరావ త
ష్టేంద్రవాహా వృభవో వాజరత్నాః." ఋ. 4-35-5

శచి అనగా శిల్పకర్మ కౌశలము, ప్రజ్ఞ, జ్ఞానమని భావము. ఋభువులు అట్టికర్మకౌశలముచేతనే తమ తలిదండ్రులను యౌవనవంతులనొనర్చినారు. దేవతలు అమృతపానముచేయు సాధనమైన చమస(పాత్ర) మునునిర్మించినారు. ఇంద్రుని గుఱ్ఱములను వేగముకలవాని నొనర్చినారు. ఇక్కడ ఇంద్రాశ్వములు యంత్రమయములని గ్రహింపవలయును. కాన శిల్పకర్మను చెప్పుటకు పైమంత్రమున శచీపదమును వాడుటను గమనింపవలెను. శచీశబ్దమువలె మాయాశబ్దము కూడ జ్ఞాన, ప్రజ్ఞా, కర్మ వాచకమే. అందుకే "ఇంద్రో

మాయాభిః పురురూప ఈయతే” అన్నమాటకూడ కర్మపరమైన జ్ఞానమునే చాటుచున్నది. ఇందుకీ ప్రయోగమును కూడచూతము -

“త్వం మాయాభి రపమాయినోఽధమః.” 1-51-4

“హేఇంద్ర, త్వంమాయాభిః = జయోపాయజ్ఞానైః” మాయేతి జ్ఞాననామ, శచీనామేతి తన్నామసు పాఠాత్” అని భాష్యము.అయితే మాయాశబ్దమునకు మోసము, కపటము అనునర్థములు కూడ లేకపోలేదు.

క్రతుశబ్దమునకు మొదట కర్మమనియే అర్థముండెడిది. అట్టిదిక్రమముగా యజ్ఞకర్మమునకు రూఢిచేసినారు. శతక్రతు వనగా బహువిధశిల్పకర్మలను చేయువాడు, పాలించువాడు, ప్రోత్సహించువాడనియే తాత్పర్యము. సాయణులీయర్థమును వ్రాయకపోలేదు. సురూపకృత్ను, మాయి, శతక్రతు, బహుక్రతువు మొదలైన పదములు శిల్పియైన ఇంద్రునికి పర్యాయములే.

ఇంద్రుడు శిల్పికనుకనే ఆయనకు కర్మశక్తి (శచి) ప్రియతమమై-భార్యగా వాఙ్మయమున వర్ణింపబడినది. శిల్పికెప్పుడును ఆతడుచేయు శిల్పకార్యము ప్రియమేకదా. ఈ సందర్భమున సురూపకృత్నుపదమువలె సుహస్త, సుకర్మా, సాధుకర్మా, కర్మారః, అపస్తమః (అపసామపస్తమః-అని వేదప్రయోగము) మొదలైన పెక్కుపదములుకూడ శిల్పి పర్యాయములుగా వాడబడినవి. వాటిని సందర్భానుసారము మన దర్శనములలో వివరింపకపోలేదు.

శచీశబ్దమునకు ప్రజ్ఞఅనికూడ అర్థము ఋక్కులందే అగపడుచున్నది. "శచీవ ఇంద్ర పురుకృద్ద్యుమత్తమ" (1-53-3) శచీవ-ప్రజ్ఞానామ "శచీవః=ప్రజ్ఞావన్" అని భాష్యము. ప్రజ్ఞా, ప్రతిభాదులు చతురబుద్ధి లక్షణములు.

ఇంతకూ తేలిన సారాంశమేమన, ఏ వ్యక్తి కాని కర్మ రహితుడై యుండుట వేద మాతకిష్టముకాదనియే. అందుకే ప్రతివారిని కర్మయోగులుగా జీవింపు డనుచున్నదికాని వేదము, సోమరులుగా బ్రదుకుమనుటలేదు. ఈ అంశమునే "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" అనెడి ఈశావాస్యమును, "కర్మ జ్యాయో హ్యకర్మణః" "కురు కర్మైవతస్మాత్త్వం,శరీరయాత్రాపిచ తేన ప్రసిద్ధ్యేదకర్మణః" అనెడి గీతా సూక్తులును వచించినవి. అసలు కర్మచేతనే జీవత్వమనునది ఏర్పడుచున్నది. అనాదికర్మ ప్రవాహమున బడి ఈదులాడుటయే జీవునిస్వభావము. కర్మయేలేనిచో జీవుడే ఉండడు.కాన జీవునికి కర్మతో విడదీయరాని బంధము కలదు. అందుకే కర్మబంధమన్నారు. ఆ బంధమును వదలించుకొనుటకును కర్మయే కావలసియున్నది.

ప్రతివానికిని కర్మఅనునది తన అర్ధాంగలక్ష్మి కావలెననుటయే వేదహృదయము. కనుకనే మన్వాది పంచ బ్రహ్మలకుగూడ ఆదిశక్త్యాదులను భార్యలనుగా సంస్కృత వాఙ్మయము చిత్రించినది. పురుషుడు-ప్రకృతి, శివుడు-శక్తి, మానవుడు - కర్మము - అనునీజంటలు ప్రకృతిధర్మసిద్ధములు కాని వేఱుకాదు.

లోగడ ఇంద్రవిష్ణువులు జీవేశ్వర స్వరూపులని నిరూపింపబడినది. అందు ఇంద్రుడు కర్మలనుచేసి వాటిపుణ్యాములను అనుభవించెడి జీవాత్మ అనిచెప్పికొన్నాము. ఈసురూపకృత్నుపదమును కర్మలంపటుడైన ఆ జీవునికిగూడ అన్వయింపజేసికొని ఇష్టసిద్ధిని పొందవచ్చును. సురూపకృత్నుపదముచేమంచిపనులనుచేయుటయేజీవునిలక్ష్యము కావలెను కాని, అపరూపములైన దుష్కర్మలనుచేయుట ఆతనికర్తవ్యముకారాదని మనకొక విశేషమునుసైతము వేదము బోధించుచున్నది.

వేదమును సూక్ష్మముగా పరిశీలించినచో ప్రతి దేవుడును ఏదోఒక పనిని చేసినట్లే మనముకాంచగలము.

## అనుప్రవేశ రహస్యము

విశ్వకర్మసూక్త ప్రథమ మంత్రమున "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛదవరా ఆవివేశ" అని ఉన్నదికదా! విశ్వకర్మ బ్రహ్మాండశరీరమును, జీవశరీరములను సృష్టించి అందుప్రవేశించినాడని దీనిభావము. దీని ననుసరించియే తైత్తిరీయోపనిషత్తుకూడ ఇట్లన్నది.

"సోఽకామయత. బహుస్స్యామ్ ప్రజాయేయేతి. స తపోఽ
తప్యత-స తప స్తప్త్వా. ఇదం సర్వ మసృజత-య
దిదం కించ. తత్ సృష్ట్వా, తదేవానుప్రావిశత్."

భగవంతుడు ఈ జగమును, శరీరములను సృష్టించి,

అందుతాను ప్రవేశించెను-అనియే దీని భావముకూడ. దీనిని అనుప్రవేశ రహస్యమందురు. కొన్ని గ్రంథములు గర్భము లోని పిండమునందు శిరోరంధ్రము (బ్రహ్మరంధ్రము) ద్వారా జీవుడు హృదయమున ప్రవేశించుననికూడ వ్రాసినవికాని, ఇది ఛాందోగ్యోపనిషత్తు చెప్పెడి విధానమునకు భిన్నముగానున్నది. ఛాందోగ్యములోని పంచమాధ్యాయము నందలి పంచాగ్నివిద్యనుబట్టి మరణానంతరము జీవులు స్వర్గ, నరక లోకానుభవములను పొంది ఆకాశమునకు చేరుదురనియు (1) అటనుండి మేఘములలో ప్రవేశింతురనియు, (2) ఆవల భూపతితులై (3) ఓషధులరూపమున పురుషునిలో ప్రవేశింతురనియు (4) అతనిలో వీర్యరూపమును దాల్చి మఱల స్త్రీగర్భమున ప్రవేశింతురనియు (5) తెలియుచున్నది. దీనినిబట్టి పురుషునివీర్యము స్త్రీ గర్భమునందు ప్రవేశించినప్పుడే జీవుడుకూడ ప్రవేశించుచున్నాడుగదా! ఇట్టియెడ 5,6 మాసములయందు జీవప్రవేశము జరిగినదనుట ఎట్లుపొసగును? ఇందుకు సమన్వయమును ఈ విధముగా ఊహింపవలయును.

ఛాందోగ్యోపనిష ద్వర్ణన ననుసరించి, పురుషబీజము నందే జీవుడు చేరియుండునుకదా. ఆ జీవుడు సంయోగ కాలమున స్త్రీగర్భమున ప్రవేశించి పిండరూపమున క్రమముగా శరీరముగా వృద్ధిపొందును. అట్టిపిండమునకు కాలు సేతులు, ఇంద్రియములు మొదలగునవి ఏర్పడునప్పటికి

కొంతకాలము పట్టును. అట్టిఅంగములు ఏర్పడిన పిమ్మటగాని, జీవునియొక్క అభివ్యక్తి (తోచుట) జరుగదని మనము తలంపవలయును. ఈ పని జరుగునప్పటికి 5, 6 మాసములు పట్టుననుకొన్నచో, అటు తరువాత జీవుడు వ్యక్తముకాగలడు. ఆ అభివ్యక్తినే మనవారు సామాన్యులకు తెలియుటకోసమై జీవప్రవేశమని వర్ణించియుందురు. కావున అనుప్రవేశమనగా, శరీరమున, జీవునియొక్క అభివ్యక్తిమాత్రమే అని తలంపవలయును. ఇట్టి రహస్యములనేకములు వేదోపనిషదాదులలోని మంత్రములకు ఆలోచించి సమన్వయము సమకూర్చుకొన వలసి యున్నది.

"కో దదర్శ ప్రథమం జాయమానమ్"

ఈ వాక్యము ఋగ్వేద ప్రథమ మండలములోని (164) మోక్షసూక్తమునందలి నాల్గవ మంత్రములోనిది. మోక్షసూక్తమంత్రములు పెక్కింటి భావమును మనము ఋగ్వేదదిగ్దర్శనతృతీయ భాగమున చదివియే యున్నాము. అందే యీ మంత్రముయొక్క పూర్ణ భావమును చూచితిమి. ఇక్కడ ఈ వాక్యముయొక్క అంతరర్థమును మాత్రమే తాత్త్విక దృష్టితో పరిశీలించి సమన్వయించుకొందము.

"ప్రథమం జాయమానం" అనగా మొదట పుట్టినది అని ఒక అర్థము. మొదటి నుండి అనాదిసిద్ధమై ఉన్నది అని ఇంకొక అర్థము. మొదటినుండి ఉన్నది నాసదీయము చెప్పిన సదసదతీతము, జగత్కారణ వస్తువన్నమాట. దీనినే

విశ్వకర్మ సూక్తము "న తం విదాథ య ఇమా జజాన" అన్నది. దానినుండి మొదటగా పుట్టినదేమో తమస్సు, అవ్యక్తము, మూలప్రకృతి, మాయ, అవిద్య, అజ్ఞానము-ఇత్యాది పదములచే పేర్కొనబడిన జగదుపాదానకారణ వస్తువన్నమాట. ఈ రెంటినికూడ చూచిన వారెవ్వరును అప్పుడు లేనేలేరు. అందువల్లనే మంత్రము "కః దదర్శ" ఆ ఆదిమ వస్తువును ఎవడు చూచినాడు- అనుచున్నది. అనగా ఆనాటికి చూచువాడెవ్వడును (ద్రష్ట) సిద్ధము కాలేదన్న మాట. చూచువాడు ఏర్పడవలెనన్న ప్రకృతి (Matter) పరిణామముచెంది, ఆకాశాదులుగా రూపొంది, అవి గూడ పరిణామ క్రమమున గుణ సంయోగముద్వారా జగముగా రూపొందవలసి యున్నది. అట్టి పరిణామమేదియు అప్పటికి జరుగలేదని మంత్రభావము. ప్రకృతి పరిణమింపవలెనన్న కోట్ల సంవత్సరముల కాలము పట్టును గనుక దానిని చూచువాడెవ్వడును- తెలిసికొనువాడెవ్వడును అప్పుడుండ వీలు లేదని సారాంశము. అప్పుడున్న వస్తువులు ప్రకృతి పురుషులిరువురే. పురుషుడనగా ప్రకృతికిగూడ మూలమైన సత్తని యెంచవలసియున్నది. అనగా ఏకైక సత్పదార్థమునుండి రెండవదొకటి కలిగిన దశ అది. ఈ రెంటి సంయోగము చేతనేకాని ఆ రెంటిని దర్శించగల ద్రష్ట, సాక్షి ఏర్పడడు. ఆ సాక్షి చైతన్యరూపుడు కావలెను. వాడు మాత్రమే తనకు శరీరమైన ప్రకృతిని, తన్ను దర్శించును. ఈ అంశమునే

విశ్వకర్మ సూక్తము ఏ వస్తువు ఈ పిండబ్రహ్మాండములను కల్పించినదో, ఆ వస్తువే ఆ పిండబ్రహ్మాండములందు జీవరూపముగా ప్రవేశించినది అన్నది. ఇట్లనుటచేత అద్వైతభావము చక్కగాసిద్ధించుచున్నది. వేదముసుస్పష్టముగా చెప్పిన పరమాద్వైతసిద్ధాంతము ఇదియే. అనగా సదసదతీతమునుండి సత్తు వ్యక్తమై అసత్తును సృష్టించి పురములను కల్పించి ("పశ్చాద్భూమి మథో పురః"- పురుష సూక్తము) వాటియందు తానే వ్యక్తమైనది. ఆ పురుషుడే జగమును, జగత్కారణమును చూచు ద్రష్ట. అనగా ఏ ఏకైకమైన అనిర్వచనీయ సదసదతీతము నానాత్వ విశిష్టమగు విచిత్ర జగమును సృష్టించి అందే తగుల్కొని బద్ధమైనట్లు భావించి, ఆ బంధమునుండి విడివడుటకు ప్రవర్తించుచున్నదో, అదే తానన్నమాట. అది నిత్యముక్తమే అయ్యును, విముక్తికోసము యత్నించుచున్నదని కూడ సాధకులు భావింపవలయును. ఈ జగత్కథను వర్ణించుటకే నాసదీయ, విశ్వకర్మ, పురుష, మోక్షసూక్తాదులు ఋగ్వేదమున బయలుదేరినవి.

దీనినిబట్టి తేలిన సారాంశమేమన, జీవుడు ఏ వస్తువు నుండి బయలుదేరి జగచ్చక్రము (సంసారము)న తగుల్కొన్నాననుకొని ఆ బంధమునుండి ముక్తినొంద యత్నించి కడకు తాను వచ్చిన తావుకే చేరి ఆనందము (నిర్వృతి) నందుచున్నాడో, అదే తాను. అందుకే జగమును సంసార చక్రమన్నారు. దీనికి ఆద్యంతములు లేవు. చక్రమువలె

తిరుగుచునే యుండును. విచారించినచో- తపస్సు చేసినచో సంగతి తెలిసి ఆ చక్రము నిన్నేమీ బాధింపదు. నీవప్పుడు నిరతిశయానంద స్వరూపుడవు కాగలవు. సదసదతీత పర మార్థమవే అగుదువు.

ఈ రహస్యమునే పరమేశ్వరుడు సర్వులకు జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అను మూడవస్థలను సృష్టించి బోధించి నాడు. విజ్ఞానులకు, సాధకులకు ఆ మూటికావల సమాధి (తురీయము) తురీయాతీతములను సృష్టించి తన చెంతకు చేర్చుకొనుచున్నాడు. మానవులకీ రహస్యమును బోధించు టకే ఈ గ్రంథములు బయలుదేరినవి. వీటినెల్లరును ఉప యోగించుకొని ధన్యులు కావచ్చును. ఈ సృష్టిరహస్యమును జగత్కథను అవగాహన చేసికొనవచ్చును.

ఈ మొట్టమొదటనున్న పురుషుని, ప్రకృతిని దర్శిం చుటయే జీవిత లక్ష్యము. అవి స్థూల దృష్టికి రెండుగా తోచుచున్నను, వస్తుపరిశీలన చేయగల సూక్ష్మదృష్టికి ఒక్కటే. అందుకే మంత్రము "ప్రథమం జాయమానం" అని ఏకవచనమునే ప్రయోగించినది. చెట్టు బోదె, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పండ్లు, రసము, గింజలుగా నానా రూపములతో నున్నను, కడకీ నానాత్వమంతయు, భిన్నత్వ మంతయు గింజ (బీజము) లో ఏకరూపముగా లీనము కావలసినదే. మఱల ఆ ఏకమునుండియే నానాత్వము పొడక

సృష్టికూడ. ఈ రహస్యమును ఏనాడో మదీయ శిల్పదర్శనమున వివరించి చూపుటమైనది. పాఠకులు ప్రత్నదర్శనము నంతటిని చదివినచో సంగతి అంతయు బోధపడగలదు. దీనినే బ్రహ్మముగారు ఒక గేయములో "తనలోన నున్న తత్త్వమెవ్వరు తెలిసికొనరన్న" అన్నారు. తనలోనున్న తత్త్వము నాసదీయము వర్ణించిన సదసదతీతమే. విశ్వకర్మ సూక్తము చెప్పిన విశ్వకర్మయే. పురుషసూక్తము వర్ణించిన పురుషుడే. మోక్షసూక్తములోని "ద్వాసుపర్ణా సయుజా సఖాయా.... అను మంత్రము చెప్పిన జీవపరమాత్మలుగా వర్ణితులైన వస్తువే. అది సంసారదశలో భోక్త. మోక్షదశలో పరమాత్మ. బ్రహ్మముగారీ విషయమును "వెదకితే కనబడని వస్తువు ఎక్కడున్నదో చూడరా" అని ఇంకొక గేయములో అన్నారు. వెదకితే కనబడని వస్తువు, అన్నిటిని వెదకుచు తనలోనే ఉన్నదికదా! అన్నిటిని చూచు కన్ను తన్ను చూచుకొనలేనట్లు అన్నిటిని చూపు వ్రేలు తన్ను చూపుకొనలేనట్లు, అది సర్వసాక్షియై, అన్నిటికి మూలకారణమై, ఆదిమూలమై నీవే అయియున్నది బాబూ!

## వృత్రవధ రహస్యము

యజుర్వేద దర్శనమున మనము విశ్వరూప కథా పరమార్థమును చదివియున్నాము. దానివలెనే వృత్రుని కథ కూడ ఆలోచించి తెలియదగిన తాత్త్విక రహస్యములతో నిండినట్టిదే. కాన దాని నిచ్చట ప్రస్తావించుకొనుట ఆవశ్యకము.

చెప్పుచున్నది. జీవుని ఆవరించిన ఆ మాయయే వృత్రాసురుడుగా పేర్కొనబడినాడు. ఆతడు (మాయ) షోడశ వికారములే స్వరూపముగా కలిగినవాడు. కన్ను, ముక్కు, చెవి, చర్మము, నాలుక- అనెడు 5 జ్ఞానేంద్రియములు- వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ- అనెడు 5 కర్మేంద్రియములు, పంచప్రాణములు (ప్రాణాపాన వ్యానోదాన సమానములు) అంతఃకరణము ఒకటి- ఈ పదునాఱింటికి షోడశ వికారములని పేరు. ఈ పంచభూతముల యొక్క పదునాఱు వికారములే దేహరూపమునుదాల్చి ఆ దేహమున జీవుని బంధించివేసినవి. అందువలన మాయకు, వృత్రుడు - అనగా పరమాత్మను ఆవరించినవాడు అనెడి సార్థక నామధేయము కలిగినది. అట్టి వికారములను హరించి, జీవునికి ముక్తి కలిగించునట్టిదే వజ్రాయుధము. ఇది సాక్షాత్తు భగవదనుగ్రహముచేత, సద్గురుమూర్తి కృపచేత ప్రాప్తింప దగినదే కాని, ఇంకొక రీతిగా చేకూరునదికాదు. అందుకే జీవరూపుడైన ఇంద్రునికి భగవద్రూపుడు, గురుస్వరూపుడు అయిన త్వష్టయే శిష్యుని ఆవరించిన మాయను గెలుచుటకు వజ్రాయుధ రూపమయిన తత్త్వోపదేశమును చేసినాడను రహస్యమును మనమిచ్చట గ్రహింపవలసి యున్నది. ఆ వజ్రముచేత జీవస్వరూపుడగు ఇంద్రుడు వృత్రుని (షోడశ వికార స్వరూప మాయను) గెలిచి, ముక్తుడై స్వారాజ్య పట్టభద్రుడైనాడని సారాంశము. ఈ సందర్భమున ఈ రహస్యమును తైత్తిరీయసంహిత ఇట్లు నిగూఢముగా చెప్పుచున్నది.

"ఇంద్రో వృత్ర మహన్, తం వృత్రః హతః షోడశభిర్భోగై రసినాత్స "ఏతామగ్నయేఽనీకవతే" ఆహుతిమపశ్య త్తా మజుహో త్తస్యాగ్ని రనీకవాన్ స్వేనభాగధేయేన ప్రీతః షోడశధా వృత్రస్య భోగా నప్యదహ ద్వైశ్వ కర్మణేన పాప్మనో నిరముచ్యత యదగ్నయేఽనీ కవతే."

తై. సం. కాం. 5 ప్రశ్న 4 అనువాకము-5.

దీనికి సాయణభాష్యము :- ఇంద్రో యదా వృత్రం వజ్రేణ ప్రహతవాం స్తదా స వృత్ర ఆసురమాయయా సహసా షోడశ సర్పాకారాణి శరీరాణి స్వీచకార. స్వీకృత్య చ భోగశబ్దాభిధేయై స్తై స్సర్పాకారశరీరై స్త మింద్రం హ స్తపాదాద్యవయవేషు బబంధ. తదానీం స ఇంద్రః ప్రతీకారం విచార్య అనీకేన సైన్యేన యుక్తాయాగ్నయే "ఏతామగ్ని స్తిగ్మేనే"తి మంత్రద్వయేన సాధ్యా మాహుతిం దత్త్వాహుతవాన్. తత స్సోఽగ్ని రనీకవాం స్తుతో వృత్రస్య షోడశసర్పాకారాణి శరీరాణ్యదహత్. తతఊర్ధ్వ మింద్రో "య ఇమా విశ్వేతి" సూక్తద్వయసాధ్యేన వైశ్వ కర్మణ హోమేన వృత్రవధజన్యాత్ పాప్మనో నిర్ముక్తః."

దీనిభావము :- ఇంద్రుడు వృత్రుని చంపెను. అట్లు చంపబడినవృత్రుడు అసురమాయచే పదియారు విధములగు సర్పాకార శరీరములనుదాల్చి ఇంద్రుని హ స్తపాదాద్యవయవములను బంధించెను. అప్పుడు ఇంద్రుడు ప్రతీకారమును విచారించి "అగ్ని స్తిగ్మేన" అను మంత్రద్వయముచే అగ్ని

హోత్రునికి ఆహుతులనొసంగెను. అప్పుడాయగ్ని సంతో షించి సర్పాకారములగు వృత్రుని పదియారు శరీరములను దహించివేసెను. దానిచేత ఇంద్రునికి సర్పబాధనశించినదే కాని పాపముమాత్రము పోలేదు. అంతట ఇంద్రుడు "య ఇమా విశ్వా"అనెడి రెండు విశ్వకర్మసూక్తములచేత పదు నారు ఆహుతులతో వైశ్వకర్మణహోమమునుచేసి, వృత్ర వధ జనితమైన పాపమునుండి విముక్తుడైనాడట. ఇది సాక్షాత్తు యజుర్వేదసంహిత చెప్పిన కథయేకాని, భాష్యకారులు ఊహించిచెప్పినదికాదని మనముగ్రహించియే యుందుము. దీనినిబట్టి వృత్రవధ కథారహస్యమును మనము మనజీవిత ములయందు సమన్వయించుకొని మోక్షసిద్ధిని పొందవలసి ఉన్నాము.

వృత్రుడనగా మాయాశక్తి అని చెప్పికొనియేఉన్నాము కదా! అది షోడశవికారరూపమై జీవుని బంధించి, సంసార బాధలకు గురిచేయుచున్నదనుటయు యథార్థమేకదా! వాటిబాధనుండి తప్పించుకొనుటకు మానవుడు విశ్వకర్మ సూక్తమంత్రార్థములను మననముచేసి ఆచరింపవలసియున్నది. ఈ రహస్యమునే, ఇంద్రవృత్రులకథ మనకు ప్రబోధించు చున్నది. షోడశ వికారములను సర్పభోగము (శరీరము)లని చెప్పుటచేత జీవుడు ప్రాపంచికభోగములను ఈ షోడశవికార ముల ద్వారముననే, అనగా బాహ్యాంతరింద్రియముల మూలముననే పొందుచున్నాడనుట స్పష్టమేకదా! అట్టి

షోడశవికారములకు లోబడకయుండుటకు విశ్వకర్మతత్త్వావగాహన మవసరమన్న మాట.

ఏతత్త్వజ్ఞుడు ఈ షోడశవికారములనుండి జీవుడయిన తనను, వేఱుచేసికొని తన్ను సాక్షాత్పరమాత్మునిగా తెలిసికొనునో, ఆతడు ముక్తుడగునని వృత్రవధ రహస్యము మనకు చాటుచున్నది. కావుననే ఋగ్వేదీయ విశ్వకర్మసూక్తములు ఏడేసి మంత్రములనుకలిగియుండి సప్తలోక, సప్తచక్రయుక్తములైన బ్రహ్మాండ, పిండాండ రహస్యములను సూచింపగా, యజుర్వేదీయములైన విశ్వకర్మసూక్తములు రెండును, ఎనిమిదేసి మంత్రములతో నొప్పుచూ మొత్తము పదునాఱైషోడశ వికారములను సూచించిచూ వాటినుండి అద్వైతరూపుడైన జీవుడు వేఱగుటకు మార్గమును సూచించుచున్నవి. ఋగ్యజుర్వేదములలోని మంత్ర సంఖ్యలు ఈ విధముగా పరమాధ్యాత్మిక రహస్యములను సూచించుట వేదజననీ జనకులకు తమ సంతానము నెడగల దయారసమునకు గుర్తుగా నొప్పుచున్నది. ఇంద్రుడంతటివాడే తన బంధములను విశ్వకర్మసూక్త మంత్రాహుతులచేత కాల్చివేసికొని పాప ముక్తుడుకాగా, సామాన్యులైన మానవులు దాని తత్త్వము నెఱుంగక ఎట్లు మోక్షప్రాప్తులగుదురు ! కావున వేదముల యందలి ఇట్టి నిగూఢ పరమ రహస్యములను సూక్ష్మాతి సూక్ష్మదృష్టితో గ్రహించి వేదోపాసకులు ధన్యులు కావలసి ఉన్నారు.

## అ ది తి

ఋగ్వేదమున పేర్కొనబడిన దేవతలలో అదితి జగన్మాతగా పొడకట్టుచున్నది. మన పురాణ వాఙ్మయమున ఈమె దేవమాతగా ప్రసిద్ధురాలు. ఈమెనుగూర్చి ఋగ్వేద దిగ్దర్శనము రెండవ భాగమున కొంత ప్రస్తావింపబడినది. ఈ మంత్రము అదితి దేవియొక్క జగన్మాతృత్వమును ఇట్లు కొనియాడుచున్నది.

"అదితి ర్ద్యావదితి రంతరిక్షం
అదితి ర్మాతా పితా స పుత్రః,
విశ్వే దేవా అదితిః పంచజనా
అదితి ర్జాత మదితి ర్జనిత్వమ్." -ఋ.1-89-10

తా॥ అదితి అనగా దీనురాలు కాదనియు, అఖండనీయ (పరిపూర్ణురాలు) అనియు సాయణుల భావము. ఆమె భూదేవికాని, లేక దేవమాతకాని కావచ్చునని కూడ సాయణు లనుచున్నారు. పై మంత్రము ఆ అదితియే ప్రకాశించు గుణముగల నాకము (స్వర్గాదిలోకములు) భూదివములకు నడుమనున్న అంతరిక్షము, జగములకు, మనకు తల్లి, తండ్రి, మనకు కలిగెడి పుత్రుడు కూడ ఆమె రూపమే. ఎల్లదేవతలును అదితియే- అనగా ఇట వసు రుద్రాదిత్యులను గ్రహించిన అందఱు దేవతలను గ్రహించి నట్లే కాగలదు. సానగ, సనాతన, అహాభూన,ప్రత్న, సుపర్ణ

లనెడి పంచజను (ఋషు)లు కూడ అదితియే. సర్వప్రాణుల ఉత్పత్తి కూడ అదితియే. జన్మలకు ఆధారము (అధిష్ఠానము) సైతము అదితియే- అని స్తుతింపబడినది. అనగా దీనినిబట్టి ఈమె పరమాత్మ స్వరూప జగజ్జననియే జగత్పితయే అన్న మాట. ఈ మంత్రమున ఈమె "సః" అని చెప్పబడినందున అదితి అనెడి జగత్కారణ వస్తువు పురుష స్వరూప మనియు ఎన్నవచ్చును. అనగా జగత్కారణ స్త్రీ పురుష స్వరూపము అదితియే అని సారాంశము. ఈ రహస్యమును కాళిదాసు- "స్త్రీ పుపుంసావాత్మభాగౌ తే భిన్న మూర్తేః సిసృక్షయా" అని స్పష్టము చేసినాడు. గాయత్రీ విశ్వకర్మలు అభేదమును వహించిన జగత్కారణులని మనము చదివియే యున్నాము. దానిని బట్టి అదితి విశ్వకర్మ స్వరూపమును, గాయత్రీ రూపమును- అనగా ప్రకృతి పురుష స్వరూపమే అగుచున్నది కదా. ఇందుకు తగినట్లే ఈ మంత్రము విశ్వేదేవతలు అదితి స్వరూపమే అని చెప్పగా, విశ్వకర్మనుండియే వసురుద్రాదిత్యాదులు జన్మించినారని యజుర్వేదము చెప్పినదని మనము యజుర్వేదదర్శనమున చదివియేయున్నాము."యో నః పితా జనితా, యో విధాతా" అని విశ్వకర్మ సూక్తమన్నదికదా. అట్టి మాతా పితృత్వము అదితికిని, విశ్వకర్మకును తుల్యమే అగుటచే ఇరువురును జగత్కారణ స్వరూపమే అగుచున్నారు. ఇందుకు తగినట్లు ఈమెకు బ్రహ్మణస్పతి అనెడి పేరు సైతము వేదములో వాడబడినది. ఋగ్వేదమున త్వష్ట పుత్రుడైన బ్రహ్మణస్పతి వేదాధిపతిగా పేర్కొనబడినాడు.

బ్రహ్మణః=వేదమునకు పతిః=పాలకుడు అని ఆ మాట కర్థము. ఈ బ్రహ్మణస్పతిని గూర్చి 10, 12 సూక్తములు ఋగ్వేదమున గలవు. అందుకొన్నిటిని ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున 291 నుండి 299 పుటల వఱకు వివరించినాము. ఆ బ్రహ్మణ స్పతినే నేడు గణపతిగా అర్చించుచున్నారు. ఈ బ్రహ్మణస్పతికిని, అదితికిని అభేదమును దిగువ మంత్రము వక్కాణించుచున్నది.

"బ్రహ్మణ స్పతి రేతా సం
కర్మార ఇవాధమత్." ఋ.10-72-2

బ్రహ్మణస్పతి వేద నిర్మాతయైన దేవుడు. ఈ జగములను, లేదా దైవశక్తులను కమ్మరి (శిల్పి) వలె సృష్టించినాడు-అని భావము. ఇది అదితి దర్శించిన సూక్తము. ఇందలి బ్రహ్మణస్పతిని సాయణులు అదితి అని భావించినారు. ఈ విస్తరమును ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున కాంచవచ్చును. మా భావము: వేద దృష్టిలో బ్రహ్మణస్పతి, అదితి ఏకైక జగత్కారణతత్త్వమే అని. జగత్కారణము నాసదీయ సూక్త, పురుష, విశ్వకర్మ సూక్తములలో పుంపుంసక లింగములలో చెప్పబడగా, ఈ మంత్రమున స్త్రీ లింగములో చెప్పబడినది. కావున అది సర్వలింగములతో చెప్పబడినను, లింగగుణకర్మలకు లోబడని సర్వాతీతమని భావించుట సమంజసము. ఈ రహస్యమును చాటుటకే వేదపురుషుడు త్రిలింగములందును జగత్కారణమును

ఉగ్గడించినాడు. ఇట్టిఅదితి దక్షపుత్రికయనికూడ వేదమంత్రము చెప్పకపోలేదు. దక్ష శబ్దార్థమునుకూడ జగత్కార్యము కలుగుటకు దక్షమైనవస్తువని మనము భావింపవలయును.

## విజ్ఞానకోశయాత్ర

సృష్టి పంచభూతములతో ఏర్పడినట్టిది. కావున సృష్టిలోని ప్రతి వస్తువును పంచ భూతాత్మకమే కాని భిన్నము కాదు. ఒక్కొక్క వస్తువునందు ఒక్కొక్క భూతముయొక్క అంశము (భాగము) ఎక్కువగా ఉండినను ఉండవచ్చును. ఉన్నదికూడ. దాని తారతమ్య విచారణ మనకిచ్చట అనావశ్యకము.

సృష్టి సారమైన మానవుడుకూడ పంచభూతముల పరిణామముగా ఏర్పడిన వాడే. ఆతడు పంచభూత పరిణామమే కాక, పంచకోశ స్వరూపుడు కూడను. కనుక మానవ సృష్టి పంచాత్మకము. మానవునిలో 1. అన్నమయ, 2. ప్రాణమయ, 3. మనోమయ, 4. విజ్ఞానమయ, 5. ఆనందమయము లనెడి కోశములు ఉన్నవి. వీటిలో అన్నమయ కోశమనగా అన్నరస పరిణామముగా కలిగి, అన్నముతోనే వృద్ధిపొందెడి స్థూలశరీరము. దీనితో జాగ్రదవస్థ ననుభవించుచు పనులు చేయుచుందుము. రెండవది ప్రాణమయ కోశము. ఇది పంచప్రాణములతోను, వాక్పాణిపాదపాయూపస్థలనెడి కర్మేంద్రియములతోను, ఏర్పడినట్టిది. దీనితోడ్పాటున్ననేకాని అన్నమయకోశము పనిచేయదు. ఇక

మూడవది మనోమయకోశము. ఇది మనస్సు, శ్రోత్రత్వ క్చక్షూరసన ఘ్రాణములనెడి జ్ఞానేంద్రియములతో గూడి నట్టిది. ఈ మనోమయ కోశముతో మనము సంకల్ప వికల్ప నిశ్చయాదులను, ఆలోచనాదులను చేయుచుందుము. ఇదియే జంతువులనుండి జనులను వేఱుచేయుచున్నది. ఇక నాల్గవది విజ్ఞానమయకోశము. ఇది మనస్సును మించిన విశుద్ధబుద్ధి తోను, జ్ఞానేంద్రియములతోను, వాటి గుణములైన శబ్దస్ప ర్శాదులతోను కూడినట్టిది. ఈ విజ్ఞానమయ కోశము విక సించినవారే కవులు, శిల్పులు, పండితులు, తత్త్వవేత్తలు మొదలైన బుద్ధిజీవులు. ప్రాణ మనోవిజ్ఞానమయ కోశములు మూడునుకలసి సూక్ష్మ శరీరమగుచున్నది. మానవులీ శరీర ముతో స్వప్నావస్థ ననుభవించుచుందురు. ఇక అయిదవదే ఆనందమయకోశము. అది కారణోపాధితోను, అందు ప్రతి బింబించిన జీవునితోను కూడినట్టిది. దానిని వేదాంతము కారణ శరీరమన్నది. ఆ శరీరముతో జీవులు సుషుప్తి దశను అనుభవింతురు. కారణశరీరమునందలి ప్రతిబింబమైన జీవు నికిగూడ మూలమైనదే ప్రత్యగాత్మ, పరమాత్మ. సాధారణ ముగా జీవులలోకొందఱు అన్నమయ శరీరమున జీవించు వారును, ప్రాణమయ కోశమున జీవించువారును, మనో, విజ్ఞానానందమయ కోశములందు జీవించువారును అని అయిదు తరగతులుగానుందురు. పశువులు మొదలగువాటి జీవితము అన్నమయ ప్రాణమయ (కర్మేంద్రియ)ముల మీదనే ఆధారపడికొనసాగుచుండును. మనోమయజీవనము

నందే మానవుడు మానవుడు కాగలుగు చున్నాడు. మంచి చెడుల, హితాహితముల తారతమ్యము నెఱింగినవారే మనోమయజీవులు. ఇంతవఱకు సాధారణ జీవిత చక్రమును మానవుడు దాటినట్లు కాదు.

విజ్ఞానమయ కోశజీవనము ప్రారంభమయిననేకాని, అతిమానవ, మానవతీతజీవితము ప్రారంభమయినట్లుకాదు. అందుచేయవలసిన సాధనలు, అతీతసాధనలు అనేకములు. నామరూపోపాసనద్వారా అనేక సిద్ధులను ఆ జీవితమున సాధింపవీలుఉన్నది. ఎంతెంతటి అసాధ్యఫలములను సాధకుడు కాంక్షించునో, అంతంతటి కఠోర, దివ్య, పరిపూర్ణసాధనలను ఆతడు ఆచరించవలసి యున్నాడు. ఆసాధనలు పరిపక్వమగు చున్నకొలదిని ఇంద్రియాతీత విషయములు, అతీంద్రియ శక్తులు, పూర్వాపరజన్మ విశేషములు, భవిష్యజ్జగత్కథా రహస్యములు సాధకునికి అవగాహన అగుచుండును. విజ్ఞాన కోశప్రయాణమార్గము గహనమును, గంభీరమును అయినను, కష్టభూయిష్ఠమును, ప్రమాద బహుళమును ఎంత మాత్రమును కాదు. అది ఆనందమయమును, ఆశ్చర్యకరమునై సాధకుని ముందుకు పొమ్మని హెచ్చరించుచునే యుండును.

ఎంతెంతగా ఆ మార్గమున సాధకుడు మజిలీల నందుకొనుచున్న అంతంతగా ఇంకను మున్ముందుకు సాగుదమనియే ఆతని కనిపించుచుండును. ముందున్న ఉన్నత లక్ష్యము

ఆతనిని "రావోయి, నా స్వరూపము ఇంకను నడిచిననేకాని అందదని ఆతనిని ఆహ్వానించుచుండును. ఉన్నతోన్నత - ఉత్తరోత్తర లోకసందర్శనముచేత ఆశ్చర్య చకితుడగుచున్న విజ్ఞానమయజీవి విసుగుకొనక, ఆయాసపడక గమ్యమును చేరువఱకు ప్రయాణమును కొనసాగించుచునే యుండును. ఇదియే విజ్ఞానమయకోశ మార్గ ప్రయాణవిధానము, ఫలమును. ముందుకు, ముందుకు చొచ్చుకొనిపోవుటయే ఆసాధకుని ఉద్యమము, లక్ష్యముకాని, వెనుకకు అడుగువేయుట ఎంత మాత్రమునుకాదు. మన వేదఋషులు, ఉపనిషదృషులు అట్టివారు. నేటి భౌతిక విజ్ఞాన పరిశోధకులు (Scientists) అట్టివారు. అట్టి గమ్యమును చేరుటకే-సృష్టిరహస్యమును భేదించుటకే మానవజీవియొక్క అవతరణము భూమిమీాద జరిగినది. ఆతడందుకే నిరంతరకృషిచేయవలసి యున్నాడు. ఏదో దుఃఖ నివృత్తి, పునర్జన్మ రాహిత్యము, ఆనందసిద్ధి అనెడి అల్ప లక్ష్యములే మానవ జీవిత పరమావధులుకావు. వీటిని మించిన-విశ్వమానవ శ్రేయోదాయకమైన - ఒకానొక అనిర్వచనీయమైన - గంభీర అగమ్యలక్ష్యమును చేరుటకు భేదించవలసిన రహస్యములు అనేకములున్నవి. సాధింపవలసిన సాధ్యములు లెక్కలేనన్ని యున్నవి. అట్టివిఉన్నవని కూడ విద్వాంసులు సైతము ఎఱుంగలేకున్నారు. ఈ అంశమును ఉపనిషత్తులే వక్కాణించినవి. కావున ఈ నాటికి వేదోపనిషత్తులకు వెలసిన భాష్యములు చాలవు. వారు చెప్పదగినంతవఱకే చెప్పినారు. చెప్పినను ప్రయోజనములేదను

కొన్నవాటిని చెప్పనేలేదు. విజ్ఞాన జీవనమున పరిణతుడగు చున్న నేటిమనుష్యుడు అట్టివాటిని అన్వేషింపవలసి యున్నాడు. వాటిని వెదకి పట్టుకొని స్వోపయోగముచేసి కొనవలసియున్నాడు. తద్ద్వారా విశ్వశ్రేయమును విస్తరించుటకై "శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః" అనుచు వాటిని లోకమునకు చాటవలసి యున్నాడు.

ఈ రహస్యమును కాళిదాసు కుమారసంభవ కావ్యములో శివపక్షముగా ఇట్లు వర్ణించినాడు. పరమశివుని సమాధిని వర్ణించుచు- "ఆత్మాన మాత్మ న్యవలోకయ న్తమ్" శివుడు తనను తనలోనేచూచుకొనుచున్నాడట. దీనికి భిన్న భిన్నార్థములను వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. కాని భావింపవలసిన అర్థమిది. శివుడంతటి జగత్కారణుడు తన్ను తనలో చూసుకొనుట యనగా తనస్వరూపమే అయిన విశ్వ మును తనలోనే చూచుకొనుచున్నా డన్నమాట. అదే ఆయన యొక్క సమాధి. అట్లే మానవునకును తనలోనిండి కానరాక నిగూఢమైయున్న విశ్వమును, విశ్వరహస్యములను సాధన విధానముచేత ఆవిష్కరించుకొని దర్శించిననాడే ధన్యత్వ మని దీని అంతరర్థము. అట్లుకాకున్న శివుడంతటివానికి సమాధియేమి, తనకుభిన్నముగా దర్శింపవలసినదేమి!

బ్రహ్మముగారీ విషయమును ఇంకొక ప్రకారముగా పలికినాడు- "తనలోన నున్న తత్త్వమెవ్వరు తెలిచిగనరన్న" అని. అనగా తనలో విశ్వము, విశ్వరహస్యములన్నియు

మాకు పగటిని అభిమానించెడి మిత్రుడను దేవుడు మేలుగూర్చుగాక ! అట్లే రాత్రిని అభిమానించు వరుణదేవుడును మేలుగూర్చుగాక. "ప్రాణో వై మిత్రః, అపానోవరుణః" అనెడి యజుర్వాక్యమునుబట్టి మిత్రావరుణులు ప్రాణాపాన స్వరూపులు. ఆ ప్రాణాపానములను ఆశ్రయించియే దేహమున జీవుడు నెలకొని యుండును. కాన వారు సుఖమునిచ్చు వారు కావలయును. అహోరాత్రములు రెంటిని నెలకొల్పు సూర్యుడు మాకు శుభంకరుడగుగాక. అట్లే జగత్పాలకులగు ఇంద్రుడును, బృహస్పతి(విశ్వకర్మ)యు శుభమును గూర్తురుగాక. అంతటను వ్యాపించియున్న విష్ణుదేవుడు మాకు మేలుకూర్చుగాక. ఇట్లనుటచేత రేలును పవళ్ళును, సర్వకాలములును మేము మంచిపనులను చేసి వాటి ఫలితములను పొందుదుముగాక అనియు, ఇంద్ర, బృహస్పతులు మమ్ము పాలింతురుగాక అనియు, సర్వవ్యాపక పరమేశ్వర శక్తి మాకు మంగళములను కూర్చుగాత మనియు చెప్పినట్లు అయినది.

"మధు నక్త ముతోషసో,
మధుమ త్పార్థివం రజః,
మధు ద్యౌ రస్తునః పితా." 1-91-7.

మాకు రాత్రులును, ఉషస్సులు (పగళ్ళు)ను మధు

మయములగుగాక. తల్లి వంటిదైన భూదేవియొక్క అణు పరమాణువులు మధుమయములగుగాక. తండ్రివంటివాడైన దివము (సహస్రారపరబ్రహ్మ) మాకు మధుమయమగుగాక. ఇట్లనుటచేత రేలు పవళ్ళు, ప్రత్యణు పరమాణువులు, సహస్రారస్థిత పరమాత్మ మా జీవితమును మధువిద్యా పూర్ణము చేసి అమృతత్త్వము నాపాదించుగాతమని తేలుచున్నది.

"భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః,
స్థిరైరంగై స్తుష్టువాంస స్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః." 1-89-8

ఓ ప్రకృతిలోని దివ్యశక్తులారా! మేము జీవించి యున్నంతవఱకు - అనగా జీవిత కాలమంతయు మా చెవుల చేత మంగళకర వాక్యములనే విందుముగాక. అట్లే జీవితాంతము కన్నులతో శుభములనే చూతుముగాక. మంచి పటుత్వముగల అంగములతోడి శరీరములచేత బ్రతికియున్నంత కాలము లోకక్షేమంకర కార్యములనే యొనర్తుముగాక. ఇట్లనుటచేత మానవులెట్లు జీవితకాలమునంతయు మనోవాక్కాయములచేత లోక సేవ చేయవలయునో వ్యక్తమగుచున్నదికదా.

పుట

"యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభి
ర్వి శ్లోకఏతు పథ్యేవ సూరేః,
శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః
ఆ యే ధామాని పరమాణి తస్థుః." ఋ. 10-13-1

దివ్యస్థానముల నధిష్ఠించియున్న అమృత పుత్రులగు మానవులందఱు దీని నాకర్ణింతురుగాక. అట్లువిని ధన్యులు అగుదురుగాక.

ఆలకింపు డమృతపుత్రు లంద ఱిద్ది.

"యద్గాయత్రీ విశ్వకర్మ ప్రసాదా సాదిత శ్శుభః
శ్రీఋగ్వేద రహస్యాఖ్యగ్రంథస్తాభ్యాం సమర్పితః."

శ్రీ ప్రజ్ఞానంద కృత ఋగ్వేద రహస్యాలు
సంపూర్ణము.

---

10
11
21
26
30
31
47
48
52
56
64
70
72
73
79
80
83
91
92
95
96
106
110
111
118
121

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 10 | 22 | సూక్షౌతి | సూక్ష్మౌతి |
| 11 | 3 | అనుషమ్న | అనుమ్న |
| 21 | 4 | గొప్పవాడును | నొప్పవాడును |
| 26 | 13 | క్రేత్రజ్ఞులైన | క్షేత్రజ్ఞులైన |
| 30 | 20 | నర్థములకు | నర్థములను |
| 31 | 19 | కుంభములకు | కుంభకములకు |
| 47 | 14 | అవీడ్వాటు | ఆవీడ్వాటు |
| 48 | 20 | ద్వైతాతీతత | ద్వైతాతీత |
| 52 | 21 | ప్రవర్తించునది | ప్రవర్తించినది |
| 56 | 18 | పూర్ణ | పూర్ణా |
| 64 | 6 | మిత్రావరణులు | మిత్రావరుణులు |
| 70 | 4 | పంతిః | పతిమ్ |
| 72 | 3 | వాగార్థముల | వాగర్థముల |
| 73 | 13 | తపస్సు | తమస్సు |
| 79 | 19 | (గ్రహింపదగనది) | (గ్రహింపదగినది) |
| 80 | 1 | చూపుచుందురు | చూపుచూచుచుందురు |
| 83 | 18 | జతప్రోత | ఓతప్రోత |
| 91 | 21 | చివరిరకు | చివరకు |
| 92 | 5 | విర్వకర్మ | విశ్వకర్మ |
| 95 | 12 | కలిగిన | కలిగిన భావములచేత, |
| 96 | 20 | తృష్ట | త్వష్ట |
| 106 | 7 | వ్యతిరేఖముగా | వ్యతిరేకముఖముగా |
| 110 | 1 | సుపర్ణులు | సుపర్ణులు |
| 111 | 22 | తేజోశ్రీ | తేజో |
| 118 | 22 | జగత్సృష్టి | జగత్స్రష్టి |
| 121 | 4 | సంద్రుకీ | సంద్రుక్ |

| | | | |
|---|---|---|---|
| 122 | 5 | స్తానము | సాంతము |
| 123 | 12 | జగద్బీజమును | జగద్బీజము |
| 128 | 4 | దినముకంఠెను | దివముకంఠెను |
| 131 | 17 | శీర్షోద్యా | శీర్ష్ణోద్యా |
| 135 | 13 | దేవల | దేవతల |
| 139 | 11 | అగుటకు | అనుటను |
| 160 | 20 | మ ర్త్యగిం | ఘ ర్త్యగ్ం |
| 161 | 21 | మంత్రములలో | మంత్రములతో |
| 162 | 20 | అపాంగ | అపాం |
| 168 | 8 | సంద్పన్ | సంద్రుక్ |
| 169 | 8 | యజమే | యజ్ఞమే |
| 172 | 6 | అప్రతాం | అప్రదేతాం |
| 176 | 4 | అజానమును | అజ్ఞానమును |
| 179 | 11 | అశాత్వతము | అశాశ్వతము |
| 188 | 10 | మహుధా | బహుధా |
| 188 | 21 | సిదాంతము | సిద్ధాంతము |
| 191 | 12 | మాన స్తం | మన స్తం. |
| 196 | 14 | జాలాదుల | జలాదుల |
| 217 | 8 | 1_60-1 | 1_161-1 |
| 221 | 7 | తత్సాక్షాకారము | తత్సాక్షాత్కారము |
| 223 | 19 | వ్యాహృతీయః | వ్యాహృతయః |
| 226 | 19 | అనుప త్తియు | అనుప ప త్తియు |
| 229 | 8 | త్ర్వాష్ట్రి | త్వాష్ట్రి |
| 263 | 21 | మూతస్మద్రక్షార్థంయే | మూతయేఽస్మద్రక్షార్థం. |
| 282 | 9 | స్త్రీ పుపుంసా | స్త్రీపుంసా |
| 283 | 18 | పుంపుంసక | పుంనపుంసక |

సర్వాత్మభావానికి నిదర్శనమైన

# యజుర్వేద దర్శనము రు. 30-00

నమక, చమక, విశ్వకర్మసూక్తాదుల విశేషార్థాలను వివరించేఅద్భుత గ్రంథం. "ఆచార్యులుగారు ఇదివరకు ఋగ్వేదం పరిశోధించి మూడు భాగాలుగా ఋగ్వేద దిగ్దర్శనం ప్రచురించారు. ఋక్కులలో అద్వైతభావన, కుండలినీయోగం ఉన్నాయని ఈ పుస్తకాల్లో వారు సప్రమాణంగా నిరూపించారు. తైత్తిరీయ సంహితలోని ఏడుకాండలలో చతుర్థకాండం చాలా ముఖ్యమయింది. ఇందులోనే రుద్రాభిషేక మంత్రాలయిన నమకం, చమకం ఉన్నాయి. వీటిని ఆచార్యులుగారు నిశితమైన అంతర్దృష్టితో తాత్త్విక, సామాజిక, నైతిక, మానవీయ దృక్కోణాలతో పరిశీలించి, వాటి గూఢార్థాన్ని అత్యంత శేముషీవైభవంతో అనుభూతి విశేషంతో ఆవిష్కరించారు. అనైక్యత, అశాంతి, ద్వేషం, దౌర్జన్యం, విలయతాండవం చేస్తున్న ఈ రోజులలో సర్వాత్మ భావనిక నిదర్శనమైన ఈ యజుర్వేద దర్శనం వెలువడడం ఎంతో ఆశ కలిగిస్తుంది."

—ఆంధ్రజ్యోతి

"విశ్వకర్మ తత్త్వనిరూపణ ప్రకాశనములు ఈ రచనమునకు పరమ లక్ష్యముగ భాసించినను, అనర్ఘములైన వైదిక వాఙ్మయ సంస్కృతి రత్నములుగూడ ఇందు తమకాంతులను వెదజల్లుచున్నవి. శ్రీవిద్యారణ్యులు శ్రీ విశ్వకర్మ స్వరూపప్రాశస్త్య ప్రాముఖ్యములను గుర్తించిరని తెలియుచున్నది. అయినను వైదిక పురాణ వాఙ్మయములలో వాటికి ఆపేరుతో

రాదగిన ప్రచారమురాలేదు. "ఏకంసత్"అనునుపనిషద్వాక్యము విశ్వకర్మను బోధించును. విశ్వకర్మ అనునది బ్రహ్మనామధేయమే – అని విజ్ఞలోకమునకు విశేషముగ నెఱుక కలుగజేసిన కీర్తి ప్రప్రథమముగా శ్రీమాన్ రాఘవాచార్యులవారికే దక్కినదనుకొందును. విశ్వరూపానిష్ఠులైన వీరి ప్రజ్ఞా ప్రతిభల విశ్వరూపము వీరి యీ గ్రంథములో వ్యక్తమగుచున్నది. వీరు వేదవేదాంత పురాణాది వాఙ్మయపాథోధిని మథించి విశ్వరూప బ్రహ్మద్వైత తత్త్వమును, తదిరములైన యనర్ఘ రత్నములను వెలికిదీసి సాధక, జిజ్ఞాసు పండిత, పరిశోధక లోకమునకు పాథేయముగ నందించినారు.

—శ్రీ భాగవతుల కుటుంబరావు, M. A.

"మీరు పంపిన" యజుర్వేద దర్శనము నందుకొని డెందమునకు అద్దుకొన్నాను. ఆధునిక కాలములో ఇట్టి గ్రంథములు వెలువడుట అరుదు. మీ దర్శనము ఆ యా వైదికాంశములపై తల స్పర్శిగా చేసిన రమణీయ విమర్శనము. నమక చమక రహస్యవివరణము, అర్థవివరణము నేను శ్రద్ధానుడనై పఠించి ప్రామాణికమైన మీ రచనమునకు పరితోషపడితిని. మీకు నాహార్ధమైన అభినందనలు.

—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
లలితానగర్, రాజమండ్రి - 5